# న్యాయ వైశేషికములు
# సాంఖ్య యోగములు

శ్రీ శ్రీభాష్యం విజయసారథి

సర్వవైదిక సంస్థానమ్
కేంద్ర కార్యాలయము :
యజ్ఞవరాహ క్షేత్రము, కరీంనగరము

శ్రీ మహాలక్ష్మ్యైనమః

# ప్రస్తావన

తెలుగులో ప్రాచీన దర్శనములను గురించి (ఉత్తరమీమాంస తప్ప) అందులో న్యాయవైశేషికములను గూర్చి సాంఖ్యయోగములను గూర్చి విశ్లేషణ గ్రంథము లరుదనవచ్చు. ఆ లోపం తీర్చుటకై న్యాయ వైశే-షిక, సాంఖ్య యోగ దర్శనముల యొక్క స్వరూప స్వభావములు మరియు వాటి పరంపర సంక్షిప్తంగా తెల్పుటకు కొంత శ్రమ కావిం-పబడినది. ఆ శ్రమకు ఫలితంగా ఈ నిబంధం ఏర్పడింది.

అతి బాల్యముననే న్యాయ వైశేషికములపై విశిష్టమైన ఆస్థను కల్పించిన మా మాతామహులు శ్రీ కే. లక్ష్మణశాస్త్రి గారు. సాంఖ్యం పై అభిరుచిని రూపొందించిన మా బావ శ్రీ కాండూరు వెంకటా-చార్యులు గారు. పాంతంజలయోగం పై అభినివేశ మొనగూర్చిన మా మాతృమూర్తి విదుషీమణి శ్రీ శ్రీభాష్యం గోపమాంబగారు - చిర-స్మరణీయులు

విద్యార్థి దశ నుండి అధ్యాపక పదవి చేపట్టిన 37 సంవత్సరముల వరకు అన్ని విధాల ఎదగటానికి భూమికగా, వేదికగా, ఆస్థానిగాను దోహద శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల - వ్యవస్థాపకులు శ్రీ ఆకారపు నర్సింగం గుప్త, వారి పుత్రులు ప్రస్తుత పాలకవర్గాధ్యక్షులు శ్రీ ఆకారపు రాజా చెన్న విశ్వేశ్వరరావు గారికి నేనెంతో ఋణ-పడియున్నాను. ఆ ఋణవిమోచనకు ప్రతీకగా ఈ గ్రంథం వారికి అంకితం కావించటం నా భాగ్యంగా భావిస్తున్నాను.

నా సారస్వత తపస్సునకు భంగం వాటిల్లకుండ కంటికి రెప్పలాగ నన్ను చూస్తున్న నా ధర్మపత్ని శ్రీభాష్యం హేమలత యొక్క పరిపూర్ణ సహయోగంకూడ ఈ గ్రంథావిర్భావానికి తోడ్పడింది.

ఈ దర్శనముల యొక్క వ్యాసంగం గ్రంథరూపంగా శుద్ధప్రతిని తయా-

రుచేసిన నా ప్రియమిత్రులు శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల ప్రాంశుపాలురు శ్రీ ఎస్. ఎల్. నరసింహాచార్యులు - అభినందనీయులు

ఈ దర్శనములపై సమగ్రంగా, పరిశీలనాత్మకంగా నిబంధం వ్రాయటా-నికి ప్రేరేచిన శ్రీవిద్యారణ్య విద్వద్గోష్ఠి వరంగల్ వారికి - కృతజ్ఞతలు

ఈ గ్రంధం ప్రచురించటానికి అర్ధపరంగా సహకరిస్తూ, సర్వవైదిక సంస్థాన సర్వతోముఖ వికాసానికి, నా కండగా నిలిచిన వదాన్యసభ్యుల సహకారం మరువరానిది. ముఖ్యంగా నా నీడగా నిలిచిన సర్వవైదిక సంస్థాన ప్రధాన కార్యదర్శి శ్రీ వి. మోహన్ రెడ్డి, యజ్ఞవరాహ క్షేత్రనిర్వహణను ప్రాణసమానంగా భావిస్తూ కావిస్తున్న విశిష్ట కార్యవ-ర్గసభ్యులు, శ్రీ మాదాటి కృష్ణారెడ్డిగారు, అడ్వకేట్, కరీంనగర్, ఇతర కార్యవర్గసభ్యులు సర్వధా, సర్వదా, అభినందనార్హులు.

సర్వాంగ సుందరముగా ముద్రించి ఇచ్చిన శ్రీ ముదిగొండ వీరభద్ర-య్యగారికి హార్దికాభినందనలు తెలుపుచున్నాను. ఇందరి సహకారంతో రూపొందిన ఈ గ్రంథము జిజ్ఞాసువులకు ఉపకరించునేని ఇంతకన్న రచయిత కోరవలసిన దేముంటుంది.

ఇతి శమ్

ఇట్లు
రచయిత

# న్యాయవైశేషిక దర్శనములు

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్
తత్ త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే.

సత్యమైన వస్తువు యొక్క స్వరూపము సంశయ విపర్యాది రూప వివిధ భ్రాంతి విచిత్ర చమత్కారములను కల్పించే పాత్రతో కప్పబడినది. ఓ సృష్టి కర్తా! పరమాత్మా! ఆ వస్తువు యొక్క నిజరూపం బయటపడే విధంగా ఋషి శక్తినిగాని, ఏదైనా ఒక ఉపాధినిగాని ప్రవేశపెట్టి, దాని ద్వారా ఆ ఆవరణ పాత్రను తొలగించుము. దాని వలన సత్యమైన ధర్మతత్త్వము మాకు అభివ్యక్త మౌతుందని శ్రుత్యర్థము.

ఈ మంత్రములోని పాత్ర పదమునకు భాజనమనే అర్థం కాకుండా పత్రాణాం సమూహః అనే అర్థం గ్రహిస్తే శ్రుతి తాత్పర్యం స్పష్ట ముగా బోధపడగలదు. తామరరేకుల వంటి ఎన్నో పొరల క్రింద వస్తు తత్త్వము మరుగున పడియున్నది. ఏ పొరపై దృష్టి నిగుడించిన, ఆపొరయే నిజమైనదిగా తోచునటుల వివిధ భ్రాంతి చమత్కారములు గొల్పుచున్నది. అందువలన ఏ పొరవారికి ఆ పొరయే పరమార్థముగా భాసిల్లుచున్నది. ఈ అర్థమును మననము చేసికొనిచూసినచో ఇన్ని దర్శనములు ఎందు లకేర్పడినవో తేటతెల్లము కాగలదు. చార్వాకం మొదలుకొని వేదాంతం వరకు, ఆ వేదాంతములోని శాఖోపశాఖల వరకు, ఎన్నో దర్శనోపదర్శన ములు పుట్టినవి, పుట్టుచున్నవి. వీని యొక్క ఉత్పత్తి వికాసములకు పై పొరలే కారణము. అయినను ఆ మంత్రద్రష్టలు ప్రస్తుతంలేరు. యోగము ద్వారా దివ్యజ్ఞానమును బడసి భూతభవిష్యద్వర్తమాన కాలిక విషయ ములను, సూక్ష్మాంశములను దర్శించేవారు అతరించినారు. వారి పరంపర తొలగిపోయినది. మనకా దివ్యదృష్టి లేదు. వస్తుతత్త్వమును నిర్ణయించుటకు తగిన ప్రతిభాసము కావాలి కదా! ఇదేమాటను నిరుక్తకారుడిట్లనెను. 'మను ష్యా వా ఋషిషూత్క్రామత్సు దేవా న్బ్రువన్, కోన ఋషిర్భవిష్యతీతి,

తేభ్య ఏతం తర్కమృషింప్రాయచ్ఛన్'. దివ్యదృష్టి సంపన్నులైన ఋషులు అంతరించిపోగా మననశీలురైన మానవులు, అయ్యా! దేవతలారా! మాకు దివ్యదృష్టిగల ఋషిని ప్రసాదింపుడు అని ప్రార్థింప, మానవులారా! మీకు తర్కమే ఋషిగా ఉపకరించగలదని దేవతలు తెలిపినారు. ఈ నిరుక్తకారుని మాటల వలన తర్కము వలన ఎంతో ఉపయోగముకలదని తర్కశక్తి ద్వారా వస్తువిషయక నిర్ణయజ్ఞానము చేకూరగలదనియు విశదమగుచున్నది.

తర్క మనగా, 'అవిజ్ఞాతేఽర్థే కారణోప పత్తితః, తత్త్వ జ్ఞానార్థమూహః' అని అర్థము. అర్థములేదా తత్త్వము స్పష్టముగా విశదము కానప్పుడు, నిర్ణయము కానప్పుడు, యుక్తుల మూలముగా హేతువుల మూలముగాను, ఉపపాదన కావించి, యథార్థ జ్ఞానమును రాబట్టే ఊహ అని పై మాటల అర్థము. మనకు ప్రమాణములు నాలుగు కలవు. అవి ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము అని. ఇవియే కాకుండ అర్థాపత్తి, ఉపలబ్ధి, ఐతిహ్యాదులను మరికొన్ని ప్రమాణములు చేర్చబడినవి. ఇవియన్నియు సత్యమైన ధర్మమును దర్శించుటకై తోడ్పడునట్టివి. 'సత్యధర్మాయ దృష్టయే' అను శ్రుత్యర్థమును పురస్కరించుకొని వేదవ్యాసుడు, సచ్చిదానంద స్వరూపుడైన బ్రహ్మమును తెలిసికొనుటకై, తదవాప్తిని సాధించుటకై వేదాంత సూత్రములను గ్రథించినాడు. ఋగాది రూపజ్ఞానము బ్రహ్మోపదిష్టమైనందున, అది శబ్దబ్రహ్మమైనందునను, దాని స్వతః ప్రామాణ్య సిద్ధికై 'అథాతో ధర్మజిజ్ఞాసా' ' చోదనాలక్షణోఽర్థో ధర్మః' ఇత్యాది సూత్రరూపమున మహర్షి జైమిని, 'సత్యధర్మాయ దృష్టయే' అను శ్రుత్యర్థమునకు ఉపబ్రంహకంగా కర్మమీమాంసా దర్శనమును ప్రవచించినాడు. అట్లే ఆ శ్రుత్యర్థమును పురస్కరించుకొని, 'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః' 'యతోభ్యుదయనిశ్శ్రేయసిద్ధిః సధర్మః' ఇత్యాది సూత్రముల రూపమున, మహర్షి కణాదుడు వైశేషిక దర్శనమును, తదుపపాదనార్థము, తద్విశదీకరణార్థము, గౌతమ మహర్షి న్యాయ దర్శనమును నిర్మించినాడు. 'సత్యధర్మాయ దృష్టయే' అను దానిని ప్రతిపాదించుటకై అనగా జడచేతన వివేచన సంభవించినపుడుగాని త్రివిధ దుఃఖాత్యంత నివృత్తి కలుగదు అని తలంచి, పంచవింశతి తత్త్వప్రతిపాదకముగా మహర్షి కపిలుడు సాంఖ్య దర్శనమును ప్రసాదించినాడు. ప్రకృతి బంధము విడిపోయినపుడే జీవపురుషుడు పరమపురుషుని సాయుజ్యం పొందు

టకు అర్హుడు కాగలడు. తద్బంధ నివృత్తికి, పరమ పురుష సాయుజ్య సిద్ధికి, యోగమెంతో ఉపకరించునని మహర్షి పతంజలి, 'సత్యధర్మాయ దృష్టయే' అనే శ్రుత్యర్థ ప్రేరణ వలన యోగదర్శనము ననుగ్రహించినాడు. ఇవి యన్నియు ఆస్తిక దర్శనములు. ఈ దర్శనముల కన్నింటికి శ్రుతిప్ర మాణమయినను, ఆ శ్రుత్యర్థమును యుక్తి పురస్సరముగా హేతుబద్ధముగా ఉపపాదించుటకు తర్కము కూడా ఎంతగానో ఉపకరించే ప్రమాణమైనది. నిరీశ్వర వాదులను, విశేషముగా బౌద్ధ నైయాయికులను ఉదయనాచార్యులు 'న్యాయకుసుమాంజలి' యందు ఈశ్వరసత్తను అనుమానముతో సాధించు టకై ఎనిమిది హేతువులను ప్రదర్శించినాడు. ఆ హేతువులతో ఈశ్వర ప్రామాణ్యము సాధింపబడినది. అద్వైత మతస్థాపనాచార్యుడైన సర్వద ర్శన సంగ్రహకర్తయు వేదప్రామాణ్య వాదియయ్యు తర్కమును కాదనలేక పోయినాడు. ఔలూక్య దర్శనము యొక్క ఉపోద్ఘాతమునందు, ఈశ్వర సాక్షాత్కారము శ్రవణ మనన భావనాభావనీయము, అందును మననము అనుమానాధీనము; అనుమానము వ్యాప్తి జ్ఞానాధీనము; వ్యాప్తి జ్ఞానము పదార్థ వివేక సాపేక్షము అగుటవలన, 'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః' ఇత్యాది రూపమున కణాద మహర్షి పదార్థముల వ్యవస్థ వైశేషిక దర్శన ములో కావించినాడని సర్వదర్శన సంగ్రహకర్త తెలిపినాడు.

నిత్యజ్ఞానాశ్రయం వందే నిశ్శ్రేయస నిధిం శివమ్
యేనైవ జాతం మహ్యాధి తే నై వేదం నకర్తృకమ్

అని సర్వదర్శనసంగ్రహకర్త ఈశ్వర కర్తృకంగా జగత్తును, ఆదిమ శ్లోకంలో ఉపపాదించినాడు. ఏ దర్శనమైనా చెప్పేనది దుఃఖాత్యంత నివృత్తి పూర్వక శాశ్వతానందప్రాప్తి. వాత్స్యాయన భాష్యమున చికిత్సా శాస్త్రమువలె దర్శన శాస్త్రము కూడా చతుర్వ్యూహాత్మకము అని పేర్కొనినాడు.

'చికిత్సా శాస్త్రం రోగః, రోగహేతుః, ఆరోగ్యం, భేషజమితి యథా చతుర్వ్యూహం, తథేదమపి, సంసారః, సంసారహేతుః, మోక్షః, మోక్షో పాయః' అని

రోగము, రోగముల కారణము, వాని చికిత్స, ఆరోగ్యము అనునవి చికిత్సా శాస్త్రమునకు ముఖ్యాంగములు. అదే విధముగా సంసారము, సంసా

రహేతువు, శాశ్వతానందమైన మోక్షము, ఆ మోక్షమునకు ఉపయోగపడు, ఉపాయములు అను నాలుగంగములను గ్రహించి యోగాది దర్శనములు బోధించుచున్నవి. దుఃఖమయమగుట వలన సంసారము హేయము. హేయమగు సంసారమునకు హేతువు ప్రకృతి పురుషుల సంయోగము. తదాత్యంతిక నివృత్తి ద్వారా కలుగు శాశ్వతానందము మోక్షము. తదుపాయము సమ్యగ్దర్శనము. ఆ సమ్యగ్దర్శనము న్యాయవైశేషికాదులవలన సిద్ధించుచున్నది. ఇదే విషయము అక్షపాదదర్శనమందు సర్వదర్శన సంగ్రహకర్త ఇట్లు తెలిపినాడు. 'కస్యచిత్ చతసృభిః విధాభిః విభక్తం ప్రమేయం భావయతః సమ్యగ్దర్శన పదవేదనీయతయా తత్త్వజ్ఞానం జాయతే, తత్త్వజ్ఞానాత్ మిథ్యాజ్ఞానమపైతి, మిథ్యాజ్ఞానాపాయేదోషాః అపయాన్తి దోషాపాయే ప్రవృత్తిరపైతి ప్రవృత్త్యపాయే జన్మాపైతి, జన్మాపాయే దుఃఖమత్యన్తం నివర్తతే, సా అత్యంతికే దుఃఖ నివృత్తిరపవర్గః' ప్రత్యంశమును హేతు పురస్సరంగా విడదీసి, నిగ్గుదేరు విధంగా యథార్థమును బోధించుటలో అధికముగా ఉపయోగపడునది ఆన్వీక్షకీ. ఆన్వీక్షకీ అనగా న్యాయ విద్య. 'కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకం'. పదార్థముయొక్క సత్త, తదభావములను నిరూపించుటలో న్యాయశాస్త్రము బాగుగాతోడ్పడుచున్నది. ఇంద్రియగోచరమైన వస్తువును గ్రహించు విషయములో ప్రత్యక్షము ప్రమాణము అగుచున్నది. ఇంద్రియగోచరములు, దూరతః స్థితములు లేదా వస్తుగత సూక్ష్మాంశములు గ్రాహ్యమగుటకు ప్రత్యక్షప్రమాణము ఉపకరింపదు. కావున అనుమానప్రమాణమును అంగీకరింపవలసి వచ్చినది. అనుమానప్రమాణ సహకారములేకుండా, సాధ్యమైనవస్తువును సాధింపలేము. వస్తువుయొక్క సాధ్యతాసాధ్యతలను నిరూపించుటలో, అనుమానప్రమాణమెంతో సహకరించుచున్నది. హేతువుతో సాధింపదగిన వస్తువును సాధించుట యనునది, అనుమానప్రమాణములోని ముఖ్య విషయము. న్యాయశాస్త్రము అధికాధికముగా అనుమాన భూమికపైన వ్యవస్థితమైయున్నది. అందువలన న్యాయశాస్త్రమునకు హేతు శాస్త్రమను పేరుకూడా కలదు.

సామాన్యముగా న్యాయవైశేషికములు రెండును హేతుశాస్త్రములే. ఈ శాస్త్రమునకు న్యాయమను పేరు ఎట్లేర్పడినదో తెలుపవలసియున్నది. భారతీయ సాహిత్యములోన్యాయపదము అనేకార్థములలో వాడబడుచున్నది.

'వి' అను ఉపసర్గపూర్వక 'ఇణ్' ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము చేర్చగా న్యాయపదము నిష్పన్నమైనది. ఉచితమని దీనియర్థము. 'నీయన్తే - ప్రాప్యన్తే వివక్షితార్థాః అనేన అస్మిన్ వా' అను నిర్వచనానుసారము వస్తువిషయక జ్ఞానము సమగ్రముగా ఏర్పడుచున్నదను నర్థము వచ్చుచున్నది. 'నియమేన ఈయతే - నీయన్తి సంహరన్తి అస్మిన్' అనియు కొందరు నిర్వచించినారు. సుస్పష్టమగు వస్తువిషయముక జ్ఞానము దీనివలన సిద్ధించుచున్నది. కావున న్యాయమను అర్థము కూడా గ్రహింపవచ్చును. దృష్టాంతార్థమున న్యాయపదము వాడబడుచున్నది. స్థాలీపులాకన్యాయము, పంగ్వంధన్యాయము, ఇత్యాదులు.

దర్శనవాఙ్మయములో న్యాయపదమునకు 'నీయతే ప్రాప్యతే వినిశ్చితార్థ-సిద్ధిః అనేనేతి న్యాయః'. ప్రతిపాద్యవిషయము సిద్ధించుటకు ప్రధానముగా ఉపకరించే శాస్త్రము న్యాయశాస్త్ర మని పై నిర్వచనానికి అర్థము. వాత్స్యాయనుడు న్యాయభాష్యములో వివక్షితార్థ సిద్ధి పంచావయవ వాక్యమువలన చేకూరుచున్నదని నుడివినాడు. కావున పంచావయవ యుక్తమగు వాక్య సమూహామునకు న్యాయమను పేరేర్పడినది. 'పంచావయవోపేత వాక్యాత్మకో న్యాయః' అని వాత్స్యాయన న్యాయభాష్యము, ప్రతిజ్ఞ, హేతు, దృష్టాంత, ఉపనయ, నిగమనములు పంచావయవములు. దూరముగానున్న వ్యక్తి కొండపై నుండి వెలువడే పొగను చూచి, ఆ కొండ యందు అగ్ని ఉన్నదని అనుమానించునప్పుడు పంచావయవములుండును. (1) ప్రతిజ్ఞ - పర్వతమందు అగ్ని కలదు. (2) హేతువు - ఎందువలన? పొగ వలన. (3) దృష్టాంతము - పొగ ఉన్నచోట అగ్ని ఉండితీరుతుంది. వంటయింటివలె. (4) ఉపనయము - కావున పర్వతమందును పొగ కలదు. (5) నిగమనము - అందువలన పర్వతమందు అగ్ని ఉన్నది. ఇట్లు పంచావయవ వాక్యములతో అగ్ని సాధింపబడుచున్నది. ప్రమాణము లన్నింటిలోను ప్రముఖ ప్రమాణ స్థితిని 'అనుమానము' పొందుచున్నది. పై వాక్యములలో ప్రమాణములన్నియు ఇమిడి యున్నవి. ప్రతిజ్ఞలో శబ్దము, హేతువులో అనుమానము, ఉదాహరణములో ప్రత్యక్షము, ఉపనయములో ఉపమానము ఇమిడి పోవుచున్నవి. వీని సమష్టి స్వరూపము నిగమనము.

దీనిని దృష్టిలో పెట్టుకొని న్యాయవార్తికము 'సమస్త వ్యాపార ప్రమాణాత్ అర్థాది గతిః న్యాయః' సకల ప్రమాణ వ్యాపారముల ద్వారా సిసాధయిషి

తార్థ ఫలసిద్ధి న్యాయ పదవాచ్యమగునని పేర్కొనినది. వాత్స్యాయనుడు, 'ప్రమాణైః అర్థ పరీక్షణం న్యాయః' అని నిర్వచించినాడు. ప్రమాణముల ద్వారా, ఏదేని ఒక వస్తువును సమగ్రముగా పరీక్షించుట న్యాయమని నిర్వచ నార్థము. ఒక వస్తువును సరిగా పరిశీలించి నిర్ణయించుటలో ప్రమాణములు అవసరము ఎంతేని కలదు. దర్శనము లన్నియు ప్రమాణముల ద్వారా పదార్థ నిర్ణయమును జేయుచున్నవి. మీమాంసాదర్శనము ప్రమాణముల ద్వారా విధి నిర్ణయము గావించుచున్నది. కొందరు మీమాంసకులు 'మీమాంస న్యాయప్రకాశః, న్యాయ రత్నమాలా, న్యాయమాలావిస్తార' యని నామనిర్దేశము గావించినారు. ఇటువంటి విస్తృతార్థమును పురస్కరించుకొని వాదప్రతివాదన నిర్ణయార్థము న్యాయపదము లోకములోన వ్యవహరింపబడు చున్నది. వ్యవహార నిర్ణయార్థమునను న్యాయపదము ప్రయుక్తమగుచున్నది. స్వభావతః న్యాయపదమునకు గల అర్థము విస్తృతమైనది కాబట్టి ఆ పదము అనేకార్థములయందు ప్రయోగింపబడుట సబబే. ప్రత్యక్షానుమానాది ప్రమాణముల ద్వారా వస్తువుయొక్క యథార్థస్వరూపము అవగతమగుటకు ప్రధానముగా ఉపకరించునది న్యాయమని లేదా న్యాయదర్శనమని గ్రహించుట యుక్తము. కాని కేవలము గౌతమీయదర్శనార్థమున న్యాయపదము రూఢముగానున్నది. ప్రమాణములను ప్రముఖముగా వివేచన కావించుట ఈ దర్శనములోనే కలదు. అందువలన దీనికి ప్రమాణ శాస్త్రమను నామాంతరమేర్పడినది.

ఆన్వీక్షకీ అనునది న్యాయశాస్త్రము యొక్క ప్రాచీన నామము. 'అన్వీక్షా' పదమునుండి ఆన్వీక్షకీ పదమేర్పడినది. అను + ఈక్షా = అన్వీక్షా అనగా ప్రత్యక్షజ్ఞానానంతరము, తద్ జ్ఞానవిషయ వస్తువును పరి పరివిధాల పరిశీలించుట. దీనివలన సిద్ధించు నిశ్చయ జ్ఞానము, అనుమాన ప్రమాణ సిద్ధము. అనుమాన ప్రమాణ ప్రాచుర్యమును దృష్టియందుంచు కొనినందున ఆన్వీక్షకీ పదము సిద్ధించినది. 'ప్రత్యక్షాగమాభ్యాం ఈక్షితస్య అన్వీక్షణం అన్వీక్షా తయాప్రవర్తత ఇతి ఆన్వీక్షకీ న్యాయవిద్యా న్యాయశాస్త్రం' అని వాత్స్యాయనుడనినాడు. ప్రత్యక్షాగమములద్వారా జ్ఞాతమైన పదార్థమును పరిపూర్ణముగా అవలోకించుట లేదా తత్పరిజ్ఞానము కలుగుట అన్వీక్షార్థము. ఆ అన్వీక్ష ద్వారా ప్రవృత్తమైన విద్యకు 'ఆన్వీక్షకీ' అని పేరు.

ఆన్వీక్షకీ పదమునకు న్యాయవిద్యా న్యాయశాస్త్రములనునవి పర్యాయములు. న్యాయతర్కాది శబ్దములతో వ్యవహరింపబడునది ఆన్వీక్షకియే యని వాత్స్యాయనుడు, 'సేయమాన్వీక్షకీ న్యాయతర్కాది శబ్దైరపి వ్యవహ్రియతే' ఇత్యాది వాక్యములద్వారా తెలిపినాడు. ప్రత్యక్షాగమముల ద్వారా సంభవించే జ్ఞానము, అనుమాన ప్రమాణమూలమున సునిశ్చితమగుటచే న్యాయవిద్యకు అనుమానవిద్యయనియు, న్యాయశాస్త్రాధ్యయనము వలన వాదనైపుణ్యం లేదా శాస్త్రార్థ కళాప్రావీణ్యము సిద్ధించుటచే వాదవిద్యయనియు పిలువబడుచున్నది. అమరకారుడు కూడా 'ఆన్వీక్షకీ దండనీతిః, తర్కవిద్యార్థ శాస్త్రయోః' అని ఆన్వీక్షకీ తర్కవిద్యయని చెప్పినాడు. మొత్తము మీద న్యాయశాస్త్రమునకు ఎన్ని పేర్లున్నను జనసామాన్యములోనేమి, పండిత సామాన్యములోనేమి, న్యాయవిద్యయందు న్యాయదర్శనపదము రూఢమైనది. సర్వదర్శన సంగ్రహకర్త న్యాయదర్శనమును అక్షపాదదర్శనముగా వ్యవహరించినాడు.

## వైశేషిక పదనిరుక్తి :

వైశేషికపద నిర్వచన విషయములో భిన్నాభిప్రాయములు గలవు. సాధర్మ్యవైధర్మ్యముల ద్వారా సర్వదర్శనాపేక్షయా విశిష్టమైనందున వైశేషిక నామమేర్పడినదని కొందరందురు. 'విశిష్యతే సర్వతః వ్యవచ్ఛిద్యతే యే న సః విశేషః విశేషాభ్యాం సాధర్మ్యవైధర్మ్యాభ్యాం ప్రభవతి వ్యాహరతి వా వైశేషికమ్' అని పూర్వోక్తానుసారముగా వ్యుత్పత్తి చెప్పవచ్చును. వైశేషిక సూత్రములకు భాష్యమువ్రాసిన చంద్రకాంత తర్కాలంకారుడు 'యదిదం వైశేషికం నామ శాస్త్రమారబ్ధం తత్ఖలు తంత్రాంతరాద్విశేషస్య అర్థస్య అభిధానాత్' ఇతర దర్శనాపేక్షయా యీ దర్శనమునందు తత్త్వవ్యాఖ్యానము విశిష్టముగా నుండుట వలన నీ శాస్త్రమునకు వైశేషిక నామము చెల్లుతుందనినుడివినాడు. పదార్థముల యొక్క సూక్ష్మ విశ్లేషణ యీ శాస్త్రములో జరిగినరీతి ఏ శాస్త్రములో జరుగలేదనుట అతిశయోక్తికాదు. వేదాంతదర్శనము బ్రహ్మను గురించి ప్రధానముగా చర్చించుచున్నది. సాంఖ్యదర్శనము ప్రకృతీ పురుషవివేచన కావించుచు సర్వ తత్త్వములను ప్రకృతిలో నంతర్భావింపచేయుచున్నది. కాని వైశేషిక దర్శనము పై దర్శనములు చూపనటువంటి విశేషములను క్షోదక్షమముగా చర్చించుచున్నది. వైశేషిక దర్శన దృష్టికో

ణము సంశ్లేషణాత్మకము. 'ద్విత్వే చ పాకజోత్పత్తౌ విభాగే చ విభాగే చ యస్యనస్ఖలితాబుద్ధిః తం వై వైశేషికం విదుః'. అనగా సంఖ్యకు సంబంధించిన ద్విత్వోత్పత్తిలో, పాకజోత్పత్తిలో విభాగజ విభాగములో, స్ఖలింపని బుద్ధిగలవానికి వైశేషికుడను నామము సిద్ధించుచున్నదని యర్థము. షడ్దర్శన సముచ్చయ వృత్తిలో 'నైయాయికేభ్యో ద్రవ్యగుణాది సామగ్ర్యా విశిష్టమితి వైశేషికం'. నైయాయికాపేక్షయా ద్రవ్యగుణాది పదార్థముల తత్త్వ వ్యాఖ్య విశేషముగా నుండుట వలన వైశేషికమను నామము సిద్ధించినదని తెల్పబడినది. గౌతముడు ప్రతిపాదించిన షోడశ పదార్థములలో ధర్మధర్ముల యొక్క వివేచన స్పష్టముగా లేనందున, వాటి సాధర్మ్య వైధర్మ్యములను చక్కగా తెల్పుచు ద్రవ్యాది సప్తపదార్థముల వివేచన సువ్యవస్థితమైనందున, ఆ విశేషమిందు ప్రధానముగా ఉండుటవలనను, వైశేషిక నామము ప్రసిద్ధమైనదని సర్వదర్శన హిందీ వ్యాఖ్య తెలుపుచున్నది.

ఇతర దర్శనములు తెలుపని విశేషపదార్థమును విశేషించి చెప్పుట వలన కణాద దర్శనమునకు వైశేషిక నామము సిద్ధించినట్లు, 'విశేషం పదార్థమధికృత్య కృతం శాస్త్రమ్ వైశేషికమ్' అను న్యాయకోశ వాక్యమువలన తెలియుచున్నది. ప్రతి వస్తువులో నొక విశిష్టతత్త్వముండును. ఆ విశిష్ట సత్తా కారణముగా, ఒక పదార్థము మరియొక పదార్థము నుండి పార్థక్యము పొందుచున్నది. ప్రతి వస్తువులో వేర్వేరుగా విశేషముండునని వైశేషికములో నిరూపింపబడినది. సామాన్యమును విడదీస్తూ విడదీస్తూ పోగా అవశేషముగా ఇక విడదీయుటకు వీలులేకుండా యేది మిగులుచున్నదో దానికి విశేషమని పేరు. ఆ విశేషము ప్రతి వస్తువులోను ఉండుట ఆ వస్తువు యొక్క ధర్మం. ఈ వైశిష్ట్యమును కణాదదర్శనము వెల్లడించినందువలన దీనికి వైశేషికము అను వ్యవహారము సిద్ధించినది. 'అవిభాజ్యరూపేణ అవశిష్యతే ఇతి విశేషః' అని విశేష పదమునకు గల అర్థ నిర్వచనము ఆ నామమును సార్థకపరచుచున్నది.

వైశేషిక దర్శనమును ఔలూక్య దర్శనమను పేరుతో సర్వదర్శన సంగ్రహకర్త వ్యవహరించినాడు. శ్రీహర్షుడు నైషధీయ చరితము 22వసర్గలో :

ధ్వాంతస్యవామోరువిచారణాయాం వైశేషికంచారుమతంమతంమే
ఔలూక్యమాహుః ఖలుదర్శనంతత్క్షమంతమస్తత్త్వ నిరూపణాయ.

అను శ్లోకమున ఔలూక్య దర్శనమనినాడు. నైయాయిక పరంపర మహర్షికణా దుని వైశేషిక దర్శన ప్రణేతగా పేర్కొనుచున్నది. ఇతని తండ్రి ఉలూకుడు. అందువలన వైశేషికమునకు ఔలూక్య దర్శనమను నామము సిద్ధించినది. రాజ శేఖరుని వచనానుసారము కణాదునకు పరమేశ్వరుడు ఉలూక రూపమున సాక్షాత్కరించి ద్రవ్యాది పదార్థోపదేశము కావించినట్లు తెలియుచున్నది. 'మునయే కణాదాయ స్వయమీశ్వరః, ఉలూకరూపధారీ ప్రత్యక్షీభూయ ద్రవ్యగుణ కర్మసామాన్య విశేషసమవాయ లక్షణం, పదార్థషట్కం, ఉపదిదేశ'.

జైనపరంపర ననుసరించి వైశేషికదర్శనకర్త, కణాదుడు, దినమంతా గ్రంథరచన గావిస్తూ రాత్రి, ఉలూకమువలె, భిక్షాటనము గావించెడివాడని, ఇందువలన ఈ దర్శనమునకు ఔలూక్య దర్శనమను నామము సిద్ధించిన దని తెలియుచున్నది. గాఢాంధకారములో సయితము గుడ్లగూబ కన్నులు అతిసూక్ష్మ వస్తువులను కూడ గమనించును. ఆ ఉలూకమువలె రాత్రి ధాన్యకణాలను గ్రహించి భక్షించినందువలన కణాదు డనేనామము వచ్చినదని తెలియుచున్నది. వాస్తవ నామమే ఔలూకుడని కొందరనుచున్నారు.

## సారస్వతములో న్యాయవైశేషికముల విశిష్టత :

అన్ని దర్శనముల ఉద్దేశ్యము వివిధ దుఃఖముల ఆత్యంతిక నివృత్తిద్వారా కైవల్యప్రాప్తి. ద్రవ్యాది పదార్థములయొక్క తత్త్వజ్ఞానము మోక్షప్రయోజక మగుచున్నది. తత్త్వజ్ఞానము కలుగకుండ మోక్షము సిద్ధింపదు. అందు వలన పరమానుగ్రహోయాలువైన కణాదమహర్షి దుఃఖ కర్దమ నిమగ్నమైన ప్రపంచమును ఉద్ధరింపదలచి ఆన్వీక్షకీ విద్యను ప్రవర్తింపజేసినాడు. ఆన్వీక్షకీ విద్యమోక్షసాధనమగుచున్నది. ఈ అంశమును గౌతముడు న్యాయదర్శ నమందు ప్రథమ సూత్రరూపమున 'ప్రమాణ ప్రమేయ తత్త్వజ్ఞానాన్ నిశ్శ్రేయసాధిగమః' అని నిర్దేశించినాడు. కణాదుడును 'పదార్థానాం సాధ ర్మ్యవైధర్మ్యాభ్యాం తతత్త్వజ్ఞానాన్నిశ్శ్రేయసమ్'. పదార్థముల యొక్క తత్త్వజ్ఞానము మోక్షసాధన మని నుడివినాడు.

## కామందకీయ నీతిసారం :

'ఆన్వీక్షక్యాం ఆత్మ విజ్ఞానమ్ ధర్మాధర్మౌత్రయ్యాస్థితే. ఆన్వీక్షక్యాం ఆత్మవి-

ద్యాస్యాత్ తత్త్వజ్ఞానాత్ సుఖదుఃఖయోః, తత్త్వమాణస్తయా తత్త్వం హర్షశోకావ్యుదస్యతి'. ద్రవ్యగుణాది పదార్థ తత్త్వజ్ఞానము మోక్షసాధన మగుచున్నది. ఇది ఆత్మజ్ఞానమునకు తోడ్పడుచున్నదని తాత్పర్యము. శ్రీమద్భాగవతము పదకొండవ స్కంధములో -

'యమాదిభిః యోగపథైః ఆన్వీక్షిక్యా చ విద్యయా'.

అనే శ్లోకము పూర్వోక్త విషయమును బలపరచుచున్నది. 'న్యాయమీమాంసాధర్మశాస్త్రాణి' అను ఉపనిషద్వాక్యములో న్యాయపదము ప్రథమ నిర్దిష్టము కావటము వలన దాని ప్రాశస్త్యము వెల్లడియగుచున్నది. యాజ్ఞవల్క్యస్మృతి యందు 'పురాణం న్యాయ మీమాంసా ధర్మ శాస్త్రాంగ మిశ్రితాః' అని వేదాంగముగా న్యాయము పేర్కొనబడినది. మనువు 'అంగానివేదాశ్చత్వారః మీమాంసా న్యాయవిస్తరో' అని న్యాయమును నిర్దేశించినాడు. న్యాయము మీమాంసతోపాటు వేదోపాంగముగా పురాణములలో ఉల్లేఖింపబడినది. మనువు 'ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేదనేతరః'. వేదావిరుద్ధమైన తర్కశాస్త్రము ధర్మజ్ఞాన విషయములో ఎంతో ఉపకరించుచున్నదని తర్కము ద్వారా తత్త్వాన్వేషణ ఫలించునని నుడివినాడు. వాత్స్యాయనుడు న్యాయ భాష్యమునందు 'ప్రదీపః సర్వవిద్యానాం ఉపాయ సర్వకర్మణాం, ఆశ్రయస్సర్వ ధర్మాణాం, ముఖ్యోద్దేశః ప్రకీర్తితః' అని సర్వవిద్యాప్రదీపకంగా తర్కాన్ని కీర్తించినాడు.

వస్తుతః న్యాయవైశేషిక మహత్తు ఇంతా అంతా అని చెప్పలేము. 'మానాధీనామేయ సిద్ధిః' అన్నట్లు ప్రమేయ సిద్ధికి ప్రమాణమే ప్రధాన సాధనము. దీనిని బట్టే నైయాయికులకు ప్రమాణపటువనే బిరుదము అనాదిగా వచ్చుచున్నది.

న్యాయవైశేషికములు వేదమూలకములైనందున సకల విద్యలలో, సకల దర్శనములలో కూడ శ్రేష్ఠములుగా పేర్కొనబడినవి. భారతీయసారస్వతసౌధం న్యాయవ్యాకరణ స్తంభాలపై నిలిచియున్నదనుట సత్యదూరము కాదు. ఇవి రెండూ ప్రౌఢపాండిత్య పరాకాష్ఠకు ఎంతగానో ఉపకరించుచున్నవి. న్యాయశాస్త్రములో ప్రావీణ్యము గలవాడు ఇతర శాస్త్రములలో రాణించగలడు.

## న్యాయవైశేషికముల ప్రాచీనత :

న్యాయవైశేషికములు రెండు అతిప్రాచీన దర్శనములు. సుబాలోపనిషత్తులో న్యాయ శాస్త్రము పరమేశ్వరుని నిశ్వాసరూపముగా ఉగ్గడింపబడినది. దీనివలన న్యాయవైశేషికములు వైదికకాలికములని వేరే చెప్పబనిలేదు. వైదిక కాలములో స్వరపాఠ నిర్ణయార్థము న్యాయశబ్దము ప్రయోగింపబడెడిది. యజ్ఞ సందర్భమున పండితులలో పరస్పరము శాస్త్రార్థము జరుగుచుండెడిది. ఆ గోష్ఠిని న్యాయగోష్ఠి యని యనెడువారు. వైదిక కర్మానుష్ఠాన సందర్భమున పరస్పర విరోధము సంభవించినపుడు దానిని పరిష్కరించుటకై తర్కమును ఆశ్రయించెడివారు. దీనివలన న్యాయవైశేషికావిర్భావము వైదిక కాలములోనే జరిగినదని గ్రహింపవచ్చును. కణాద గౌతములు న్యాయవైశేషిక కర్తలుగా భావింపరాదు. వీరిని శాస్త్రప్రవర్తలుగా పేర్కొనుట సమంజసమగును. వాత్స్యాయనుడు న్యాయభాష్యములో 'జగదేవ దుఃఖపంకమగ్న ముద్దిధీర్షుః పరమకారుణికో మహర్షిః అక్షపాదః చతుర్దశ విద్యాసు అభ్యర్హితతమాం అన్వీక్షకీం సూత్రాకారేణ నిబబన్ధ న ఖలు నవంప్రణినాయ'. మహర్షి అక్షపాదుడు దుఃఖశాదము(ఊబి)లో మునిగి పోవుచున్న ప్రపంచమును ఉద్ధరింపదలచి చతుర్దశ విద్యలలో అత్యుత్తమముగా ఉన్న అన్వీక్షకిని సూత్రరూపమున పొందు పరచినాడు. ఆయన క్రొత్తగా వ్రాయలేదు అని అన్నాడు. ఇదే మాటను న్యాయవార్తిక కర్త ఉద్యోతకారుడు 'యదక్షపాదః ప్రవరోమునీనాం శమాయ శాస్త్రం జగతో జగాదేత్యత్రతనోక్తమ్ చకార' అని స్పష్టపరచినాడు. న్యాయమంజరీకర్త, 'ఆదిసర్గాత్ ప్రభృతి వేదవదిమాః విద్యాః ప్రవృత్తాః సంక్షేప విస్తార వవిక్షయాతుతాంస్తాం స్తత్ర కర్తౄనాచక్షతే'. వేదమువలె న్యాయవైశేషికములు ఆవిర్భవిల్లినవి యని వివక్షను బట్టి వాటికి సంబంధించిన సంక్షేప విస్తారములు, ఆయా మునులు కావించినందు వలన ఆయా ఋషులను ఆయా దర్శనకర్తలుగా పేర్కొంటున్నారని తెలిపినారు. ఉపనిషత్తులు న్యాయమును హాకోవాక్యముగా వ్యవహరించినారు. కాత్యాయనుడు న్యాయపదమును ప్రయోగించినాడు. పాణినికి పూర్వమునుండియే న్యాయపదము వ్యవహారములో ఉండెనని తెలియుచున్నది. ఉపనిషత్తులలోను న్యాయవైశేషికాలకు చెందిన అనేకాంశములు ఉట్టంకింపబడినవి. ఛాందోగ్యోపనిషత్తులో ఆకాశమును శబ్దవాహకముగా కీర్తించుట జరిగినది. ఆకాశము

ద్వారా మనుష్యుడు దేనినైనను వినజాలును, చూడజాలునని ఉపనిషత్తులు వచించినవి. ఈ సిద్ధాంతము న్యాయవైశేషికములకు సమ్మతమైనది. 'ద్వా సువర్ణా సయుజాసఖాయా' అనే మంత్రము న్యాయవైశేషికాంశములకు అతి సన్నిహితముగా నున్నది. ఆ దర్శనముల ప్రకారము జీవుడు ప్రతి శరీరములో భిన్నుడై ఉండునని ఫలాన్ని అనుభవించునని పరమాత్మ తదతీతముగా పృథక్కుగాను వెలుగునని వేదము తెలిపినది. వైశేషిక దర్శనము మరియు న్యాయ దర్శనము బుద్ధునకు పూర్వమే ప్రవర్తిల్లినవి. వైశేషిక దర్శనకర్త బుద్ధునకు 800 సం. పూర్వము ఉన్నటుల ఆర్య దేవుడు తెలిపినాడు. జైన దర్శన పరంపర కూడ ఈ రెండు దర్శనములు అతి ప్రాచీనములై నట్లు తెలిపినవి. బౌద్ధ దర్శనముపై న్యాయవైశేషిక ప్రభావము ఎంతో కలదు. వైశేషికుల అసత్కార్య ప్రభావము బౌద్ధుల నిర్వాణ సిద్ధాంతముపై స్ఫుటముగా స్ఫురించుచున్నది. జైనుల పరమాణువాదము కూడా వైశేషిక దర్శనమునకు ఎంతో ఋణపడియున్నది.

## న్యాయ వైశేషికముల సామ్యము :

న్యాయ వైశేషికములు రెండూ ఒకే శాస్త్రముగా పేర్కొనుట యుక్త మనిపించును. ఇరుదర్శనాలకుచెందిన పండితులు నైయాయికులుగానో, వైశే షికులుగానో, కీర్తింపబడుచున్నారు. ఉభయ దర్శనముల ప్రధానోద్దేశము పరమనిశ్శ్రేయసప్రాప్తి. తదుద్దేశసిద్ధికి తత్త్వజ్ఞానము ప్రధాన సాధనము. నామ రూపాత్మకమైన జగత్తంతా దుఃఖ రూపము. దుఃఖమునకు కారణము అజ్ఞానము. అజ్ఞాన నివృత్తి తత్త్వజ్ఞానము వలన సిద్ధిస్తున్న దని ఉభయ దర్శనములు సమానముగా తెలుపుచున్నవి. ఉభయదర్శనములు జీవాత్మ పరమాత్మ మనస్సు పృథివ్యప్తేజోవాయువులు వీటి పరమాణువులు, దిక్కాలాకాశములు అనువాటి 'సత్త'ను అంగీకరించుచున్నవి. ఈ రెండు దర్శనములు అనేక తత్త్వ వాదమును బాహ్యార్థవాదమును బలపరచుచున్నవి. ఈ రెండింటిని పరిశీలించినచో రెండూ పరస్పర పూరకంగా గోచరించుచు న్నవి. రెండు దర్శనములలోని సూత్రములను పరికిరిస్తే, మనకావిషయము స్పష్టమగుచున్నది. వైశేషిక మతానుసారము పేర్కొనిన పదార్థములు ప్రమే యములో అంతర్భవించునవి ('అస్తన్య దపి ద్రవ్య గుణ కర్మ సామాన్య

విశేష సమవాయాః ప్రమేయమ్') వాత్స్యాయనుడు తెలిపినాడు. షడ్దర్శన సముచ్చయమునకు చెందిన తర్కరహస్యదీపికలో 'నైయాయిక వైశేషికానాం ప్రమాణ తత్త్వానాం సంఖ్యాభేదేపి అన్యోన్యం తత్త్వానాం అంతర్భావనే అల్పీయానేవ భేదోజాయతే తేన ఏతేషాం ప్రాయో మతతుల్యతా' ప్రమాణ తత్త్వ సంఖ్యా విషయములో కొంత భేదమున్నను రెండు దర్శనములలోను ఇతర విషయాలపట్ల అంత అభిప్రాయ భేదము అగుపడదని తెలుపబడినది. సాంఖ్య యోగములు ఒక దర్శనమైనట్లు న్యాయ వైశేషికములు ఒకే తంత్రముగా భావింపవచ్చును. లేదా ఆ తంత్రము యొక్క రెండు విచార ధారలు లేదా రెండు శాఖలు న్యాయ వైశేషికములనుటలో అసామంజస్యము లేదు. న్యాయము ప్రమాణమీమాంసను ప్రస్తావించగా వైశేషికం పదార్థ మీమాంసను ప్రస్తుతించుచున్నది. న్యాయము జ్ఞాన మీమాంసపై కావించిన ప్రముఖ విచారధారగా, వైశేషికము పదార్థమీమాంసపై సాగిన విచారధారగా భావింపవచ్చును. ఇవి రెండును పరస్పరపూరకములు, అన్యోన్యాశ్రమములు. ప్రమాణజ్ఞానము లేకుండా పదార్థ జ్ఞానము సిద్ధించదు. పదార్థ జ్ఞానము లేకుండా ప్రమాణ జ్ఞానము సంభవించదు. కావున ఇవి రెండు కలసి ఏక దర్శనముగా రూపొందినవనుటలో దోషములేదు. జైన బౌద్ధ దర్శ నములు క్షీణించిన కొలది వీటిలో పరస్పర సాన్నిహిత్యము కొనసాగినది. పదవశతాబ్దము నుండియే పూర్వము విడిపోయిన రెండు విచారధారలు తిరిగి ఏకమైనవి. శ్రీధరాచార్యులు వైశేషికదర్శన ప్రశస్తపాదభాష్య టీకకు న్యాయకందలీ నామాన్ని నిర్దేశించుట పై విషయమును ఋజువు చేయు చున్నది. శివాదిత్యుని సప్తపదార్థ గ్రంథములో ఉభయదర్శనముల సమ న్వయము కానవచ్చు చున్నది. ప్రసిద్ధ నైయాయికుడు ఉదయనాచార్యులు రెండు దర్శనాలలోని విషయములను గ్రహించి లక్షణావళి కుసుమాంజలి ఆత్మతత్త్వవివేకం మున్నగు గ్రంథాలను గ్రథించినారు. అతని లక్షణావళిలో న్యాయదర్శనాంశములతోపాటు వైశేషిక పదార్థనిరూపణం కావింపబడింది. వరదరాజు తార్కికరక్ష కేశవమిశ్రుని తర్కభాష ఇత్యాది గ్రంథములు; ఉభయ దర్శనాలను విడదీయరానంత సంశ్లిష్టదశలోనికి తీసికొనివచ్చినవి. విశ్వనాథుని కారికావళి అతని సిద్ధాంతముక్తావళి, వైశేషికమతానుసారంగా వ్రాయబడి నను, సమవాహినిగా న్యాయదర్శనఛాయ ప్రసరించినది. తర్కసంగ్రహం,

తర్కామృతం, న్యాయసారం, తర్కకౌముది, న్యాయసిద్ధాన్త మంజరి ఇత్యాది గ్రంథములు ఉభయదర్శనముల ఉమ్మడి పంటగా మనకు గోచరిస్తవి. ఒక విషయాన్ని ముఖ్యంగా మనం గమనించాలి. ప్రమాణ మీమాంస - పదార్థ మీమాంసలన్న అంశములను ఇవి రెండు ప్రత్యేకంగా పేర్కొంటున్నందువలన వీటిలో ఈ పాటి భేదం పాటింపవలసిన అవసరం ఏర్పడింది.

## న్యాయదర్శనం :

బౌద్ధ యుగానికి ముందే న్యాయదర్శనం ఉత్పత్తిల్లిన్నది. న్యాయశాస్త్రాన్ని 3 విధాల విభజింపవలసియున్నది. బౌద్ధయుగానికి ముందున్న న్యాయం ప్రాచీనమని, బౌద్ధయుగంనాటి న్యాయం మధ్యన్యాయం అని భావించవచ్చు. ప్రాచీన న్యాయంలో న్యాయ వైశేషిక సూత్ర రచనలు అంతర్భవిస్తాయి. అట్లే వాత్స్యాయనుని భాష్యం ప్రశస్తపాదభాష్యం కూడ ప్రాచీనన్యాయ కోటిలోనే చేరుతవి. మధ్య న్యాయంలో బౌద్ధ దర్శనం, దాని సంఘర్ష ఫలితంగా ఏర్పడి వికసించిన వాచస్పతిమిశ్ర, జయంత, శ్రీధర, ఉదయనా చార్యాది విపశ్చిదపశ్చిమాది గ్రంథాలు రాణిస్తాయి. ఇక నవ్యన్యాయం 12వ శతాబ్దిలో ఆరంభమై అనేక ప్రకరణ గ్రంథాలకు దారి తీసింది.

## న్యాయ వైశేషిక దర్శనాచార్యులు :

న్యాయదర్శన ఆది ప్రవక్త మహర్షి గౌతముడు, పద్మపురాణం *'కణాదేన తు సంప్రోక్తం శాస్త్రం, వైశేషికం మతం, గౌతమేన తథా న్యాయం, సాంఖ్యంతు కపిలేనవై'* అని మువ్వురిని పేర్కొన్నది. స్కందపురాణం, వాయుపురాణం, న్యాయప్రవర్తకునిగా గౌతముని కీర్తించినవి. శ్రీమద్రామాయణంలోనూ గౌతముడు ఉగ్గడింపబడినారు. పౌరాణిక పరంపర గౌతముని న్యాయ ప్రవక్తగా కీర్తిస్తున్నది. న్యాయభాష్యం, న్యాయవార్తికం, న్యాయవార్తిక తాత్పర్యటీకా న్యాయమంజర్యాది గ్రంథాలు న్యాయశాస్త్ర ప్రవక్తగా అక్ష పాదుని పేర్కొన్నాయి. కాని ప్రతిమా నాటకం మాత్రం 'మేధాతిథేః న్యాయశాస్త్రం' మేధాతిథి నుండి న్యాయశాస్త్రం నేర్చుకొన్నట్లు తెల్పుచు న్నది. ఈ వాక్యమునకు మేధాదిది వ్రాసిన న్యాయశాస్త్రం అని కొందరు వ్యాఖ్యానించినారు. దీని వలన న్యాయశాస్త్ర ప్రవక్త గౌతముడా? మేధా తిథా? అనే విచికిత్స కలుగుతుంది. కొందరు గౌతమ పదం గోత్ర పదంగా

పేర్కొన్నారు. ఈ గోత్రంలో 'అక్షపాదుడు మేధాతిథి' అనువారు జన్మించినట్లు అక్షపాద గౌతముని ద్వారా ప్రమాణ ప్రధానంగా న్యాయశాస్త్రం ఆవిర్భావంచెంది, అధ్యాత్మ ప్రధానంగా న్యాయశాస్త్రం మేధాతిథి గౌతముని వలన ప్రవర్తిల్లినట్లు డా. విద్యాభూషణ్‌గారు తెలిపినారు. వాస్తవంగా మేధాతిథి, అక్షపాదుడు 'ఇరువురును ఒక్కరే'. పితృకృత నామం మేధాతిథి యని గోత్ర నామం గౌతముడని అక్షపాదనామం పురస్కారనామమనీ' పలువురి అభిప్రాయము. దీనికి ఉపోద్బలకంగా 'మేధాతిథిర్మహాప్రాజ్ఞో గౌతమః తపసి స్థితః విమృశ్యతేన కాలేన పత్న్యాః సంస్థా వ్యతిక్రమమ్ అని తెలుపుతున్నది. మేధాతిథి పాదమునందు దృష్టియుండుటవలన అక్షపాదుడు అనే నామం వచ్చినట్లు కొన్ని అఖ్యానములు తెల్పుచున్నవి. గౌతముడు రామాయణ మహాభారతాది ఇతిహాసములలో, శతపథ బ్రాహ్మణములో ఉపనిషత్తులలోను కీర్తింపబడినాడు. కావున ఇతని కాలం వేదబ్రాహ్మణ యుగానికి చెందినదిగా సమాలోచకులు భావిస్తున్నారు. ఇతని సూత్రమయమైన న్యాయదర్శనం ప్రథమ గ్రంథము. ఈ దర్శనములో 5 అధ్యాయములు, ప్రతి అధ్యాయములో 2 ఆహ్నికాలు కలవు. సుమారు 500 సూత్రములు ఉన్నవి. ప్రథమాధ్యాయం ప్రథమాహ్నికంలో ప్రమాణాలు ప్రమేయాలు, సంశయ ప్రయోజనాదులు, దుఃఖాపవర్గాలు, నిరూపింపబడినవి. ద్వితీయాహ్నికంలో హేత్వాభాసలు, వాదజల్పవితండాదులు ప్రతిపాదింపబడినది. ద్వితీయాధ్యాయంలో ప్రమాణ విషయమున పూర్వపక్ష సిద్ధాంతములు కావింపబడినవి. తృతీయాధ్యాయంలో ఆత్మ ఇతర ప్రమేయాల విచారం, ఆత్మ నిత్యత్వం గురించిన చర్చ కొనసాగింది. చతుర్థాధ్యాయంలో దోష ప్రవృత్తి దుఃఖాపవర్గాది సమీక్ష కావింపబడింది. 5వ అధ్యాయంలో 24 జాతి భేదములు 22 నిగ్రహస్థానములు ఉగ్గడింపబడినవి.

## వాత్స్యాయనుడు :

ఇతడు న్యాయసూత్రములపై మొదటి భాష్యకర్త. వాత్స్యాయనుని జన్మ, స్థితిగతులు తెలియవు. హేమచంద్రుడు అభిధానచిన్తామణిలో వాత్స్యాయనుని పక్షిలస్వామిగా కౌటిల్యునిగా చాణక్యునిగా కీర్తించినాడు. న్యాయసూత్రములకు భాష్యం అర్థశాస్త్రం కామసూత్రములు ఇతడే వ్రాసి

నట్లు హేమచంద్రుడు పేర్కొన్నారు. న్యాయభాష్యం ముగింపులో 'మోక్ష పాదమృషిం నాన్యః ప్రత్యగాత్ వదతాంవరం తస్య వాత్స్యాయన ఇదం భాష్య జాతమవర్తయత్' అని వాత్స్యాయన నామము నిర్దేశింపబడి నది. న్యాయవార్తిక గ్రంథం చివర కూడా 'యదక్షపాదప్రతిమో భాష్యం వాత్స్యాయనో జగౌ' అనియు కలదు. దీనివల్ల న్యాయసూత్ర భాష్యకర్త వాత్స్యాయనుడని తెలియుచున్నది. కాని వాచస్పతిమిశ్ర మాధవాచా ర్యులు ఇరువురును భాష్యకర్తగా పక్షిలస్వామిని నిర్దేశించినారు. పురాణాలలో న్యాయసూత్ర భాష్యకర్తగా వాత్స్యాయనుడే కీర్తింపబడినాడు. వాత్స్యాయ నుని అపరనామము పక్షిలస్వామి కావచ్చు. వాత్స్యాయనుడు 'పతంజలి' దశదాడినియని అను ఉదాహరణములను ప్రస్తుతించుటవలన, కౌటిల్యుని అర్థ శాస్త్రాన్ని ఉట్టంకించుట వలన, నాగార్జునుని ఆక్షేపాలను తన భాష్యంలో ప్రత్యాఖ్యానం కావించుటవలనను, దిఙ్నాగాచార్యుల సమకాలికుడై యుండ వచ్చును.

## కణాదుడు :

వైశేషిక దర్శనకర్త మహర్షి కణాదుడు. పద్మపురాణాదులలో వైశేషిక ప్రవర్తకునిగా కణాదుణ్ణి కీర్తించటం జరిగింది. 'కణాన్ అత్తి ఇతి కణాదః'. కణములను ఏరుకొని తింటూ జీవిక గడిపినందువలన కణాద నామం వచ్చినట్లు తెలియుచున్నది. 'తస్యకాపోతీం వృత్తిమనుతిష్ఠతః రథ్యానిపతితాన్ తణ్డులకణాన్ ఆదాయ ప్రత్యహం కృతాహార నిమిత్తాత్ సంజ్ఞా అని న్యాయ కందలీకర్త శ్రీధరాచార్యులు పేర్కొనుచున్నారు. పావురం వలె ప్రతిదినం బియ్యపు గింజలను ఏరుకొని తింటూ శాస్త్ర నిర్వహణ దీక్షను నెరవేర్చినం దున ఈ సంజ్ఞ వచ్చియున్నదని తెలిపినాడు. కణాదసంజ్ఞా విషయమున పలువురు పలురకాల అభిప్రాయం వెల్లడించినారు. 'కణాన్ పరమాణూన్ అత్తి సిద్ధాన్తత్వేన ఆత్మసాత్కరోదీతి కణాదః'. కణములనగా పరమాణువులు. అట్టి పరమాణువాద సిద్ధాన్తాన్ని రూపొందించుట వలన కణాద పదము చరితార్థమౌతుందని సర్వదర్శన సంగ్రహటీకా కర్త తెలిపినాడు. ఉదయనాచా ర్యులు కిరణావళిలో కణాదుని కశ్యప పుత్త్రునిగా పేర్కొన్నాడు. చంద్రకాంత తర్కాలంకారుడు కాశ్యపుడు, ఉలూకుడు, ఔలూక్యుడు మున్నగు నామము

లతో కణాదుని నిర్దేశించినాడు. 'సచాయం మహర్షిః కశ్యపస్య గోత్రాపత్యం విరుద్ధాసిద్ధ సందిగ్ధమలింగం కాశ్యపో(బ్రవీత్ ఇత్యాదౌ కాశ్యపతయా అస్య ఉల్లేఖాత్ అపిచాయం ఉలూక ఇతి వా ఔలూక్య ఇతి వా అఖ్యాయతే'. జైన విద్వాంసుడైన రాజశేఖరుడు సాక్షాత్ శివుడే ఉలూక రూపమున ప్రత్యక్షమై ద్రవ్యాది పదార్థములను కణాదునకు ఉపదేశించుటవలన ఇత నికి ఉలూక నామము వాటిల్లినదని సర్వదర్శన సంగ్రహటీక తెలుపుతుంది. ప్రత్యర్థులు, కణాదుడు ప్రతివాదులపట్ల వాదములో భీకరంగా ఘోరంగా ప్రవర్తించుట వలన ఇతనికి ఉలూక నామం ఏర్పరచినారని 'ఉలూకో ఘోర దర్శనః' అను అర్థం ఉలూకపదం తెలుపుతుందని కొందరన్నారు. ఇంకా ఎందరో ఎన్నో విధాల కణాదునకు ఉపనామములు తగిలించినారు. వాయు పురాణం మహర్షి కణాదుని ప్రభాసదేశవాసిగా సోమశర్మ శిష్యునిగా శివుని అపరావతారంగా కీర్తించినది.

కణాదుని వైశేషిక దర్శనం న్యాయదర్శనం కంటె ఎంతో పూర్వ మైనది. పరమాణువాద కల్పన ద్రవ్యముల వర్గీకరణ, ఇత్యాద్యంశములు వైశేషిక దర్శనాపేక్షయా న్యాయ దర్శనం అపరవర్తి యని చెప్పవచ్చు. వైశేషిక సూత్రములు 10 అధ్యాయములలో విభక్తమైనవి. ప్రతి అధ్యా యానికి రెండేసి ఆహ్నికములు కలవు. 300 సూత్రములు కలవు. ప్రథమాధ్యాయం ప్రథమాహ్నికములో ద్రవ్యగుణకర్మల లక్షణ విభాగము, ద్వితీయాహ్నికములో సామాన్య వివేచన, ద్వితీయ తృతీయాధ్యాయాలలో నవ ద్రవ్యముల నిరూపణము చతుర్థాధ్యాయములో పరమాణువాద, అని త్యద్రవ్యముల ప్రతిపాదనము, పంచమములో కర్మ విషయము, షష్ఠములో ప్రాముఖ్యము ధర్మాధర్మములు, సప్తమాష్టములలో గుణములు, నవమములో అభావము, దశమములో సుఖదుఃఖాదులు తత్కారణములు వివేచింపబడినవి.

## రావణ భాష్యం :

ప్రమాణసముచ్చయమనే గ్రంథములో 'కేచిత్తథాన్యేతు' అనే షక్షము లను జినేంద్రబుద్ధి 'కేచిత్' అనుచోట శ్రాయస్కాదయః 'అన్యేతు' అనుచోట 'రావణాదయః' అని వివరణకావించినాడు. ఇతని వివరణాను సారం వైశేషిక సూత్రములో శ్రాయస్క భాష్యం, రావణభాష్యం ఉన్నట్లు

తెలియుచున్నది. ఉదయనాచార్యులు, తాను వ్రాసిన కిరణావళిలో పదార్థ ధర్మసంగ్రహంకన్న విస్తృతమైన భాష్యం ఉన్నట్లు తెలిపినాడు. పద్మనాభ మిశ్ర మతానుసారం అది రావణ భాష్య మౌతుంది. బ్రహ్మ సూత్ర శాంకర భాష్య, రత్నప్రభాటీకలో రావణ భాష్యం ఉల్లేఖింపబడింది. రావణ భాష్యంలో వైభాషికులను అర్ధవైనాశికులుగా పేర్కొన్నట్లు రత్నప్రభ తెలుపుతుంది. అనర్ఘరాఘవ నాటకంలో రావణుడు తనను వైశేషిక కటందీ పండితుడుగా పరిచయం చేసుకొంటాడు. కటందీ అనునది రావణభాష్యమే సుమా అని రుచిపతి ఉపాధ్యాయుడు తెల్పినాడు. మురారిభట్టుకాలందాకా రావణ భాష్యం ఉండియుండును. ప్రస్తుత మది మనకు లభించుటలేదు.

## ప్రశస్తపాద భాష్యం :

వైశేషిక సూత్రములపై ప్రశస్తపాదుడు పదార్థ సంగ్రహనామమున భాష్యం వ్రాసినాడు. ఈ భాష్యం వైశేషిక దర్శనమునకు మహా ప్రతిష్ఠ కావించే ప్రామాణిక గ్రంథము. ఇది స్వతంత్ర గ్రంథముగా కొందరు పరిగణించినారు. ప్రాచీనాచార్యులు, 'సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యైః సూత్రానుసారిభిః స్వపదాని చ వర్ణ్యంతే, భాష్యం భాష్య విదో విదుః' అని భాష్యాన్ని నిర్వచించినారు. సూత్రములననుసరిస్తూ పద అర్థాలను వ్యాఖ్యానించటము భాష్యం యొక్క లక్షణమైనచో, పద అర్థధర్మసంగ్రహములో సూత్రానుసరణము పాటింపబడక స్వతంత్రమార్గానుసరణము కావింపబడింది. ఇదొక మౌలిక గ్రంథంగానే పెద్దలు స్వీకరిస్తున్నారు. షట్పదార్థ వివేచన అతిస్పష్టంగా ఇందుకావింపబడుట వల్ల పదార్థధర్మ సంగ్రహనామము సర్వదా చెల్లుతుంది. సంగ్రహమనగా 'విస్తరేణోపదిష్టానాం, అర్థానాం సూత్ర భాష్యయోః నిబంధోయస్సమాసేన సంగ్రహం తం విదుర్బుధాః'. విస్తారంగా సూత్ర భాష్యములందు విశదపరచిన విషయాలను సంక్షిప్తంగా నిబంధించటం అని సంగ్రహ పదమున కర్థము. శంకరమిశ్రుడు పదార్థ ధర్మ సంగ్రహాన్ని ఒక ప్రకరణ గ్రంథంగా పేర్కొన్నాడు. మహత్తులోను, లోకప్రియతలోను, ఇది పరాకాష్ఠచెందిన గ్రంథం. అందువల్ల దీనిపై అనేకటీకలు, ఉపటీకలు, భాష్యాలు వెలువడినవి.

## వ్యోమశిఖాచార్యులు :

ఇతనికి వ్యోమకేశియను అపర నామము కలదు. ఇతడు దాక్షిణాత్యుడు. వ్యోమవతీయను పేర పదార్థధర్మానుగ్రహముపై టీక వ్రాసినాడు. ఇతడు హర్షుని కాలమునకుచెందినవాడని భావిస్తున్నారు. వ్యోమశిఖాచార్యుల మతమున ప్రమాణములు మూడు అంగీకరింపబడినవి. శ్రీధరాదివైశేషిక విద్వాంసులు వైశేషికమతం రెండు ప్రమాణములను నిరూపిస్తున్నట్లు తెలిపినారు.

## ఉద్యోతకరుడు :

వాత్స్యాయనభాష్యమునకు 'న్యాయవార్తిక'మను పేర టీక వ్రాసినాడు. ఈతడు భారద్వాజుడు. దిఙ్నాగాచార్యుల మతమును నిరసించుటకై తాను 'కుతార్కికాజ్ఞాన నివృత్తి హేతోః కరిష్యతే తస్యమయానిబంధః' టీక వ్రాసినట్లు తెలిపినాడు. న్యాయవార్తిక తాత్పర్యకర్త వాచస్పతిమిశ్రుడు, 'కుతార్కికైః దిఙ్నాగప్రభృతిభిః' అని కుతార్కిక పదమును స్పష్టంగా వివరించినాడు.

'ఇతి పరమర్షి భారద్వాజ కృతం న్యాయత్రిసూత్రవార్తికం సమాప్తం' అని 'యదక్షపాద ప్రతిమో భాష్యం వాత్స్యాయనో జగౌ అకారి మహత స్తస్య భారద్వాజేన వార్తికమ్' అనియు ఉద్యోతకరుడు తెలుపుకొన్నందున అతని నామం భారద్వాజుడు అని తెలియుచున్నది. భారద్వాజపదం బహుశః గోత్రనామం అయి ఉండును. గోత్రనామపరంగా ఎన్నోగ్రంథాలు ప్రాచీనకాలంలో వెలసినాయి. భారద్వాజుడు పాశుపతసంప్రదాయాచార్యుడు. 'ఇతి పాశుపతాచార్య శ్రీ భారద్వాజోద్యోతకరకృతౌ న్యాయసూత్రవార్తికే పంచమోధ్యాయః' అని స్వయంగా పాశుపతాచార్యునిగా తెలుపుకున్నాడు. సుబంధువుకూడా న్యాయస్థితిమివ ఉద్యోతకరూపం అని ఉద్యోతకరుని కీర్తించుటవలన ఉద్యోతకరుని కాలం షష్ఠశతాబ్దానికి పూర్వమని భావింపవచ్చును.

## వాచస్పతిమిశ్రుడు:

వాచస్పతిమిశ్రుడు న్యాయవార్తికంపై న్యాయవార్తిక తాత్పర్యటీక వ్రాసినారు. ఇతనికి అన్నిదర్శనములయందు సమవైదుష్యం కలదు. ఇతనిని షడ్దర్శనాచార్యునిగా పండితులెల్లరు కీర్తిస్తున్నారు. ఇతని గురువు త్రిలోచనమిశ్రుడు. వాచస్పతి మైథిలేయుడు. ఇతడు న్యాయశాస్త్రములో న్యాయ

వార్తికతాత్పర్యటీక, సాంఖ్యంలో సాంఖ్యతత్త్వకౌముది, యోగంలో తత్త్వ వైశారదీయవే యోగభాష్యటీకా, మీమాంసలో న్యాయకణికా, తత్త్వబిందు గ్రంథములు, వేదాన్తంలో భామతీ తత్త్వసమీక్షా రచించినాడు.

## జయంతభట్టు :

జయంతభట్టు గౌతముని న్యాయసూత్రములలో ముఖ్యమైన వాటికి న్యాయమంజరీ పేర వ్యాఖ్యగావించినాడు. కాదంబరీ కథాసారకర్త అభి నందుడు జయంతభట్టు పుత్రుడు. జయంతభట్టు పితామహుడు శక్తిస్వామి కాశ్మీరప్రభువైన లలితాదిత్యుని మంత్రిగా ఉండెను. దీన్నిబట్టి జయంతభట్టు కాలమును నవమ శతాబ్దిగా అంగీకరింపవచ్చును. జయంతభట్టు ప్రముఖనై యాయికుడు. గంగేశాది విద్వాంసులు ఇతనిని జరన్నైయాయికునిగా పేర్కొ న్నారు. వాచస్పతి మిశ్రుడు జయంతభట్టును తనగురువుగా పేర్కొన్నాడు. ఉదా.: 'అజ్ఞాన తిమిర శమనీం పరదమనీం, న్యాయమంజరీం రుచిరాం ప్రసవిత్రే ప్రభవిత్రే విద్యాతరవే గురవే నమః'

## భాసర్వజ్ఞుడు :

న్యాయదర్శనంపై న్యాయసారమనే ప్రకరణ గ్రంథం వ్రాసినాడు. రత్నకీర్తి తన అపోహసిద్ధి అనేగ్రంథంలో ఇతని న్యాయభూషణాన్ని ప్రస్తుతించినాడు. ఇతడు 1వ శతాబ్దానికి చెందినవాడు.

## ఉదయనుడు:

న్యాయవైశేషికేతిహాసములో మిరుమిట్లుగొల్పే వజ్రముగా ఉదయనాచా ర్యులను కీర్తింపవచ్చును. న్యాయవైశేషికములపై అనేక గ్రంథములను ఇతడు వ్రాసినాడు. ముఖ్యముగా ఇతని గ్రంథములు ఆరు. 1. న్యాయవార్తిక తాత్పర్యటీకపై వ్రాసిన పరిశుద్ధి యను టీక 2. ప్రశస్తపాద భాష్యముపై వ్రాసిన కిరణావళి వ్యాఖ్య 3. న్యాయకుసుమాంజలి 4. ఆత్మతత్త్వ వివే కము 5. న్యాయపరిశిష్టము 6. లక్షణావళి. ఉదయనాచార్యులు లక్షణావళి గ్రంథాంతమున 'తర్కాంబరాంత ప్రమితేష్వతీతేషు శకాంతతః వర్షేషూదయ వశ్చక్రే సుబోధాం లక్షణావళీం' - అని తెలిపినందున శకసంవత్సరములు 906ను లక్షణావళీ రచనాకాలముగా భావింపవలసి యున్నది. ఈయన

బౌద్ధులను బాగుగా ఏడిపించెడివాడట. వాస్తవముగా న్యాయ కుసుమాంజలి ఈశ్వరసత్తను సాధించుటలో అన్నివిధముల ఆరితేరిన గ్రంథముగా తలంపవచ్చును. ఒక పర్యాయము జగన్నాథపురికి ఉదయనుడు వెళ్ళినాడు. అప్పుడు జగన్నాథదేవాలయద్వారము మూయబడినందున దర్శనము కాలేదు. అందువలన విసిగి జగన్నాథుని గూర్చి -

ఐశ్వర్యమదమత్తోసి మామవజ్ఞాయ వర్తసే

ఉపస్థితేషు బౌద్ధేషు మదధీనా తవస్థితిః -

ఓ జగన్నాథా! ఐశ్వర్యమదమత్తుడవయి నన్నవమానపరచుచు లోపల ఉన్నావు. బౌద్ధులు తారసిల్లినప్పుడు నీఅస్తిత్వం మరుగు పడిపోవుచున్నది. నీసత్త నాస్వాధీనతలో కలదు అని శ్లోకభావము. బౌద్ధుల నిరీశ్వరవాదమును ఖండించి ఈశ్వరవాదమును ప్రముఖముగా చాటిన పరమాచార్యుడు ఉదయనుడని దీని తాత్పర్యము.

## శ్రీధరాచార్యులు :

శ్రీధరుడు దక్షిణ వంగదేశమున భూరిసృష్టిగ్రామమున జన్మించినాడు. తల్లి అశోకాదేవి. తండ్రి బలదేవుడు. ఈయన 10వ శతాబ్దోత్తరార్థమునకు చెందినవాడు. ఇతడు ప్రశస్తపాదభాష్యముపై న్యాయకందళి అనేటీకను వ్రాసినాడు. వైశేషిక సిద్ధాంతములను సమగ్రముగా తెలిపే గ్రంథముగా న్యాయకందళిని పెద్దలు పేర్కొనుచున్నారు. ఉదయనాచార్య శ్రీధరులిరువురును మొట్టమొదట అభావమునకు సప్తమపదార్థత్వమును యుక్తులతో స్థాపించినారు. ఆ నాటినుండి వైశేషికము సప్తపదార్థీదర్శనముగా కీర్తింపబడినది. అద్వయసిద్ధి, తర్కప్రదీప, సంవాదినీ సంగ్రహటీకలు - అనునవి ఇతని గ్రంథములు. న్యాయకందళిపై పద్మనాభుని న్యాయకందళీసారము, రాజశేఖరుని న్యాయకందళిపంజికా - అనుటీకలు ప్రసిద్ధివహించినవి. వైశేషికులలో శ్రీధరాచార్యులకు అతివిశిష్ట స్థానము కలదు.

## శివాదిత్యుడు :

ఇతడు 10వ శతాబ్దికి చెందినవాడు. ఇతడు శ్రీహర్షుని ఖండనఖండఖాద్యమును ఖండించినాడు. ఇతడు వ్రాసిన లక్షణమాల వైశేషిక దర్శన

ప్రతిష్ఠను పెంచునదిగా శంకరమిశ్రుడు కీర్తించినాడు. ఇతడు వైశేషిక దర్శనముపై 'సప్తపదార్థీ' అనే గ్రంథమును వ్రాసినాడు. అభావమును సప్తమ పదార్థముగా నిగ్గుదేల్చి చెప్పినవారిలో నితడొకడు. సప్తపదార్థి పై అనేక టీకలు వెలువడినవి. ఆ టీకలలో మల్లినాథుని నిష్కంటక టీక శార్ఙ్గధరుని మితభాషిణీ, భైరవేంద్రుని శిశుబోధినీ ఉల్లేఖింపతగిన టీకలు.

## శ్రీవత్సుడు :

ఇతడు ప్రశస్తపాదభాష్యముపై లీలావతియను వ్యాఖ్యవ్రాసినాడు. ఇతడు ఏడవ శతాబ్దికి చెందినవాడు. ఇంతకన్న ఇతని గూర్చి ఏమియు తెలియదు.

## వల్లభాచార్యులు :

వల్లభాచార్యులు ప్రశస్తపాదభాష్యముపై న్యాయలీలావతీ యను టీకను వ్రాసెను. ఉదయనాచార్యుల లీలావతి వలె ఇతని లీలావతి మహత్త్వపూర్ణమై పరమప్రామాణిక గ్రంథముగా కీర్తిని బడసినది. వల్లభాచార్యుని లీలావతిపై పద్మధరమిశ్రుని న్యాయలీలావతీ ప్రవేశ వంటి టీక లెన్నియో వెలసినవి. ఇతడు 12వ శతాబ్దికి చెందినవాడు.

## మధ్య న్యాయము :

ఈ యుగములో బౌద్ధన్యాయము జైన న్యాయము అను రెండు దర్శనములు విస్తరిల్లినవి. బౌద్ధము అతి ప్రాచీనము అయినను అది హేతువాదమున నిలిచినది. దిఙ్నాగాచార్యుల కాలమునుండియే కాననగును. బౌద్ధదర్శనములో సౌత్రాంతిక, వైభాషిక, మాధ్యమిక, యోగాచారములనే నాలుగు సంప్రదాయములు వెలువడినవి. ఈ సంప్రదాయములలో నాగార్జునుడు, అసంగుడు, వసుబంధువు వంటి దార్శనికు లుదయించినారు. అటులనే జైన ధర్మము నందును ఉమాస్వాతి ప్రకాండ దార్శికుడు. మహాత్ముడైన బుద్ధుడు మరియు జైన మహావీరుడు ఉపదేశించినవి రెండు దర్శనములైనవి. ఈ రెండు దర్శనములు వెలసిన కాలము ప్రమేయ ప్రధాన యుగము. ప్రమేయ ప్రధాన ధర్మము తరువాత వచ్చినది ప్రమాణ ప్రధాన ధర్మము. ప్రమేయాలను వివేచించుటకై నిర్దుష్టమైన ప్రణాళికను ఏర్పరచిన బౌద్ధులలో ఆచార్య దిఙ్నాగుడు జైనులలో ఆచార్య సిద్ధసేన దివాకరుడు ముఖ్యులు. బౌద్ధన్యాయమునకు దిఙ్నాగుడు

జైనన్యాయమునకు సిద్ధసేన దివాకరుడు జన్మదాత లనుటలో తప్పులేదు. దిఙ్నాగుని ప్రమాణ సముచ్చయమే అన్నిటికంటె ప్రముఖ స్థానము నలంకరించిన న్యాయగ్రంథము. ఇది లుప్తమైనది. దీనికి టిబెట్టు అనువాదము లభించుచున్నది. దిఙ్నాగుడు నైయాయికులు పేర్కొనిన నాలుగు ప్రమాణములలో ప్రత్యక్షానుమానములను రెండింటినే గ్రహించినాడు. వాత్స్యాయన భాష్యముపై వార్తికతాత్పర్య టీకాది నానావిధ వ్యాఖ్యా గ్రంథములు వెలువడినటుల దిఙ్నాగుని ప్రమాణ సముచ్చయముపై అనేక టీకా వ్యాఖ్యలు వార్తిక పంజికలు వెలువడినవి. శ్రౌతన్యాయాచార్యులలో వాత్స్యాయనునకు బౌద్ధ న్యాయాచార్యులలో దిఙ్నాగునకు నెంత పవిత్ర స్థానము గలదో జైన న్యాయాచార్యులలో సిద్ధసేన దివాకరునకు నంతటి స్థానము కలదు. ఇతడు న్యాయసారమనే గ్రంథమును వ్రాసి జైన న్యాయమునకు భిక్ష పెట్టినాడు. భద్రవాది ఉమాస్వాతి యను వారు కూడ జైన న్యాయమున కృషి చేసినను, వారు సిద్ధసేన దివాకరునివలె కీర్తింపబడలేదు. సిద్ధసేనుడు మొదలుకొని యశోవిజయుని వరకు ముప్పదియేడుగురు జైన విద్వాంసులు జైన న్యాయమును విస్తరింపజేసినారు. వారిలో మాణిక్యనంది- పరీక్షాముఖ సూత్రం, అభయ దేవసూరి- వాద మహోర్ణవము, ప్రభాచంద్రుని- ప్రమేయ కమల మార్తాండము, హరి భద్రసూరి- షడ్దర్శన సముచ్చయము, మల్లిసేనసూరి- స్యాద్వాదమంజరి ఇత్యాదులు జైన న్యాయములో నుల్లేఖింపతగిన గ్రంథములు.

## నవ్యన్యాయము :

జైన బౌద్ధములు క్షీణించిన యుగములో ప్రమాణ శాస్త్ర పరంపర ఎంతో విస్తరిల్లినది. ప్రాచీన న్యాయము సూత్ర వార్తిక భాష్య బద్ధముకాగా నవ్య న్యాయము నూతన శైలితో ప్రమాణ మీమాంసను విశదపరచినది. నవ్యన్యాయ ప్రవాహములో న్యాయవైశేషికేతర దర్శనములన్నియు మునిగి పోయినవి. నవ్యన్యాయ నిపుణులలో గంగేశోపాధ్యాయుడు, వర్ధమానుడు, పక్షధర మిశ్రుడు, కేశవమిశ్రుడు, శంకరమిశ్రుడు, రఘునాథ శిరోమణి, మధురానాథ తర్కవాగీశుడు, జగదీశతర్కాలంకారుడు, గదాధర భట్టాచార్యులు పరమప్రసిద్ధులు. నవ్యన్యాయము గాదాధరి జాగదీశీ భేదమున రెండు

శాఖలుగా వాద గ్రంథములు విస్తరిల్లినవి. నవ్యన్యాయము సర్వము వాద గ్రంథమయము అని పేర్కొనవచ్చును. అటుపిదప బాలబోధకై విశ్వనాథుని కారికావళి, అన్నంభట్టు తర్కసంగ్రహ దీపికలు న్యాయశాస్త్ర ప్రవేశమున ఎక్కుడుగా ఉపయోగపడు గ్రంథములు.

తొలుత న్యాయవైశేషిక దర్శనములు రెండు మొదట విడివిడిగా నేర్పడినను, పదార్థ మీమాంసలోనేమి ప్రమాణ మీమాంసలోనేమి, ఆత్మవాదముననేమి, వైషమ్యముకన్న సామ్యమే అధికముగా చోటు చేసి కొనినందున వాటి గమ్యము ధ్యేయము నొకటే యయినందున, ఆ రెండు విచార ధారలునూ ఐక్యమై నవ్యన్యాయరూపమున ప్రవహించినవని గ్రహించుటలో దోషములేదు. వైశేషిక దర్శనమున విషయములను మూడింటిని ప్రముఖములుగాను దుర్గమములుగాను, ఎంచుదురు. 'ద్విత్వేచ పాకజోత్పత్తౌ విభాగేచ విభాగజే, యస్యనస్ఖలితాబుద్ధిః తం వైశేషికం విదుః' ద్విత్వసంఖ్యా విషయములో పాకజోత్పత్తి విషయములో విభాగజ విభాగోత్పత్తి విషయములోను, ఎవని బుద్ధి నీరుకారదో, ఎవని ప్రతిభాపరిస్పందము పరిస్ఫురించుచున్నదో అతనిని వైశేషిక పండితునిగా గ్రహింతురు. అనగా ద్విత్వసంఖ్య పాకజగుణోత్పత్తి, విభాగజ విభాగము అనునవి దురవబోధములు. వాటిని విశ్లేషించి చెప్పుట ఆ పరీక్షలో నెగ్గుట వైశేషికునకు ఒరిపిడిరాయి అని తాత్పర్యము. ఈ మూడింటిని గూర్చి కొంత చెప్పవలసియున్నది.

## ద్విత్వసంఖ్య:

వైశేషిక దర్శనములో సంఖ్యను ఒక గుణముగా గ్రహించుట జరిగినది. సంఖ్యాగుణము ద్రవ్యము లన్నింటిలోను ఉంటున్నది. పృథివ్యాది ద్రవ్యములు తొమ్మిది. వానిలో కొన్ని నిత్యములు, కొన్ని అనిత్యములు కలవు. పృథివ్యాదిద్రవ్యములు కొన్ని అనిత్యములు. ఆకాశము కాలము ఆత్మ అనునవి నిత్యములు. పరమాణువులు కూడా నిత్యములే. కాని ఆ పరమాణువులచే నేర్పడు ద్వ్యణుక త్ర్యణుకాది కార్యద్రవ్యములన్నియు అనిత్యములే. నిత్య ద్రవ్యములలో నుండే యేకత్వ సంఖ్యాగుణం నిత్యమయినట్లే, అనిత్యద్రవ్యములలో నుండే యేకత్వసంఖ్య యనిత్యమగుచున్నది. అనిత్యద్రవ్యములన్నియు కారణ ద్రవ్యములవలన నేర్పడునవి. ఘటపటాదు

లన్నియు నిట్టివే. ద్రవ్యము పుట్టిన పిదప దానిలో గుణములేర్పడును. ద్రవ్యములలో నుండు గుణములకు ద్రవ్యము సమవాయి కారణము అగును. కావున అనిత్య ద్రవ్యములలో నేర్పడినటువంటి యేకత్వ సంఖ్య అనే గుణ మునకు సమవాయి కారణము ఆ సంఖ్య ఏ ద్రవ్యములో పుట్టుచున్నదో ఆ ద్రవ్యమే అగుచున్నది. ఆ ఏకత్వసంఖ్యకు అసమవాయి కారణము ఆ ద్రవ్యకారణములలోనుండు ఏకత్వ సంఖ్య అగుచున్నది. 'కారణగుణాః కార్యగుణానారభన్తే' అను యుక్తిని బట్టి కార్యద్రవ్యగత ఏకత్వ సంఖ్యకు కారణద్రవ్యగత ఏకత్వసంఖ్య అసమవాయికారణము అనుయుక్తి సమంజసమే అవుచున్నది. ద్విత్వాది సంఖ్యలు అంతట అనిత్యములే. ఒక ద్రవ్యములో ఏకత్వజ్ఞానము, ఆ ద్రవ్యము ఒక్కటియే అను జ్ఞానముకలుగుటకు అన్య ద్రవ్యమును అపేక్షింపవలసి యుండదు. ఏకత్వ జ్ఞానము అన్యద్రవ్యము నపే క్షింపదు. కావున నిరపేక్షమగును. ద్విత్వజ్ఞానము అన్యద్రవ్యమపేక్షింపక కలుగజాలదు. ద్వి = రెండు అను జ్ఞానము ఒక వస్తువుతో మరియొక వస్తువుచేర్చి లెక్కించినపుడే కలుగుచున్నది. ఇది ఒకటి ఇది ఒకటి అని చెప్పి, వాటిని కలిపి, ఇవి రెండని చెప్పుదురు. ఇట్లు అన్యవస్తువు నపేక్షింపక ద్విత్వ సంఖ్యాజ్ఞానము కలుగదు. అందువలన ద్విత్వము ఉత్పన్నమగుటకు అపేక్షాబుద్ధి యావశ్యమనక తప్పదు. అపేక్షాబుద్ధి యనగా అనేక వస్తువులలో వాటి సమూహమును, ఆధారపరచుకొని కలిగే జ్ఞానము. సజాతీయవస్తువులు కాని, విజాతీయ వస్తువుకాని అనేకం కంటిలో సన్నికృష్టమైనపుడు కలిగే జ్ఞానము అపేక్షాబుద్ధి అగుచున్నది. రెండు వస్త్రములను జూచి, రెండు వస్త్రములందుము. రెండు కుండలను జూచి ఇవి రెండు కుండలందుము. రెండును సజాతీయములే. ఒక వస్త్రమును, ఒక కుండను జూచి నపుడు కూడ ఇవి రెండు అనే జ్ఞానం కలుగుచున్నది. కాని వాటిని రెండు కుండలనియో, రెండు వస్త్రములనియో అనుట లేదు. వాటిని రెండు వస్తువులనే అనుచున్నాము. ఆ రెంటిలో వస్తురూప సజాతీయత కలదు. అట్టి సజాతీయతను ఆధారపరచుకొని అపేక్షాబుద్ధి కలుగుచున్నది. దానిమూ లమున ద్విత్వసంఖ్య తద్విషయక జ్ఞానముః నేర్పడును. విజాతీయ వస్తువులలో ద్విత్వాది సంఖ్యాజ్ఞానము కలిగినచోట కూడా సాజాత్యము వెల్లడిఅయి నను కాకున్నను, ఏదో యొక సజాతీయతను ఆధారము చేసికొనియే ఆ

పూర్వమున్న గుణములు నశించుట వలన వాటికి నాశ్రయమైన అవయవి ద్రవ్యము నశించినదని యంగీకరించినప్పుడు ఆ నాశము ద్వ్యణుకము వరకు తప్పదు. ఇట్లు ద్వ్యణుకము వరకు నవయవి నశించుటవలన పరమాణు వులు మిగులును. అవి నిత్యములు కావున నశింపవు. కాని వాటిలో నుండే శ్యామాది గుణములు (పాకము = అగ్ని సంయోగమువలన) నశించును. రక్తవర్ణాదులు క్రొత్తవి యేర్పడును. దానిలో కారణ గుణపూర్వకములైన కార్య గుణము లేర్పడును. ఇట్లు అవయవిలో పాకమేర్పడుటచే పీలుపాక సిద్ధాంతము సర్వథా సమంజసమని వైశేషికుల యభిప్రాయము.

## విభాగజ విభాగము :

సంయోగము, విభాగము అనునవి రెండు పరస్పర విరుద్ధ గుణములు. విభాగము సంయోగమును నశింపజేయుచున్నది. ఉత్తర సంయోగము విభా గమును నశింపజేయుచున్నది. అందువలన పరస్పర విరుద్ధములివి యని యందురు. సంయోగమువలన విభాగము కూడా 3 విధాల యేర్పడుచు న్నది. 1. అన్యతర కర్మజము 2. ఉభయకర్మజము 3. విభాగజము.

1. అన్యతర కర్మజ విభాగము: సంయుక్తములైన రెండు వస్తువులలో, ఒకదానిలో క్రియ యేర్పడినపుడు, ఆ రెండు వస్తువులు విడిపోవును. అది విభాగమనబడుచున్నది. దీనిని అన్యతర కర్మజ విభాగమని యందురు. ప్రతి సంయోగమునకు సమవాయి కారణము రెండు ద్రవ్యములు కాగలవు. వాటిలో నొకదానియందు క్రియకలిగినపుడు, ఆ రెండు ద్రవ్యములలో విభా గము కలుగుచున్నది. ఒక ఇంటిపై ఒక కాకి వాలిన దనుకొనుడు. ఆ ఇంటికి ఆ కాకికి మధ్య సంయోగము ఏర్పడును. కాకితో గృహమునకు గలి గిన సంయోగమునకు సమవాయి కారణము కాకి మరియు గృహము రెండు అగును. ఆ కాకి ఎగిరి పోయినపుడు కాకిలో క్రియ కలుగుచున్నది. కాకి యందు గల్గిన క్రియ - కాకికిని, ఇంటికి, మధ్య విభాగమును కల్గించును. ఇట్టి విభాగమునకు అన్యతర కర్మజ విభాగమని పేరు.

2. ఉభయ కర్మజ విభాగము : సంయోగమునకు సమవాయి కార ణములైన రెండు వస్తువులలో క్రియ యేర్పడి విభాగము కలుగుచున్నది. ఇట్టి విభాగమును ఉభయ కర్మజ విభాగమని యందురు. ఇరువురు వీరులు

పెనుగులాడునపుడు ఒకరితో నొకరు కలిసినప్పుడు వారిలో సంయోగము కలుగుచున్నది. వారు విడిపోయినపుడు ఇరువురిలోను క్రియ కలుగుచున్నది. అప్పుడు వారిలో విభాగ మేర్పడుచున్నది. ఇట్లేర్పడిన విభాగము ఉభయ కర్మజ విభాగము.

3. విభాగజ విభాగము : విభాగము గుణము. ఆ విభాగానికి సమవాయి కారణములు ద్రవ్యములగును. మొదట పేర్కొనిన విభాగములు (కర్మ వలన, క్రియ వలన) కలిగినవి. వాటికి అసమవాయి కారణము క్రియ అగుచున్నది. మూడవది యయిన విభాగజ విభాగమునకు, అసమవాయి కారణము కర్మకాకుండా విభాగమే యగుచున్నది. ఇక్కడ రెండు విభాగములుండును. విభాగము వలన కలిగిన రెండవ విభాగమునకు మొదటి విభాగము అసమవాయి కారణమగుచున్నది. కాని మొదటి విభాగమునకు మాత్రము అసమవాయి కారణము క్రియయేయగుచున్నది. ఉదాహరణకు - హస్తపుస్తక విభాగము వలన దేహ పుస్తక విభాగము కలుగుచున్నది. దేహ పుస్తక విభాగము హస్తపుస్తక విభాగము వలన నేర్పడినది. మరియు నిట్టి విభాగజ విభాగమునకు అసమవాయి కారణమైన ప్రథమ విభాగము రెండు విధములు. 1. మొదటి విభాగమునకు సమవాయి కారణమైన రెండు ద్రవ్యములలో నేర్పడునట్టి విభాగము మొదటిది. ఉదా. హస్తపుస్తక విభాగము 2. ఒకప్పుడు సమవాయి కారణమైన ద్రవ్యమునకు సమవాయి కారణము కాని ద్రవ్యమునకు మధ్య యేర్పడే విభాగము రెండవది. ఉదా. దేహ పుస్తక విభాగము. ఇట్లు విభాగజ విభాగమునకు అసమవాయి కారణమైన మొదటి కారణము రెండు విధాలైనందున దానివలన నేర్పడిన కార్యభూత విభాగము అనే రెండవ విభాగము కూడ ద్వివిధమగుచున్నది. ఇట్టి ద్వివిధకార్యభూత విభాగము క్రమముగా కారణద్వయ విభాగజ కారణాకారణ విభాగము, కారణాకారణ విభాగజ కార్యాకార్య విభాగముగా పేర్కొనబడుచున్నది.

## కారణద్వయవిభాగజ కారణాకారణ విభాగము :

ఏ ద్రవ్యములలో విభాగం కలుగుతుందో, ఆ ద్రవ్యములలోని సంయోగమును, ఆ విభాగము నశింపజేస్తుంది. దారములు వస్త్రములకు సమవాయి

కారణము. వస్త్రమునకు దారములు అవయవములు. వస్త్రావయవముల యిన తంతువులలో కలిగే విభాగం వస్త్రోత్పత్తి నారంభించు తంతువుల సంయోగమును నశింపజేస్తుంది. ఈ విభాగము ద్రవ్యారంభకమగు సంయోగ మును నశింపజేస్తుందని తాత్పర్యము. వస్త్రముత్పన్నమైన చోట వస్త్రావ యవ సంయోగమేకాక అవయవములతో ఆకాశానికి సంయోగముంటుంది. అంటే ద్రవ్యారంభక సంయోగ మొకటి ద్రవ్యము నారంభింపని సంయోగ మొకటి. వస్త్రావయవములైన తంతువులతో ఆకాశానికి సంయోగమున్నను ఆ తంతువులు పరస్పరము సంయుక్తము కాని యెడల పటముత్పన్నం కాజాలదు. కావున వస్త్రావయవముల సంయోగము ద్రవ్యారంభక సంయో గము. వస్త్రావయవ ఆకాశ సంయోగము, ద్రవ్యానారంభక సంయోగము, అనునవి రెండు సంయోగములు. దారాలలో క్రియ జరుగుట వలన విభాగం కలుగుతుంది. ఆ విభాగమువలన ద్రవ్యారంభక సంయోగము నశించినను ద్రవ్యానారంభక సంయోగము నశింపదు. ఎందుకనగా ఒకే విభాగం వలన ద్రవ్యారంభక సంయోగ నాశకత్వము, ద్రవ్యానారంభక సంయోగ నాశక త్వము అను రెండు విరుద్ధ ధర్మములు కలుగవీలులేదు. కాబట్టి తంత్వాకాశ సంయోగమును నశింపజేయుటకు మరొక విభాగం అంగీకరింపవలసి వచ్చినది.

ద్రవ్యారంభక సంయోగమును నశింపజేసే విభాగము, ద్రవ్యానారంభక సంయోగమును నశింపచేసే విభాగము అను రెండు విరుద్ధములయినందున ఒకే క్రియా రూప కారణము వాటిని కలిగింపజాలదు. అందువలన రెండవ కారణము సంభవింపనందున క్రియ వలన నేర్పడిన ద్రవ్యారంభక తంతు పరస్పర సంయోగ నాశక విభాగమువలననే రెండవది అయిన ద్రవ్యానారం భక తంత్వాకాశ సంయోగ నాశకోత్పత్తి అంగీకరింపబడుచున్నది. అనగా ప్రతి కార్యమునకు సమవాయి కారణ అసమవాయి కారణ నిమిత్త కార ణములను మూడు కాణములుండును. పూర్వోక్తోదాహరణములో ప్రథమ విభాగ రూపకార్యమునకు తంతువులు సమవాయి కారణములు. అసమవాయి కారణము తంతువులలో ఏర్పడే క్రియ, కాలాదృష్టాదులు నిమిత్తకారణములు. ఇక రెండవ విభాగమునకు తంతువులు ఆకా: దేశము సమవాయి కారణములు. కాలాదులు నిమిత్త కారణములు. ఈ రెండవ విభాగమునకు అసమవాయి కారణము గుణమో కర్మయో కావలసియున్నది. అసమవాయి కారణము కూడా

సమవాయి కారణముతో సంబద్ధమైయుండవలసినదే. పై ఉదాహరణమున ద్రవ్యానారంభక సంయోగ వినాశక విభాగమునకు సమవాయి కారణములైన ఆకాశదేశము తంతువులలో ఉండే రూపాది గుణములు అసమవాయి కారణములు కావు. అవి విభాగమును ఉత్పన్నం చేయలేవు. పట సమవాయి కారణములైన తంతువులలో ఏర్పడిన క్రియ తంతుసమవేతమై మొదటి విభాగమును ఉత్పన్నముచేసినది. కావున అది రెండవ విభాగమునకు అసమవాయి కారణము కాలేదు. అప్పుడు ఈ రెండవ విభాగమునకు మొదట ఉత్పన్నమైన తంతు విభాగమే అసమవాయి కారణమనకతప్పదు. అందువల్ల రెండవ విభాగము విభాగజ విభాగము అనబడుతుంది. ఇట్లు రెండవ విభాగమునకు అసమవాయి కారణమైన ప్రథమ విభాగము గుణము. అది రెండవ విభాగ కార్యము ఉత్పన్నము చేయుటకు అన్యద్రవ్యతత్త్వము నపేక్షించును. ఆ తత్త్వము అవయ వినాశక విశిష్ట కాలము కాని స్వతంత్రావయవము కాని కావచ్చునని వైశేషికుల అభిప్రాయము. పటావయవములైన తంతువులలో ఏర్పడిన విభాగం వలన తంతువుల సంయోగం నశిస్తున్నది. కాని పటము నశింపక పోవటానికి పటావయవములైన తంతువులతో ఆకాశానికి గల రెండవ సంయోగము అట్లే నిలిచి యుండుట కారణము. ఈ సంయోగము ఉన్నంతదాకా తంతువులు ఆకాశాన్ని విడువజాలవు. అప్పుడు పటనాశము కలుగదు. పటము నశిస్తున్నప్పుడు ఆకాశ తంతు సంయోగనాశక ద్వితీయ విభాగము దానికి కారణమువునని ఒప్పుకొనవలసియున్నది.

## కారణాకారణవిభాగజ కార్యాకార్యవిభాగము :

సంయోగములందు సంయోగజ సంయోగము ఒకటి ఉన్నది. ఒకడు తన అంగుళిని వృక్షమూలమున నిలిపినపుడు వృక్షమునకు అంగుళికి సంయోగమేర్పడుతుంది. అంగుళితో వృక్షమునకు సంయోగమేర్పడినపుడు హస్త వృక్షసంయోగము కల్గుతుంది. దానివలన దేహ వృక్షసంయోగముకూడా కలుగుతుందనవలెను. అంగుళి హస్తమునకు సమవాయి కారణము. వృక్షమునకు హస్తము ఏవిధమైన కారణముకాదు. అంగుళికి వృక్షమునకు కల్గిన సంయోగము అంటే కారణాకారణ సంయోగము అంగుళికార్యమైన హస్తమునకు అంగుళికి అకార్యమైన వృక్షమునకు మధ్య సంయోగము కల్గిస్తున్నది.

ఇట్లేర్పడిన హస్తవృక్షసంయోగమునకు అంగుళివృక్షముల సంయోగము అసమవాయి కారణము. అంగుళితో వృక్షమునకు సంయోగము ఏర్పడుటకు అంగుళియందు సమవాయ సంబంధముతో నున్న క్రియ అసమవాయి కారణమౌతుంది. ఆ క్రియ హస్తవృక్షసంయోగమునుకల్పించే కారణము కాజాలదు. ఎందుకనగా క్రియదేనియందు పుట్టుచున్నదో దానికంటే వేరయిన దానియందు సంయోగము కలిగింపజాలదు. కారణమేమనగా కార్యమునకు సమవాయి కారణమైన దానియందు సమవేతమైన ధర్మమే. ఆ కార్యమునకు అసమవాయి కారణమగుననుట నియమము. వృక్షముతో అంగుళికి ఏర్పడిన సంయోగ రూపకార్యమునకు అంగుళిలో సమవేతముగానున్న క్రియ అసమవాయి కారణము. ఆ క్రియ తన కధికరణమైన అంగుళికంటె భిన్నాధికరణమైన హస్తముతో వృక్షమునకు సంయోగసంబంధమును కలిగింపజాలదని తాత్పర్యము. హస్త వృక్షసంయోగమునకు సమవాయి కారణమైన హస్తమందు హస్తావయవమైన అంగుళిలో సమవేతమైన క్రియకు స్వసమవాయి సమవాయ సంబంధమున్నప్పటికి క్రియలో అసమవాయి కారణత్వము కార్యైకార్థప్రత్యాసత్తితో అంగీకరింపబడుతుంది. అంటే కార్యాధికరణమునందు సాక్షాత్తుగా సమవేతమైన క్రియయే ఆ కార్యమునకు అసమవాయి కారణము అగుచున్నది. అంగుళిలో ఏర్పడిన క్రియకు హస్తముతో సాక్షాత్తుగా గాక పరంపరగా సంబంధముండును. అంగుళి ద్వారా దానిలో కలిగిన క్రియకు హస్తముతో సంబంధము కల్పింపబడుతుంది. అందువలన అంగుళి వృక్షములకు అన్యతర కర్మజ సంయోగమేర్పడినవుడు ఆ అంగుళి వృక్షసంయోగమే హస్తవృక్షసంయోగమునకు అసమవాయి కారణమగుచున్నది. అట్లే హస్తవృక్షసంయోగము దేహవృక్షసంయోగమునకు అసమవాయి కారణము అగుచున్నది. మొదటి సంయోగము క్రియాజన్యముకాగా రెండవది సంయోగజ సంయోగము. ఇట్లే విభాగజ విభాగములను గ్రహింపవలెను. ద్విత్వాది ఉత్పత్తి క్రమ నివృత్తిక్రమ విషయములో సర్వదర్శన సంగ్రహాకర్త ఎంతో గంభీరంగా చర్చగావించినాడు. ఇంద్రియార్థసన్నికర్ష దానివలన ఏకత్వ సామాన్యజ్ఞానము పిదప అపేక్షాబుద్ధి, తరువాత ద్విత్వోత్పత్తి అటు పిదప ద్విత్వత్వ సామాన్య జ్ఞానము తరువాత ద్విత్వ గుణజ్ఞానం అటు పిదప ఇవి రెండు అనే బుద్ధి, అటు పిదప సంసారము అను విధంగా కలుగుచున్నదని తెలిపినారు.

అట్లే విభాగ ప్రక్రియ కూడా చర్చించబడింది.

## అనుమానము :

అను = పిదప, మానం = కలిగే జ్ఞానం 'అనుమానం' అని ఆ పదమున కర్థం. న్యాయ భాష్యమున వాత్స్యాయనుడు 'మితేన లింగేన అర్థస్య పశ్చాన్మానం అనుమానం' అని నుడివినాడు. ప్రత్యక్షంగా తెలియబడిన లింగం లేదా హేతువుతో సాధ్య పదార్థ జ్ఞానం పిదప సిద్ధించటం వల్ల అనుమానం అగునని అర్థము. తర్కభాషాకర్త 'లింగపరామర్శి జ్ఞానణ అనుమానం' అని నుడివినాడు. 'లింగ పరామర్శోనుమానం' అని తర్క భాషా ఉద్యోతకరుడు న్యాయవార్తికములో 'స్మృత్యనుగ్రహేత లింగ పరామర్శః అనుమానం'. స్మృతి సహకృతమైన లింగపరామర్శల వలన ఏర్పడే జ్ఞానం అనుమానం అని నుడివినాడు. వ్యాప్తి సహకారం వలన అర్థాన్ని సాధించే హేతువును లింగమనెదరు. అగ్నిని సాధించుట కొరకు ధూమం హేతువౌతుంది. సాధ్యమైన అగ్ని లింగి అనబడుతుంది. లింగం ద్వారా లింగిని సాధించుట అనుమానం. కొండ యందు వెలువడే పొగను చూచి, ఆ పొగ అనే హేతువుతో అగ్ని అనే సాధ్యం అనుమానింపబడుతున్నది. వంట యింట పొగ వెళ్ళుచున్నది. అగ్ని ఉన్నది. ధూమాగ్నులకుండే సాహచర్యము వ్యాప్తి అనబడుతున్నది. పొగ ఉన్నచోట అగ్ని ఉండును అన్నది వ్యాప్తి. కాబట్టి వంట యింట పొగ వెళ్లటం, అక్కడ అగ్ని ఉండటం, నిరంతరం చూడటమువలన, అట్లు చూచినవాడు పర్వతమందు వెళ్ళే పొగను బట్టి అగ్నిని సాధించును.

## వ్యాప్తి :

అనుమాన ప్రమాణమునకు ఆధారం వ్యాప్తి. వ్యాప్తి లేనిది అనుమానం సిద్ధించదు. అనుమాన ప్రమాణం సిద్ధించవలయునన్న వ్యాప్తి జ్ఞానం అవశ్యకమగును. హేతు సాధ్యములకుండే సాహచర్య నియమం వ్యాప్తి అనబడుతుంది. 'యత్రయత్ర ధూమః తత్ర తత్ర వహ్నిః ఇతి సాహచర్య నియమో వ్యాప్తిః' అని తర్కభాష తెలుపుచున్నది. పొగతో అగ్నికి నియతంగా ఉండే సాహచర్యం వ్యాప్తి అని తాత్పర్యం. పొగ అగ్నిని విడిచిపెట్టి ఉండదు. అగ్ని లేనిచోట పొగ ఉండటం సంభవించదు. ధూమాగ్నుల

కుండే ఈ సంబంధానికి అవినాభావ సంబంధం అని పేరు. దీనినే వ్యాప్తి అంటారు. కాని వ్యాప్తి జ్ఞానములో కేవల నియత సాహచర్యమే సరిపోదు. వ్యభిచార రాహిత్యం కూడా అవసరం. అగ్ని ఎక్కడ ఉండదో పొగ అక్కడ ఉండదు. ఇట్లు ధూమం అగ్నితో అవ్యభిచరితంగా ఉండటం అనుమాన ప్రమాణానికి ప్రాణం.

## ఉపాధి :

వ్యాప్తి జ్ఞానములో ఉపాధి ఎంతైనా అవసరము. వాచస్పతి మిశ్రుడు అనౌపాధిక సంబంధాన్ని ఉపాధిగా పేర్కొన్నాడు. 'సాధ్యవ్యాపకత్వే సతి సాధనా వ్యాపకత్వం ఉపాధిః' సాధ్యము ఉన్నచోట ఎల్ల అధికంగా వ్యాపిస్తూ సాధనం ఉన్నచోట వ్యాపింపకుండా ఉండే దానిని ఉపాధి అంటారు. పొగతో పాటు అగ్ని. పొగ ఉన్నచోట అగ్ని ఉండితీరుతుంది. అగ్ని ఉన్నచోట పొగ ఉండునని చెప్పలేము. ఆర్ద్రేంధన సంయోగమున్నప్పుడు అగ్నియందు ధూమము వెలువడును. అగ్ని నుండి పొగ వెళ్ళటానికి, ఆర్ద్రేంధన సంయోగమనే ఉపాధి తోడ్పడుతుంది. అంటే అగ్నితో ధూమానికి ఉండే సంబంధం స్వాభావికముకాదు. అది ఔపాధికము. తడిసిన కట్టె లేదా చమురు కట్టె పడినప్పుడే కట్టె రాజుకుంటుంది. ఆర్ద్రేంధన సంయోగము లేనిచో ధూమము వెలుపడదు.

మరో ఉదాహరణను చూడండి. మాలతి అనే స్త్రీకి 5 గురు పుత్రులు కలిగివారు. వారిలో 4గురిని మాత్రమే చూచినాము. చూచిన నల్గురు నల్లగా ఉన్నారు. చూడబడనివాడు 5వవాడు. చూడబడనివాడు మాత్రం ఎర్రగా ఉన్నాడు. 'యత్రయత్ర మాలతీ తనయత్వం తత్ర తత్ర శ్యామత్వం' అని వ్యాప్తి ఆధారంగా 'స మాలతీ తనయః శ్యామః మాలతీ తనయత్వాత్ దృష్ట అన్య మాలతీ తనయవత్' మాలతీ తనయత్వమున్నచోట శ్యామత్వ ముంటుంది. ఆ అగుపడని 5వ మాలతీ పుత్రుడు శ్యామంగా ఉండును. మాలతీ తనయుడగుట వలన ఇంత క్రితం చూసిన మాలతీ తనయుల వలె అని పైన చెప్పిన వ్యాప్తి ప్రణాళికి అర్థం. కాని మాలతీ తనయత్వ మనే హేతువు సోపాధికము. శాకపాకజన్యత్వము ఉపాధి. 'యత్ర యత్ర శ్యామత్వం తత్ర తత్ర శాకపాకజన్యత్వం', శ్యామత్వ మనగా, శ్యామత్వ

మున్నచో శాకపాకజన్యత్వ ముండును అను వాక్యములో మాలతీ తనయ త్వమనే హేతువును తీసుకొని శ్యామత్వమనే సాధనం సాధింపబడుతుంది. ఉపాధికి అర్థము సాధ్యవ్యాపకమై సాధనా వ్యాపకమగుటే కదా అర్థము. శాకపాకజన్యత్వమనునది సాధ్యమైన శ్యామకత్వము వ్యాపకమై సాధనమైన మాలతీ తనయత్వములో వ్యాప్యముగా నున్నది. కావున శాకపాకజన్య త్వము ఉపాధి. ఈ విధముగా మైత్రీతనయత్వ శ్యామత్వముల సంబంధము స్వాభావికముకాక ఔపాధికం అవుతుంది.

'వ్యభిచార రహిత నిరుపాధి హేతుః సాహచర్య నియమో వ్యాప్తిః'. వ్యభిచార రహితము ఉపాధి రహితమునైన హేతు సాధ్యములకు నియ తంగా ఉండే సంబంధము వ్యాప్తిగా గ్రహింపవలె.

## వ్యాప్తి భేదములు :

వ్యాప్తి 2 విధములు. 1. అన్వయ వ్యాప్తి 2. వ్యతిరేక వ్యాప్తి. విధి ముఖంగా ఉండే వ్యాప్తి అన్వయ వ్యాప్తి. ధూమమున్నచోట అగ్ని ఉండును. వంట యింటి వలె అన్నది అన్వయ వ్యాప్తికి ఉదాహరణ. నిషేధ రూపంగా వ్యాప్తి ప్రవత్తిని వ్యతిరేక వ్యాప్తి అంటారు. అగ్ని లేనిచోట పొగ ఉండదు. నీటి మడుగువలె అనునది ఈ వ్యాప్తికి ఉదాహరణ. అధిక సంఖ్యతో ఉండే దానికి వ్యాపకమని తక్కువ చోట నుండు దానికి వ్యాప్యమని తర్కశాస్త్ర మున వ్యవహారము. పూర్వోక్త ఉదాహరణలో అగ్ని వ్యాపకము. ధూమము వ్యాప్తి. వ్యాపకమయినందున అగ్ని స్థలము విస్తృతముకాగా వ్యాప్యమై నందున ధూమముండే స్థలము న్యూనదేశవర్తి అవుతుంది. కుమారిలభట్టు న్యాయవార్తికములో 'వ్యాప్యస్య వచనం పూర్వం వ్యాపకస్య తతః పరమ్ ఏవం పరీక్షితా వ్యాప్తి స్ఫుటే భవతీ తత్త్వతః అన్వయే సాధనం వ్యాప్యం సాధ్యం వ్యాప కముచ్యతే సాధ్యాభావోన్యధా వ్యాప్యం వ్యాపక సాధనాత్యయః' అని అన్వయ వ్యతిరేక వ్యాప్తులలో సాధనమై వ్యాప్యమును ముందుగా వ్యాపకము అయిన సాధ్యమును పిదప పేర్కొనవలయును. వ్యతిరేకములో సాధ్యాభావం వ్యాప్త ముకాగా సాధనా భావం వ్యాపకమవుతుంది. అన్వయములో సాధనం వ్యాప్యమైతే సాధ్యం వ్యాపకమవుతుంది. 'తత్సత్వే తత్సత్వం అన్వయః తదభావే తదభావః వ్యతిరేకః'. ధూమమున్నచోట వహ్ని ఉంటుంద

న్నది అన్వయము. వహ్ని లేనిచోట ధూమముండదు అన్నది వ్యతిరేకము. 'వ్యాప్తి విశిష్ట పక్షధర్మతా జ్ఞానం పరామర్శః'. వ్యాప్తి జ్ఞాన పక్ష ధర్మతా జ్ఞానములవల్ల ఏర్పడే జ్ఞానానికి పరామర్శ అని పేరు. వంట యింట ధూమాగ్నుల సాహచర్యాన్ని అనుక్షణం చూచి చూచి పొగ ఉన్నచోట అగ్ని ఉండునని నిశ్చయ జ్ఞానము పొందుతారు. ఇట్టి జ్ఞానం వ్యాప్తి అనబడుతుంది. పర్వతంపై వెళ్ళే పొగను చూచినపుడు రెండవ జ్ఞానం ఏర్పడుతుంది. ఈ రెండవ జ్ఞానానికే పక్షధర్మత యని పేరు. పర్వతమనే పక్షమందు ధూమమనే ఉనికియే పక్షధర్మత. అటుపిదప పొగ ఉన్నచోట అగ్ని ఉండుననే వ్యాప్తి స్మరణం కలుగుచున్నది. అపుడు 'వహ్ని వ్యాప్య ధూమవాన్ అయం పర్వతః' అనే పరామర్శ చేకూరుతుంది. ఈ విధంగా వ్యాప్తి పక్షధర్మతల సమష్టి జ్ఞానం వల్ల ఏర్పడ్డ విశిష్ట జ్ఞానం పరామర్శ అగునని తాత్పర్యము. వ్యాప్తిలో ధూమమునకు అగ్నితో ఉండే సంబంధము ప్రత్యక్షంగా చూడబడుతుంది. పక్షధర్మతలో ధూమము యొక్క సంబంధం పర్వతంతో ఉన్నట్లు చూడబడుతుంది. కాబట్టి వ్యాప్తిజ్ఞానం పక్ష ధర్మతాజ్ఞానం రెండు కలియుటవల్ల పరామర్శ సిద్ధిస్తుందని తాత్పర్యం.

**అనుమితి :**

పరామర్శవల్ల కలిగే జ్ఞానం (పరామర్శజన్యం జ్ఞానం అనుమితిః) వహ్ని వ్యాప్య ధూమవత్తు పర్వతము అను పరామర్శ వలన పర్వతము వహ్నిమత్ అనే అనుమితి పుట్టుతుంది.

అనుమానం గౌతమ మతానుసారం 3 విధాలు, 'అథ తత్పూర్వకం త్రివిధ మనుమానం పూర్వవత్ శేషవత్ సామాన్యతో దృష్టం చ' అని న్యాయ సూత్రం. లింగ ప్రత్యక్షం, లింగలింగి సంబంధ ప్రత్యక్షం కారణముగా ఏర్పడ్డ లింగి జ్ఞానం అనుమానం అనబడుతుంది. ఇది పూర్వవత్తు శేషవత్తు సామాన్యతో దృష్టం అని 3 విధాలు.

1. పూర్వవత్తు : పూర్వమనగా కారణము. కారణజ్ఞానం ద్వారా కార్యజ్ఞానం కలిగినది పూర్వవత్తు. మేఘోన్నతిని చూచి వృష్టి ఏర్పడునని గ్రహించటం. ఇట వత్తును 'మతుప్' ప్రత్యయంగా గాక 'వత్' ప్రత్యయంగా గ్రహించినచో కార్యకారణములకు గల వ్యాప్తి పూర్వము గ్రహింపబడినందున

ఆ కారణజ్ఞానం వలన అటువంటి సాధ్యము లేదా కార్యము తెలియబడినచో అది పూర్వవత్తు. ధూమమును బట్టి అగ్నిని ఊహించుట.

2. శేషవత్ : శేషమనగా పరిశేషము. 'ప్రసక్త ప్రతిషేధే అన్యత్ర అప్రసంగాత్ శిష్యమాణే సంప్రత్యయః పరిశేషః' - ప్రసక్తిగల చోట నిషేధింపబడి ప్రసక్తి లేకుండా మిగిలి యున్న దీని యందు ప్రసక్తమగుట పరిశేషమనబడుతుంది. ఉదా.: శబ్దం పృథివ్యాది అష్ట ద్రవ్యములందు అనాశ్రితమై ద్రవ్యాశ్రితమగుటచే అని అనుట వలన శిష్టద్రవ్యమగు ఆకాశము శబ్దమునకు ఆశ్రయమని పరిశేషన్యాయమున తెలిసికొందుము.

3. సామాన్యతో దృష్టం : లింగలింగి సంబంధం ప్రత్యక్షం కానిచోట ఒకానొక వస్తువునందు లింగ సాదృశ్యమున్నందువలన దాని ద్వారా లింగి తెలియబడుచున్నది. ఇచ్ఛాద్వేషరాగాది గుణముల ద్వారా ఆత్మ తెలియబడుట. ఇచ్ఛారాగద్వేషాదులు రూపరసగంధాదులవలె గుణములు. అవి ఒకానొక ద్రవ్యము నాశ్రయించియుండును. ఈ ఇచ్ఛాదులకు ఆశ్రయమగు పదార్ధము ఆత్మ యని తేలినది.

అనుమానము స్వార్ధానుమాన పరార్ధానుమాన భేదమున రెండు విధములని తార్కికులు అందురు. ఏ అనుమానం తనకు మాత్రమే కలుగుచున్నదో అది స్వార్ధానుమానము. తాను స్వయముగా వంటయింట పలుమారు ధూమాగ్నుల సాహచర్యము నవలోకించియున్నందున ధూమమున్నచోట అగ్ని యుండునను వ్యాప్తిని గ్రహించి పర్వతము కడకేగి అచట అగ్ని ఉన్నదా? లేదా? అని సందేహిస్తూ పర్వతమున వెలువడే ధూమమును చూచి ధూమమున్నచోటెల్ల అగ్నియుండుననే వ్యాప్తిని స్మరించును. స్మరణానంతరం ఈ పర్వతము వహ్నివ్యాప్య ధూమవత్తు అనే జ్ఞానం కలుగుచున్నది. దీనిని లింగ పరామర్శ అంటారు. ఇట్టి లింగ పరామర్శ వలన పర్వతము వహ్నిమత్తూ అనే అనుమితి పుట్టుతుంది. ఇట్టి ప్రణాళికకు స్వార్ధానుమానమని పేరు. 'స్వీయసంశయ నివృత్తి ప్రయోజనకం అనుమానం స్వార్ధానుమానం' అని సప్తపదార్థ సంగ్రహం తెలిపినది.

పరార్ధానుమానం : పరునకు అనుమితి రూపప్రయోజనము కలిగించునది. పరసంశయ నివృత్తి ప్రయోజనకం అనుమానం పరార్ధానుమానం

అని నిర్వచనము. 'పంచావయవేన వాక్యేన స్వనిశ్చితార్థ ప్రతిపాదనం పరార్థానుమానం' అని పదార్థధర్మ సంగ్రహం తెలుపుతున్నది. స్వయముగ ధూమరూప హేతువు వలన వహ్నిని ఊహించి ఇతరులకు కూడా నిర్ణయ బుద్ధిని కలిగించుటకై పంచావయవ వాక్యముల ఉపయోగం పరార్థానుమానమున ఉంటుంది. ప్రతిజ్ఞ. హేతువు, ఉదాహరణం, ఉపనయం, నిగమనం అన్నవి పంచావయవములు. పర్వతము వహ్నిమత్తు అన్నది ప్రతిజ్ఞ ధూమముండుటవలన అనునది హేతువు. పొగ ఉన్నచోట వహ్ని ఉండును వంటయింటివలె అనునది ఉదాహరణం. కావున ఈ పర్వతము వహ్నివ్యాప్య ధూమవత్తు అన్నది ఉపనయము. పొగ గల్గియున్నందున పర్వతము వహ్నిమత్తు అనునది నిగమన వాక్యము. వాత్స్యాయనుడు న్యాయ భాష్యములో కొందరు నైయాయికులు పరార్థానుమానం జిజ్ఞాస సంశయ శక్యప్రాప్తి ప్రయోజన సంశయ వ్యుదానములను మరో ఐదింటిని చేర్చినట్లు తెల్పినాడు.

నవ్యన్యాయమతానుసారం అనుమానం 3 విధాలు 1. కేవలాన్వయి 2. కేవలవ్యతిరేక 3. అన్వయవ్యతిరేక.

## 1. కేవలాన్వయి :

అన్వయ వ్యాప్తి మాత్రమే కలిగి వ్యతిరేక వ్యాప్తి లేనట్టిది కేవలాన్వయి. ఉదా. ఘటమభిధేయము ప్రమేయమగుట వలన ఏది ప్రమేయమవుతుందో అది అభిధేయ మవుతుంది. పటమువలె. ఈ అనుమానంలో అన్వయమునకు మాత్రమే ఉదాహరణ కలదు. ఏది అభిధేయము కాదో అది ప్రమేయముగాదు అనే వ్యతిరేక వ్యాప్తికి ఉదాహరణ లేదు. కావున ఇది కేవలాన్వయి.

## 2. కేవలవ్యతిరేకి :

వ్యతిరేక వ్యాప్తి మాత్రమే కలిగి అన్వయ వ్యాప్తి లేనిది. జీవచ్ఛరీరము సాత్మకము. ప్రాణాదియుక్తమగుట వలన. ఏది ఆత్మవత్తు కాదో, అది ప్రాణాదియుక్తము కాదు. ఘటపటాదులవలె. ఈ ఉదాహరణములో వ్యతిరేక వ్యాప్తే గోచరిస్తుంది. చైతన్యవంతము ఆత్మవంతము అను అన్వయమునకు దృష్టాంతము లేదు.

## 3. అన్వయవ్యతిరేకి :

అన్వయ వ్యతిరేకములకు చెందిన దృష్టాంతములు కలది అన్వయవ్య తిరేకి. పర్వతము అగ్నిమత్తు ధూమయుక్తమగుటవలన ధూమమున్నచోట అగ్ని యుండును. వంట యింటివలె. ఇది అన్వయవ్యాప్తికి ఉదాహర ణము. వహ్నిలేనిచోట పొగలేదు. (ఉండదు). మహాహ్రదమువలె. వ్యతిరేక వ్యాప్తికిది ఉదాహరణము. రెండింటికి చెందిన ఉదాహరణములున్నందువ లన ఇది అన్వయ వ్యతిరేకి అనబడుతుంది. అన్వయవ్యతిరేకి హేతువులో 5 అంశములు ఉండవలెను. 1. పక్షసత్త్వము 2. సపక్షసత్వము. 3. విపక్షవ్యావృతత్వము 4. అబాధిత విషయత్వము 5. అసత్ప్రతి పక్షత్వము.

## పక్షము :

సాధ్య సందేహము కలది పక్షము. నిశ్చిత సాధ్యము కలది సపక్షము. నిశ్చిత సాధ్యాభావము కలది విపక్షము.

## హేత్వాభాసలు :

హేతువులు కాకున్నను హేతువుగా అభాసించునది హేత్వాభాస. సాధ్య సిద్ధికి శక్తి లేనట్టి హేతువుకు హేత్వాభాస అందురు. గౌతముడు సవ్య భిచార విరుద్ధ ప్రకరణసమ, సాధ్యసమ, కాలాతీతములనే హేత్వాభాసలు తెల్పినాడు.

## సవ్యభిచార (అనైకాంతికము) :

సవ్యభిచారహేత్వాభాస సాధారణ అసాధారణ అనుపసంహారభేదమున 3 విధములు.

సాధారణము : సాధ్యాభావ స్థలములో సాధనముండుట సాధారణ సవ్యభిచారము. శబ్దము నిత్యము ప్రమేయమగుట వలన ఆకాశమువలె అనుచోట ప్రమేయత్వమనే హేతువు నిత్యత్వములేని అనిత్యపదార్థము యందును ఉన్నందున ఈ హేతువు సాధారణ హేత్వాభాస అవుతుంది.

అసాధారణ : సపక్షవిపక్షములలో ఉండక కేవలపక్ష మాత్రముననే ఉండునది అసాధారణము. పృథివి నిత్యము. గంధయుక్త మగుట వలన.

ఇటు గంధవత్వమనే హేతువు సపక్ష. నిత్యాకాశాదులందు విపక్ష. అని త్యజలాదులందును లేనిదై కేవలం పృథివీ అనే పక్షములోనే ఉన్నందున అసాధారణ అనైకాంతిక హేత్వాభాస.

అనుపసంహారి : ఏ హేతువు విషయమున అన్వయ దృష్టాంతము కాని వ్యతిరేక దృష్టాంతముకాని ఉండదో అది అనుపసంహారి అనైకాంతికము. సర్వమనిత్యము ప్రమేయ మగుటవలన అన్నప్పుడు ప్రమేయత్వమనే హేతువునకు అన్వయ దృష్టాంతముకాని వ్యతిరేక దృష్టాంతముకాని లేదు. ఎందువల్లనంటే సర్వపదార్థములు పక్షములోనే అంతర్భవించుటవలన ఇది అనుపసంహారి అనైకాంతికము.

విరుద్ధము : హేతువు సాధ్యములో ఉండక తద్విపరీత వస్తువులోనూ ఉండే వస్తువు విరుద్ధము. శబ్దము నిత్యము, కార్యమగుటవలన ఇటు కృతకత్వము అనే హేతువు నిత్యమనే సాధ్యములో వ్యాప్తము కాదు. కాని తద్విరుద్ధమైన అనిత్యములో ఉన్నందున ఇది విరుద్ధము.

సత్ప్రతిపక్షము : ప్రాచీన మతములో "ప్రకరణసమమని' దీనికి పేరు కలదు. 'యస్యసాధ్యాభావ సాధకం హేత్వంతరం విద్యతే సః సత్ప్రతిపక్షః'. సాధ్యమును సాధించు దానిగా ఒక హేతువును తెల్పి సాధ్యాభావమును సాధించుదానిగా ఇంకొక్క హేతువును చెప్పుట సత్ప్రతిపక్షము. ఎట్లనగా శబ్దము నిత్యము శ్రావ్యమైనందున శబ్దత్వమువలె అన్నప్పుడు విపరీతంగా శబ్దమనిత్యము. కార్యమగుటవలన ఘటమువలె అని అనవచ్చును. మొదటి ఉదాహరణములో నిత్యత్వము సాధ్యమై శ్రవ్యత్వము హేతువైంది. రెండవ ఉదాహరణములో సాధ్యమనిత్యత్వమైతే కార్యత్వము హేతువైంది. ఈ రెండు హేతువులు తుల్యబలంగా ఉన్నవి. కావున ఇట్టిచోట సత్ప్రతిపక్ష హేత్వాభాస అని గ్రహించాలి.

అసిద్ధము : సాధ్యసమము అని దీనికే నామాంతరము. ఇది 3 విధములు 1. ఆశ్రయాసిద్ధము, 2. స్వరూపాసిద్ధము, 3. వ్యాప్యత్వాసిద్ధము.

1. ఆశ్రయా సిద్ధము : 'యస్య హేతోః ఆశ్రయోనావగమ్యతే సః ఆశ్రయాసిద్ధిః'. ఏ హేతువునకు ఆశ్రయమే సిద్ధింపదో దానిని ఆశ్రయా సిద్ధ

మంటారు. గగనారవిందము సురభిలము  అరవిందమగుటవలన సరోజార వింద‌ము వలె. ఇట గగనారవిందము పక్షము. అరవిందత్వము హేతువు. ఆకాశకమలము లేనే లేదు. కావున ఇది ఆశ్రయా సిద్ధము.

స్వరూపా సిద్ధము : 'యస్య హేతుః ఆశ్రయే నావగమ్యతే సః స్వరూపా సిద్ధః' ఏ హేతువు  ఆశ్రయములోనే ఉండదో అది స్వరూపా సిద్ధము. శబ్దమనిత్యము చాక్షుషమగుటవల్ల ఘటపటాదులవలె. శబ్దము పక్షము అని త్యత్వము సాధ్యము. చాక్షుషత్వము హేతువు. చాక్షుషత్వమనే హేతువు శబ్దమనే పక్షములో లేదు. ఎందుకనగా శబ్దము శ్రావణమవుతుంది. చాక్షుషం కాదు. కావున ఇది స్వరూపా సిద్ధము.

వ్యాప్యత్వా సిద్ధము : 'వ్యాప్యత్వాచ్ఛేద భావవాన్ హేతుః వ్యాప్యత్వా సిద్ధః'. సాధ్యములో  హేతువు వ్యాపింపకుండా ఉన్నది. వ్యాప్యత్వా సిద్ధము. ఇది రెండు విధములు. 1. వ్యాప్తిగ్రాహక  ప్రమాణాభావము వల్ల ఏర్పడునది 2. హేతువులో ఉపాధి సద్భావం వల్ల ఏర్పడునది. శబ్దము క్షణికము. సత్తగుట వలన. ఏది సత్తో అది క్షణికము. జలధరమువలె. ఇటు క్షణికత్వం  సాధ్యం. సత్తగుట అనునది హేతువు. ఈ రెంటిలో వ్యాప్తి సిద్ధింపదు. పర్వతము  ధూమయుక్తము అగ్ని యుండుట వలన. అగ్నియున్నచోట ధూమముండును. మహానసమువలె అనుచోట ఆర్ద్రేంధన సంయోగము ఉపాధి.  ఉపాధియుక్తమగుట వలన అగ్నిరూప హేతువు; ధూమ రూపసాధ్యంలో అసిద్ధమైనది.

బాధితసత్వము : కాలాత్యయాపదిష్టమని దీనికి నామాంతరము. పక్ష ములో సాధ్యాభావము ప్రమాణాంతరములచే నిశ్చితమైనచో అది బాధిత హేత్వాభాస. 'అగ్ని శీతలము ద్రవ్యమగుటవలన, జలమువలె'. ఇట అనుష్ణ త్వము సాధ్యము. ద్రవ్యత్వము హేతువు. కాని అనుష్ణత్వమనే సాధ్యము ప్రత్యక్షప్రమాణం ద్వారా బాధితమవుతుంది. అగ్ని ఉష్ణ మన్నది ప్రత్యక్షా నుభూతము కదా.

## ఉపమానము :

లోకములో ఆయా వస్తువులను గ్రహించుటలో ప్రత్యక్షాది ప్రమాణములు

ప్రధాన సాధనములైనట్లే ఉపమానము కూడా ప్రమాణ సాధనమగుచున్నది. ఒక అజ్ఞవ్యక్తికి ఒక విషయం తెలువవలసి యున్నది. ఆ అజ్ఞ వ్యక్తికి తెలిసిన వస్తువును చూపి, దీనివలె అది ఉంటుందని ఆతనికి అపరిచిత వస్తుగ్రహణము కల్గిస్తున్నారు. 'ప్రసిద్ధ సాధర్మ్య సాధ్యసాధనం ఉపమానం' అని న్యాయసూత్రం. పూర్వం బాగుగా తెలిసియున్న గవాదివ్యక్తుల యందుండే సాదృశ్యము ననుసరించి, దానివలె ఇటి ఉంటుందని అపరిచిత పదార్థమును సాధించుట లేదా తెలిసికొనుట 'ఉపమానము'. ఒక వ్యక్తికి గవయమన నేమో తెలియదు. కాని గోవు తెలియును. తెలిసిన గోసాదృశ్యమును బట్టి గోవువలెనే గవయముంటుందని తెలిపినచో ఆతడు వనమునకేగి నప్పుడు గవయమును జూచి పూర్వవ్యక్తి చెప్పిన ప్రకారము గోసాదృశ్యము ఆ మృగ మందున్నందున ఇది గవయ మృగమని తెలిసికొనును.

## శబ్దప్రమాణము :

న్యాయ దర్శనములో శబ్దము స్వతంత్ర ప్రమాణముగా గ్రహింపబడి నది. ఆప్త వాక్యము శబ్దము. ఆప్తుడనగా యదార్థవక్త. వస్తువు యొక్క యధార్థత్వమును ఎఱిగిన వానినే ఆప్తుడందురు. ఆతని మాట శబ్దప్ర మాణమౌతుంది. శబ్దప్రమాణం దృష్టార్థం అదృష్టార్థమని రెండు విధాలు. ఇహలోకంలో అగుపడే వస్తువులను గురించి శాస్త్రములలో నిర్దేశించిన విష యములను గురించి పేర్కొన్న వాక్యములు దృష్టార్థములో అంతర్భవిస్తాయి. ఇక ధర్మాధర్మములు జీవేశ్వరులు స్వర్గనరకములు మొదలగు అలౌకిక వస్తు వులను గురించి ఋషులు నిర్దేశించిన వాక్యము అదృష్టార్థ శబ్దప్రమాణమున చేరును. నవ్యన్యాయ మతానుసారము వైదికము, లౌకికమని, ఆప్తవాక్యము రెండు విధములు. వేదము ఈశ్వర ప్రోక్తమయినందున ఈశ్వరునిలో భ్రమ ప్రమాది దోషములు లేనందున, వైదిక వాక్యాలు ప్రామాణికాలు. లౌకిక వాక్యములు మనుష్యకృతము లయినందున వాటినన్నిటిని ప్రమాణంగా పరిగణించలేము. కాని వారిలో యథార్థవక్తలు చెప్పే మాటలు మాత్రము ప్రమాణంగా స్వీకరిస్తారు. పద సమూహము వాక్యము. ఆకాంక్షా యోగ్యతా సన్నిధులు వాక్యార్థజ్ఞానమున కరణములౌతవి. కొందరు వాక్యార్థ బోధలో తాత్పర్యమును సాధనంగా గ్రహింతురు.

## తత్త్వమీమాంసా :

వేటికి నామరూపములుండునో లేదా వేటియందు గుణక్రియలుండునో ఏవి జ్ఞాన గోచరం అగునో, ఏవి అభిధేయం అగునో వాటిని పదార్థములని యందురు. కణాద మహర్షి వైశేషికదర్శనములో 'ద్రవ్యగుణ కర్మ సామాన్య విశేషసమవాయాః' అని నుడివినందున షట్పదార్థవాదిగా కొందరు భావిస్తున్నారు. కాని భావ పదార్థముల పేర్కొన్నందున వాటి అభావము కూడా చెప్పినట్లేయని అందువలన కణాదునకు సప్త పదార్థముల పరిగణన ఇష్టమే యని మరికొందరు వాదింతురు. తర్కసంగ్రహం 'ద్రవ్యగుణ కర్మసామాన్యవిశేషసమవాయాభావాః సప్తపదార్థః' అని పదార్థ సప్తకమును నిరూపించినది. వైశేషికులలో అధిక భాగం సప్తపదార్థ వాదులే కలరు. న్యాయదర్శనములో ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయువ, తర్క, నిర్ణయవాద, జల్ప, వితండ, హేత్వాభాస, ఛల, జాతి, నిగ్రహ స్థానానాం తత్త్వ జ్ఞానాత్ నిశ్శ్రేయసాధిగమః అని 16 పదార్థములు తెల్పబడినవి. న్యాయ దర్శనం ముఖ్యంగా ప్రతిపాదించే విషయము ప్రమాణ మీమాంస లేదా జ్ఞానమీమాంస. జ్ఞానమీమాంసా విషయము ఏయే విషయాల పరిజ్ఞానము అవసరమో ఆ విషయాలను మాత్రమే వివేచనకావించుటకై 16 పదార్థాలను తెలిపియున్నారు. కాని వైశేషిక దర్శనం ప్రతిపాదించేది ప్రధానంగా తత్త్వ మీమాంస. అందువలన సప్త పదార్థముల తత్త్వము వివేచింపబడినదని ఆ రెండు దర్శనములకు సమన్వయం కావించవచ్చు.

## ద్రవ్యము :

'క్రియా గుణవత్ సమవాయి కారణం ద్రవ్యం'. దేనియందు క్రియాగుణములు సమవేతములగునో ఏది సమవాయి కారణంగా ఉంటుందో దానికి ద్రవ్యమని పేరు. పృథివ్యప్తేజోవాయ్వాకాశ కాలదిగాత్మమనస్సులనునవి 9 ద్రవ్యములు.

## పృథివి :

రూపరసగంధ స్పర్శ గుణములు గలది పృథివీ ద్రవ్యము. పృథివిలో

నీలపీతాది వర్ణములు మధురాది రసములు దుర్గంధ సుగంధములు మరియు స్పర్శ గుణము కలవు. వీటికి అతిరిక్తంగా సంఖ్యా పరిమాణ పృథక్త్వ, సంయోగ, విభావ, పరత్వ, అవరత్వ గురుత్వ ద్రవ్యత్వ సంస్కారములనే గుణాలు సామాన్యంగా ఉంటవి. పృథివి రెండు విధాలు 1. నిత్యం, 2. అనిత్యం. నిత్యం పరమాణు రూపం. అనిత్యం కార్యరూపంలో ఉంటుంది. అనిత్య పృథివి శరీరేంద్రియ విషయ భేదమున 3 విధాలు. సుఖదుఃఖాది భోగాయతనము శరీరము అనబడుతుంది. ఈ శరీరము రెండు విధములు. యోనిజము, అయోనిజము. శుక్ర శోణిత సంపర్కమువలన ఏర్పడిన శరీరము యోనిజము. ఇది రెండు విధములు 1. జరాయుజము 2. అండజము. మనుష్యాదులు జరాయుజములు. పక్ష్యాదులు అండజములు. శుక్రశోణిత సంపర్కం లేకుండా ఏర్పడిన శరీరం అయోనిజం. స్వేదజ ఉద్భిజ్జ అదృష్ట విశేష జన్య భేదమున 3 విధములు. మక్షికాదులు స్వేదజాలు. వృక్షాదులు ఉద్భిజ్జాలు. మిగిలినవి అదృష్ట విశేషజన్యాలు. గంధమును గ్రహించే ఇంద్రియం ఘ్రాణేంద్రియం.

**జలము :**

రూప రస స్పర్శ ద్రవత్వ స్నిగ్ధత్వ గుణములు కలది జలద్రవ్యము. జలములో శీతల స్పర్శ ప్రధానంగా ఉంటుంది. పృథ్వి యందువలె సంఖ్యా ప్రమాణాలు సామాన్య గుణాలు. జలము రెండు విధములు 1. నిత్యము 2. అనిత్యము. నిత్యజలం పరమాణు రూపంలో, అనిత్యజలం కార్యరూపంలో ఉంటుంది. కార్యరూప జలము శరీరేంద్రియ విషయ భేదమున 3 విధాలు. జలీయశరీరం అయోనిజం. అదివరుణ లోకంలో ఉంటుంది. జలీయేంద్రియం రసన. ఇది జిహ్వాగ్ర భాగమున ఉంటూ షడ్రసములను గ్రహిస్తుంది. నదీ సముద్రాలు జల విషయాలు.

**తేజస్సు :**

రూప స్పర్శలుగలది తేజోద్రవ్యం. తేజస్సంటే అగ్ని. అగ్ని స్పర్శ ఉష్ణంగా, రూపం భాస్వరంగా ఉంటుంది. సంఖ్యాపరిమాణాదులు సామాన్య గుణాలు. నిత్యానిత్య భేదమున తేజస్సు రెండు విధములు. నిత్యం పరమాణు రూపం, అనిత్యం కార్యరూపం. కార్యరూపమయిన తేజస్సు శరీరేంద్రియ

విషయ భేదమున 3 విధములు. తైజస శరీరం అయోనిజం. అది ఆదిత్య లోకంలో ఉంటుంది. తైజసేంద్రియం చక్షువు. అది నీల పీతాది వర్ణములను గ్రహిస్తున్నది. భౌమ దివ్య ఉదర్య ఆకరజములను నాల్గు తేజో విషయాలు.

## వాయువు :

కేవలస్పర్శగుణం కలది వాయువు. రూపరహితమయినందున దృగ్గోచరం కాదు. స్పర్శద్వారా గ్రహింపబడుతుంది. పృథివ్యాది ద్రవ్యములు దృశ్యములు - స్పృశ్యములు. కాని వాయువు అదృశ్యము, స్పృశ్యము. దానిలో స్పర్శ గుణంతోపాటు గతి ఉంటుంది. స్పర్శ వాయువులో ఉండే విశేషగుణం. సంఖ్యాపరిమాణాదులు సామాన్యగుణాలు. నిత్యానిత్య భేదమున వాయుద్రవ్యం రెండు విధాలు. నిత్యం పరమాణుల రూపంగా, అనిత్యం కార్యరూపంగా ఉంటుంది. కార్యరూపంగా ఉండే వాయుద్రవ్యం శరీరేంద్రియ విషయభేదమున 3 విధాలు. ప్రశస్తపాదాచార్యులు 'తత్ర కార్య లక్షణః చతుర్విధః శరీరం ఇంద్రియా విషయః ప్రాణశ్చేతి' అని ప్రాణాన్ని కలిపి నాలుగన్నారు. వాయవీయ శరీరం అయోనిజం ఇది వాయులోకంలో ఉంటుంది. త్వక్ - ఇంద్రియం శీతోష్ణాది స్పర్శలు గ్రహిస్తుంది. ఝంఝూ వాతాదులు వాయు విషయములు. ప్రాణ, అపాన, సమాన, ఉద్దాన, వ్యాన భేదమున విషయవాయువు 5 విధాలు. అందు ప్రాణవాయువు హృదయంలో, అపానం మలద్వారంలో, సమానం నాభిలో ఉదానం కంఠంలో, వ్యానం శరీరమంతటా వ్యాపించి ఉంటుంది.

## ఆకాశము :

ఆకాశంలో విశేష గుణం శబ్దం. శబ్ద గుణకమైన ఆకాశము ఏకము, విభువు, నిత్యము. ఆకాశంలో రూపరసాది గుణాలు ఉండవు. సమవాయ సంబంధంతో శబ్దం ఆకాశంలో ఉండుట వలన ఆకాశం శబ్దమునకు సమవాయి కారణమవుతుంది. ఇది ఏకంగా నిరవయవంగా సర్వవ్యాపిగా ఉంటుంది. ఆకాశానికి పరమాణువు లేదు.

పృథివీజలతేజో వాయ్వాకాశాలు మహాభూతములు.

## కాలము :

భూతభవిష్యద్వర్తమాన వ్యవహార హేతువైన కారణద్రవ్యము కాలమన బడుతుంది. అది ఒకటే. నిత్యము. సర్వవ్యాపి. కాలంలో ఏకత్వ సంఖ్య ఉంటుంది. సంయోగ విభాగాదుల సామాన్య గుణాలు. కాలం వస్తుతః నిత్యమైనను, ఏకమైనను, ఉపాధి భేదమున అనేక ప్రకారముల విస్తరిల్లినది.

## దిక్కు :

పూర్వ, పశ్చిమ ఉత్తర, దక్షిణాది వ్యవహారమునకు హేతువైన ద్రవ్యము దిక్కు. ఇది ఏకము. నిత్యము. విభువు. సంఖ్యాపరిమాణ సంయోగ విభాగ పృథక్త్వములు సామాన్య గుణములు. దిక్కు వస్తుతః ఏకమై నిత్యంగా ఉంటున్నను ఉపాధి భేదమున పూర్వపశ్చిమాది వివిధ ప్రకారముల వ్యవహరింప బడుతుంది. దిక్కు కాలంవలె నిరవయవము. దిక్కు, దూర నికట భేదమువల్ల పరత్వాపరత్వములకు కారణమవుచున్నది. కాలం కూడా పరత్వా పరత్వములకు మూలమౌతుంది.

## ఆత్మ :

జ్ఞానాధికరణము అయిన ద్రవ్యము ఆత్మ అనబడును. ఆత్మకు విశేష గుణం చైతన్యం. 'ప్రాణాపాన నిమేషోన్మేష జీవనమనోగతీంద్రియాంతర వికారాః సుఖదుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నాశ్చ ఆత్మనో లింగాని'. ఆత్మ ఉని కిని ప్రాణాపానములు నిమేషోన్మేషములు జీవనము మనోగతి ఇంద్రియాంతర వికారము, సుఖ దుఃఖములు ఇచ్ఛాద్వేష ప్రయత్నములు సాధించు ప్రధాన హేతువు. బుద్ధ్యాది గుణములకు ఆధారమయినందున ఆత్మ ద్రవ్యమౌతుంది. నిరవయవమైనందున నిత్యమౌతుంది. న్యాయవైశేషిక దర్శనానుసారం పర మాత్మ జీవాత్మ భేదమున ఆత్మ రెండు విధాలు. సర్వజ్ఞుడు సర్వ శక్తిమంతుడు సర్వవ్యాపకుడు అయి ఏకంగా ఉండేవారు పరమాత్మ. జీవాత్మలు అనేకములు. ప్రతి శరీరంలో ఉండుట వలన నిత్యమేకాకుండా విభుద్రవ్యము కూడా. న్యాయ వైశేషికమతానుసారం జీవాత్మకు కర్తృత్వ భోక్తృత్వము కలదు. 'వ్యవస్థాతో నానా' అనే వైశేషిక సూత్రం ద్వారా ఒకడు సుఖంగా, ఒక్కడు దుఃఖంగా, సధనంగా ఒకడు, నిర్ధనంగా ఒకడు,

ఒకడు విజ్ఞుడుగా, వేరొకడు అజ్ఞుడుగా ఉంటున్నాడు. కావున జీవాత్మ నానాత్వము అంగీకరింపవలసినదే.

## శరీరాత్మవాద ఖండనము :

చార్వాకులు పృథివ్యప్తేజోవాయు ద్రవ్యములచే శరీరము ఏర్పడుతుందని అట్లేర్పడిన శరీరమే ఆత్మ యని నుడువుదురు. శరీరమే ఆత్మ యన్నచో బాల్యావస్థలో శరీరంచే అనుభూతమైన పదార్థం యొక్క స్మృతి యువావస్థలోని శరీరం ద్వారా కలుగదు. అనిత్యమైన శరీరాన్ని ఆత్మగా భావిస్తే అప్పుడే పుట్టిన శిశువునకు స్తన్యపాన ప్రవృత్తి ఎట్లా కలుగుతుంది? ఏదైనా ప్రవృత్తికలుగుతున్నదంటే ఇష్టసాధనతా జ్ఞానం కారణంగా ఉంటుంది. ఇందువల్ల శిశువు స్తన్యపానంలో ప్రవృత్తికలుగుటకు ముందే అతనికి ఇష్టసాధనతా జ్ఞానం ఉండితీరాలి. అప్పుడే పుట్టిన శిశువులో ఇష్టసాధనతాజ్ఞానం ఎట్లు చేకూరుతుంది? పూర్వజన్మ సంస్కారంవల్ల అదిసిద్ధించింది. కాబట్టి శరీరం ఆత్మ కాదు. కొందరు చార్వాకులు మనస్సును ఆత్మగా భావిస్తున్నారు. అణురూపంగా ఉండే మనస్సు ప్రత్యక్షం గాదు. కాబట్టి అందుండే సుఖదుఃఖాదులు కూడా ప్రత్యక్షం కాజాలవు. సుఖదుఃఖాది ప్రత్యక్షం సర్వసమ్మతమైంది. అందువలన మనస్సు ఆత్మ కాదు. క్షణిక విజ్ఞానవాదులు అయిన యోగాచారులు విజ్ఞానం ఆత్మ అంటారు. విజ్ఞానం రెండు విధాలు. ఒకటి ఆలయ విజ్ఞానం. రెండు ప్రవృత్తి విజ్ఞానం. అందు ప్రవృత్తి విజ్ఞానం. అయం ఘటః ఇత్యాది రూపమున పదార్థ . రూపం దాలుస్తున్నది. ఆలయ విజ్ఞానము 'అహం' రూపమున ప్రతిభాసిస్తుంటాయి. జ్ఞానం స్వతః ప్రకాశమగుట వలన చైతన్యం అనబడుతుంది. ఈ విజ్ఞానం కూడా సత్తవుట వలన క్షణికమవుతున్నది. క్షణిక విజ్ఞాన పరంపరను ఆత్మగా భావిస్తారు. క్షణిక విజ్ఞాన పరంపరను ఆత్మగా భావిస్తే అనుభవజన్య సంస్కార కల్పన కూడా కావలసి ఉంటుంది. ఆ కల్పనకు మరొక కల్పన చొప్పున ఆనంత్యదోషము వాటిల్లును. కావున క్షణిక విజ్ఞానం ఆత్మ కాదు. న్యాయవైశేషికు లీవిధంగా పేర్కొనుచున్నారు.

## మనస్సు :

న్యాయవైశేషిక వాదులు మన్సును అణువుగా నిత్యంగా పరిగణిస్తారు.

సుఖదుఃఖాది ఉపలబ్ధి సాధనమైన ఇంద్రియం మనస్సనబడుతుంది. శివాదిత్యమతానుసారం శివాదిత్యుడు సప్తపదార్థిలో, 'మనస్త్వజాతి యోగి స్పర్శ శూన్యం క్రియాధికరణం' అని నుడివినారు. మనస్సు స్పర్శ శూన్యమైనను క్రియాధికరణంగా ఉంటుంది. 'అయోగ పద్యాజ్ఞానానాం, తస్యానుగత్వమిహోచ్యతే' అన్నట్లు మనస్సు ఏకము. అణువు. ప్రతి శరీరభిన్నము. మీమాంసకులు మనస్సును విభుద్రవ్యంగా పరిగణిస్తారు. న్యాయవైశేషికవాదులు మనస్సును వ్యాపకంగా స్వీకరింపరు. మనస్సును వ్యాపకంగా గుర్తిస్తే సమస్త వస్తుపరిజ్ఞానం ఒకేసారి కలుగవలసి ఉంటుంది. ఒకదాని పిదప మరొక జ్ఞానం కలుగుచున్నందున అది అణుపరిమాణంగా ఉంటుందని చెప్పవలెను. మనస్సు నిత్యం. అది ఉత్పన్నం కాదు. అది ఏకంగా ఉన్నను అనేకంగా ప్రతి శరీరవర్తియై భాసిస్తుంది. మనస్సునకు ఎట్టి విశేష గుణం లేదు.

## గుణము :

'అథ ద్రవ్యాశ్రితాజ్ఞేయా నిర్గుణా నిష్క్రియాగుణాః' గుణం ద్రవ్యాశ్రితము. ద్రవ్యమును ఆశ్రయించియుండును కావున అది ద్రవ్యభిన్నమైన పదార్థము. గుణములో గుణం కాని, క్రియ కాని ఉండదు. కర్మ కూడా ద్రవ్యాశ్రితమైనను అది సక్రియము. గుణము నిష్క్రియముగా ఉంటుంది. రూప, రస, గంధ, స్పర్శ, సంఖ్యా, పరిమాణ, పృథక్త్వ, సంయోగ, విభాగ, పరత్వాపరత్వ, బుద్ధి, సుఖదుఃఖ, ఇచ్ఛాద్వేష, ప్రయత్నములను 17 గుణములను కణాదుడు పేర్కొన్నాడు. ప్రశస్తపాదాచార్యులు 'గురుత్వ ద్రవత్వ స్నేహ సంస్కార ధర్మ అధర్మ శబ్ద'ములనే 7 గుణములను చేర్చి 24 గుణములను పరిగణించినాడు.

## కర్మ :

పదార్థ గతికి కర్మయని పేరు. గుణ భిన్నము ద్రవ్యసమవేతమై సంయోగవిభాగ కారణమైనది కర్మ యనబడును. 'ఏకద్రవ్యమగుణం సంయోగ విభాగేష్వనపేక్షా కారణమితి కర్మ లక్షణమ్' అని వైశేషిక దర్శనం తెలుపుచున్నది. ఉత్క్షేపణ, అవక్షేపణ, అకుంచన, ప్రసారణ, గమన భేదమున కర్మ 5 విధములు.

## సామాన్యము :

'నిత్యమేకమనేకానుగతం సామాన్యం'. అనేక వస్తువులలో ఏకాకారంగా ఉండే జాతిని సామాన్య మంటారు. 'గోత్వం' అనే జాతి ప్రపంచంలోని అన్ని గోవుల యందు అనుగతంగా ఉన్నది. వ్యక్తి నశించినను జాతి నశించదు. కావున జాతి నిత్యమని గ్రహించాలి. సామాన్యం ద్రవ్యగుణ కర్మలయందు ఉంటుంది. సామాన్యం వ్యక్తిలో సమవాయ సంబంధంతో ఉన్నను, ఆ వ్యక్తికి భిన్నంగానే ఉంటుంది. వ్యక్తి అనిత్యము, అనేకము. సామాన్యము ఏకము, నిత్యము. సామాన్యము పరాపరభేదమున రెండు విధములు. అధికదేశవర్తియైన సామాన్యం పరసామాన్యం. అల్పదేశవర్తియైన సామాన్యం అపరసామాన్యం.

## జాతి బాధకములు :

'వ్యక్తేరభేదస్తుల్యత్వం సంకరోऽథానవస్థితిః రూపహానిరసంబంధో జాతి బాధక సంగ్రహః'. వ్యక్తిభేదము, తుల్యత్వము, సంకరము, అనవస్థితి, రూపహాని, అసంబంధము అనునవి ఆరు జాతి బాధకములు. జాతికి ఆశ్రయ భూతమగు పదార్థముల యొక్క ఏకత్వము వ్యక్తి అభేదము అనబడుతుంది. 'ఆకాశకాలదిక్కులు' అనేకములు కావు. ఇవి ఏకంగా ఉండును. అందువలన వీటిలో ఉండే ఆకాశత్వ, కాలత్వ, దిక్త్వములు జాతులు కావు. అన్యూనానతిరిక్త వ్యక్తిత్వం తుల్యత్వ మనబడుతుంది. హెచ్చుతగ్గులు లేక సమానంగా ఉండే వ్యక్తులలో రెండు సామాన్యములు వేర్వేరు జాతులు కావు. ఘటత్వ కలశత్వములన్నవి రెండు జాతులు కావు. అందొకటే జాతి అవుతుంది. ఎందుకంటే ఘటత్వమునకు ఆశ్రయమైన ఘటము కలశత్వమునకు ఆశ్రయము అయిన కలశమునకు భిన్నము కావు. కావున రెండు సమానములు అగును. అందువలన ఘటత్వమొకటే జాతి అవుతున్నది.

## సంకరము :

'పరస్పరాత్యంతాభావ సమానాధికరణ యోః ధర్మయోః ఏకత్ర సమావేశః సంకరః'. ఒక అధికరణములో ఉండే రెండు ధర్మములు జాతులు కావు. ఉదాహరణ భూతత్వము ముక్తత్వము అన్నవి రెండు జాతులు

కావు.

'పృథివ్యప్తేజోవాయ్వాకాశములు' భూతములు. పృథివ్యప్తేజోవాయు మనస్సులు మూర్తములు. బాహ్యేంద్రియములచే గ్రహింపబడే గంధరసాది విశేషగుణములు కలవానికి భూతములని పేరు. క్రియాశ్రయములు మూర్త ములనబడును. భూతములలో భూతత్వము, మూర్తములలో మూర్తత్వము ఉంటుంది. కాని మూర్తత్వము యొక్క అభావమునకు అధికరణమైన ఆకాశ ములో భూతత్వమున్నది. భూతత్వము యొక్క అభావమునకు ఆశ్రయమైన మనస్సులో మూర్తత్వమున్నది. అందువలన భూతత్వమూర్తత్వములు పర స్పరము ఒకదాని అభావమునకు ఆశ్రయమగు ద్రవ్యములో మరియొక్కటి ఉన్నది. ఇవి రెండు పరస్పరాత్యంతాభావ సమానాధికరణ ధర్మములు అయి నప్పటికి పృథివ్యాదులలో రెండును ఒకచోటనే ఉన్నందున సంకరములై భూతత్వమూర్తత్వములు జాతులనబడవు. వాటిని ఉపాధులనవలయును.

## అనవస్థితి :

ఒకదానిలో ఇంకొకటి చొప్పున అంతము లేకుండా సామాన్యమును అంగీకరించినచో అనవస్థ అవుతుంది. ద్రవ్యములలో ద్రవ్యత్వమువలె ద్రవ్య త్వములో ద్రవ్యత్వము దానిలో ఇంకొకటి ఇట్లు కలిపించుకొనిపోయినచో అనేక జాతులు ఏర్పడి అనవస్థకు దారి తీయును.

## రూపహాని :

'వ్యతోవ్యావర్తకత్వము రూపహాని'. ద్రవ్యత్వ గుణత్వము లన్నవి ద్రవ్యగుణములకు ఇతర పదార్థములనుండి వేరుపరచి వ్యావర్తకమయినట్లే విశేషత్వము విశేషమను పదార్థమును వేరుపరచునదికాదు. విశేషమను పదార్థము విశేషరూపముననే ఇతర పదార్థముల నుండి వ్యావృత్తమవు తుంది. అందువల్ల విశేషత్వమును జాతిగా ఒప్పుకొని విశేషత్వ రూపమున విశేషము, ఇతర పదార్థములనుండి వేరుచేయుదుమేని స్వరూపహాని కలు గుతున్నది. కాబట్టి విశేషత్వము జాతికాదు.

## అసంబంధము:

సమవాయమున నుండు సమవాయత్వము జాతి కాదు. ఎందునగా సమవాయములో మరొక సమవాయసంబంధము ఉండజాలదు. జాతులన్నీ సమవాయ సంబంధములో పదార్థములయందు ఉంటున్నవి. సామాన్యత్వము విశేషత్వము సమవాయత్వము అఖండోపాధులు కావు. సఖండోపాధులు జాతివలె నిర్వచింపవీలైనవి. అఖండోపాధి నిర్వచింపవీలు కానిది. కావున నిత్యమై అనేక వ్యక్తులలో సమవాయసంబంధముతో ఉండే సామాన్యము జాతి అనబడుతుంది. ఇతర పదార్థముల నుండి తనను వేరువరచు దానిని విశేషమని వ్యవహరింతురు. నిత్యసంబంధము సమవాయమనబడును. అవయవ అవయవులలో, గుణగుణులలో క్రియాక్రియావంతములలో జాతివ్యక్తులలో విశేష నిత్యద్రవ్యములలో ఉండే సంబంధమునకు సమవాయసంబంధము అని పేరు.

**కారణము:**

కార్యనియత పూర్వ వృత్తి కారణము. న్యాయవైశేషికానుసారం కార్యమునకు ముందు ఉండి తీరవలసినదే. అన్యథా సిద్ధనియతపూర్వవృత్తి కారణం. ఏది కార్యమునకు నియతంగా పూర్వవృత్తియైనను కార్యోత్పత్తిలో సహాయకం కాదో అది అన్యథా సిద్ధమనబడుతుంది. ఎందుకంటే కార్యంతో అన్యథా సిద్ధమునకు సాక్షాత్ సంబంధము ఉండదు. ఇవి లేకున్నను కార్యము ఉత్పన్నమౌతుంది. ఇది 5 విధములు.

1. కారణమందలి గుణము కార్యకారణము కాదు. ఘటోత్పత్తికి దండము కారణము అవుతుంది. కాని దండగతరూపము ఘటోత్పత్తిలో ఉపయోగముండదు. దండరూపము లేకున్నను, దండము వలన ఘటముత్పన్నమౌతున్నది కదా?

2. కారణకారణం కూడా కార్యోత్పత్తికి కారణం కాదు. కులాలుడు ఘటనిర్మాణానికి కారణము అగును. అతని తండ్రి ఘటనిర్మాణానికి ఉపయోగపడనందున కులాలజనకుడు అన్యథా సిద్ధుడు అగుట.

3. ఘటోత్పత్తి సమయమున ఘటమును కోసే చిన్నపాటి కత్తి నుండి 'చెక్కు'నేధ్వని ఏర్పడుతుంది. ఈ ధ్వని ఘటమేర్పడుటకు ముందున్నది. కాని ఇది ఘట గుణము కాదు.

4. నిత్యమైన విభుద్రవ్యము కూడా ఘటకారణము కాదు. ఘటో

త్పత్తికి ముందు విభువైన ఆకాశము కలదు. అంతమాత్రమున అది ఘటనిష్పాదకమౌతుందా? కావున అది అన్యథా సిద్ధము.

5. ఘటోత్పత్తికి పూర్వము మట్టిని తీసుకునివచ్చే గాడిద ఉన్నను ఆ గాడిదయు ఘట కారణము కాదు. ఘటమృత్తిక గాడిద మీద కాకుండా మరొక సాధనమున కులాలుడు తీసుకొని రావచ్చును. గార్దభము అన్యథా సిద్ధము.

## కారణ భేదములు:

న్యాయవైశేషికమతానుసారము సమవాయి, అసమవాయి, నిమిత్త భేదమున 3 విధములు. ఉపాదాన కారణమునకు సమవాయికారణమని పేరు. పటమునకు తంతువు, ఘటమునకు మృత్తిక సమవాయికారణములు. తంతువులు లేకుండా పటము, మృత్తిక లేకుండా ఘటము నిష్పన్నము కాదు. ఆరెంటికి గల సంబంధము అవినాభావసంబంధము. అవయవ అవయవులకు, గుణగుణులకు జాతివ్యక్తులకు క్రియాక్రియావృత్తులకు విశేష నిత్య ద్రవ్యములకు అయుత సిద్ధములని పేరు. వీటికి ఉన్నసంబంధము సమవాయసంబంధము. కారణమైన తంతువులయందు పటము సమవాయ సంబంధములో ఉన్నందున పటమనే కార్యమునకు సమవాయకారణమౌతున్నది.

## అసమవాయికారణము:

కార్యముతో కాని కారణముతోగాని ఒకేవిషయమునందు సమావేతమైయున్న కారణము అసమవాయికారణము. పటరూపకార్యముతోపాటు తంతు సంయోగము తంతువులలో సమవాయిసంబంధములో నున్నందున తంతుసంయోగము పటమునకు అసమవాయి కారణమౌతున్నది. అట్లే పటరూపము సమవాయి కారణీభూతమైన పటముతో పాటు తంతురూపవిషయంలో సమవాయి సంబంధముతో ఉన్నందున తంతు రూపము పటరూపమునకు అసమవాయి కారణమవుతున్నది. ద్రవ్యము ఎప్పుడూ సమవాయికారణమౌతుంది. గుణకర్మలు సమవాయి కారణంగా ఉండవు. అవి అసమవాయి కారణంగా ఉంటాయి. ద్రవ్యము ఎప్పుడూ అసమవాయి కారణంగా ఉండును. సమవాయి అసమవాయి భిన్నమైన కారణము నిమిత్తమనబడుతుంది. కులాల దండ చక్రాలు నిమిత్త కారణాలు.

## అభావము :

భావప్రతియోగి అభావము. 'సప్తపదార్థి' లో 'ప్రతియోగి జ్ఞానాధీన జ్ఞానః అభావః'. ప్రతియోగి జ్ఞానం లేకుండా ఆ పదార్థజ్ఞానం కలుగదు. ఏ వస్తువు యొక్క అభావమునకు ఆ వస్తువే ప్రతియోగి అవుతుంది. ఘటాభావ మునకు ఘటమే ప్రతియోగి. ఇది నాల్గు విధాలు. 1. ప్రాగభావం 2. ప్రధ్వంసాభావం 3. అత్యంతాభావం 4. అన్యోన్యాభావం.

## ప్రాగభావము :

కార్యోత్పత్తికి పూర్వముందు అభావము ప్రాగభావము. ఉత్పత్స్యమాన అభావము ప్రాగభావమని తాత్పర్యము.

## ప్రధ్వంసాభావము :

కార్యము నశించిన పిదప ఉండే అభావము ప్రధ్వంసాభావము. ఇది ఉత్పన్నాభావము (ఉత్పన్నము యొక్క అభావము).

## అత్యంతాభావము :

త్రైకాలిక సంసర్గాభావము అత్యంతాభావము. భూతభవిష్యద్వర్తమాన ములలోను ఉండే అభావము అత్యంతాభావము. వాయువునందు రూప రాహిత్యము త్రైకాలికము.

## అన్యోన్యాభావము :

ఒక వస్తువునందు మరియొక వస్తువు యొక్క తాదాత్మ్యము నిషేధింపబడుట అన్యోన్యాభావము. ఘటము పటము కాదు. ఘటమునందు పటతాదాత్మ్యము నిషేధింపబడుచున్నది.

## తమోద్రవ్యము :

అంధకారము అను ద్రవ్యము ఉండగా 9 ద్రవ్యములనుట తగునా? 'నీలం తమః చలతి' అను వ్యవహారానుసారము తమస్సునందు నీలమనే గుణము చలనమనే క్రియ ఉన్నవి. మరియు తమస్సునందు రూపముండుట వలన వాయువు ఆకాశములందు (మనోదిక్కాలాత్మల యందు) అంతర్భవిం

చదు. భాస్వర రూపము లేనందున, ఉష్ణస్పర్శ లేనందున తేజోద్రవ్యములో చేరదు. శీతస్పర్శ లేనందున జలములోను, గంధములేనందున పృథివిలోను అంతర్భవింపదు. కావున తమస్సు దశమద్రవ్యమనక తప్పదు అని వాదిం చుటకు వీలులేదు. ఎందుకనగా తమము తేజోభావ రూపమనుట వల్లనే సరిపోవుచుడ వేరే ద్రవ్యంగా పరిగణింప పని లేదు. తేజోస్సునే తమోऽభావ రూపమనుట పొసగదు. అందరకు అనుభవ సిద్ధమగు ఉష్ణస్పర్శయనే రూపము నకు ఆశ్రయమైన మరొక ద్రవ్యమును కల్పించుటకన్న వేడిమికి ఆధారమైన తేజస్సును, ద్రవ్యంగా చెప్పుట ఉచితము కాని తమమునకు ద్రవ్యత్వము అంటగట్టి తేజస్సును తదభావరూపములో అంతర్భవింపచేయుట ద్రవ్యాం తర కల్పనాదోషము వచ్చును. తమస్సు నల్లగా ఉండుననుట భ్రాంతి మూలకము. నిజమగు నలుపే తమస్సులో ఉన్నదందురేని కంటికగుపడు టకు వెలుతురు కారణము. దీపసాహాయ్యమున చూచినపుడు ఆ చీకటి కనబడవలెను కదా? అట్లగుటలేదు. అందువలన తమస్సునకు రూపము, కదలిక, అనునవి భ్రాంతి మూలకములు. ఇవి రెండు దీపాపసర్పణము వలననే కలుగు చున్నవి. కావున తమస్సు కాదు. ద్రవ్యములు తొమ్మిదే.

## ఈశ్వరవాదము:

శ్రీ ఉదయనాచార్యులవారు నిరీశ్వరవాదు లందరిని ఖండించి ఈశ్వర వాదము హేతు బద్ధముగా శ్రుతి సమ్మతంగా స్థాపించినారు. సర్వదర్శన సంగ్ర హకర్తయు 'న్యాయపారావారపారదృశ్వా విశ్వవిఖ్యాత కీర్తిః ఉదయనాచార్యః' అని ప్రశంసించినారు. న్యాయకుసుమాంజలి ప్రథమస్తబకమున కవి ఐదు విప్రతిప త్తులను చూపి 5 స్తబకముల ద్వారా ఈశ్వరస్థాపన కావించినారు. 'అలౌకి కస్య పరలోకస్య సాధనాభావేత్, అన్యథాపి పరలోకసాధనానుష్ఠాన సంభవాత్, తద భావా వేదక ప్రమాణ సద్భావాత్, సత్వేపి తస్యా ప్రమాణకత్వాత్, తత్సాధక ప్రమాణాభావాచ్చ' - అను ఐదు విప్రతిపత్తులను ఖండించి, 5వ స్తబక ములో ఈశ్వరాస్తిత్వమును క్షోదక్షమముగా చర్చించి 'కార్యాయోజనధృత్యాదేః పదాత్ ప్రత్యయతః శ్రుతేః, వాక్యాత్ సంఖ్యా విశేషాచ్చ సాధ్యో విశ్వవిదవ్యయః'. కార్యాదులను 8 హేతువులచే ఈశ్వరసిద్ధి సాధించినాడు.

## కార్యాః

## కార్యాత్ :

ప్రత్యక్షప్రమాణంద్వారా ఈశ్వరసిద్ధి చేకూరదు. ప్రత్యక్షము విఫలమైన ప్పుడు సాధ్యసాధన అనుమానప్రమాణం ద్వారా చేకూరుతుంది. ప్రత్యక్షంగా ఘటపటాది కార్యములను చూచుచున్నాము. ఈ కార్యములను బట్టి తత్కర్తలైన కుంభకార తన్తువాయాదులను అనుమానిస్తున్నాము. అదే విధంగా జగత్తు కార్యమగుటవలన తత్కర్తయైన చేతన ఐన ఒక వ్యక్తిని అనుమానించక తప్పదు. ఎట్లనగా 'క్షిత్యంకురాదికం సకర్తృకం కార్యత్వాత్, యద్యత్కార్యం తత్తత్ సకర్తృకం యథా ఘటః తథాచాయం, తస్మాత్తథా', అన్నది పంచావయవ వాక్యానుమానము. 'క్షిత్యంకురాదికం సకర్తృకం' అన్నది ప్రతిజ్ఞావాక్యం. 'కార్యత్వాత్' అన్నది హేతు వాక్యము. 'యద్యత్ కార్యంతత్ సకర్తృకం యథా ఘటః' అన్నది ఉదాహరణం. తథా చాయం అనునది ఉపననయ వాక్యం. తస్మాత్తథా అనునది నిగమన వాక్యం. సమస్తకార్య ద్రవ్యములు కర్తృజన్యములు. ఏవి సావయవ ద్రవ్యములో అవి కార్యములు. జగత్తు సావయవం. కావున అది కార్యద్రవ్యమే.

## ఆయోజనాత్ :

ఆయోజనం అనగా సంయో(జనము)గము. సృష్ట్యాదిలో రెండు పరమాణువుల సంయోగంవలన ద్వ్యణుకాది ఉత్పత్తి కలుగుతుంది. క్రియ లేకుండా సంయోగము సంభవింపదు. అచేతనములైన పరమాణువులలో స్వభావతః క్రియ చేకూరుతుంది. అందువలన పరమాణు సంయోగమునందు క్రియ ఏర్పడుటకు చేతన వ్యక్తి సహాయమవసరమవుతుంది. ఆ సంయోజకుడు ఈశ్వరుడు తప్ప మరెవడు అగును?

## ధృత్యాదేః :

ధృతి అనగా ధారణ. అది పదం వలన ప్రళయము. ఇంతటి విశాల విశ్వాన్ని ధరించేవాడు భరించేవాడు లేనిచో ఈ విశ్వం నిలువజాలదు. కావున ఈ విశ్వానికి ధారకుడు సంహారకుడు ఒకడు ఉండితీరాలి. అతడే ఈశ్వరుడు.

## పదాత్ :

పదం అనగా వ్యవహారము. ఈ విశ్వంలో ఘటపటాది నిర్మాణ శిక్షా

పాటవాన్ని బోధించేవాడు ఒకడు ఉండాలి. సృష్టి మొదలైన పిదప ఆయా వస్తువుల నిర్మాణము గురించి తెలిసినవాడు తెలిపేవాడు ఒకడు ఉండాలి కదా. ఆ తెలిసినవాడు ఆ తెలిపినవాడు, నేర్పినవాడు ఈశ్వరుడు కాక మరెవ్వడు అగును.

## ప్రత్యయతః :

ప్రత్యయ మనగా ప్రామాణ్యము అని అర్థము. సర్వజ్ఞత్వాది గుణాలన్ని ఈశ్వరునిలో కలవు. భ్రమ ప్రమాదాది శూన్యమైన వేదములను అందించిన వాడు ఆతడే. కావున ఈశ్వరుడు ఉన్నాడని ప్రత్యయము వలన తెలియుచున్నది.

## శ్రుతి :

శ్రుతి అనగా వేదము. వేదాదివాఙ్మయ మంతయు ఈశ్వరుడున్నాడని ఎలిగెత్తిచాటు చున్నది.

## వాక్యాత్ :

'వేద వాక్యం పౌరుషేయం' - 'మహాభారతమువలె' - అను అనుమాన ప్రమాణం వలన వేద నిర్మాతయైన పురుషుడు సర్వజ్ఞత్వాది గుణ విశిష్టుడైన ఈశ్వరుడే యగును. కావున న్యాయవైశేషికములు రెండును ఈశ్వర వాదము స్థాపించే ప్రధాన దర్శనములు. ఈ రెండూ ఈశ్వర సత్తను నిర్ణయించుచూ తత్త్వజ్ఞానము ద్వారా ఆ ఈశ్వర సన్నిధిని చేరుటను ఉపదేశించుచున్నవి. అందువలన న్యాయదర్శన కర్త 'ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత సిద్ధాంతావయవ తర్క నిర్ణయ వాద జల్ప వితండ హేత్వాభాస ఛల జాతి నిగ్రహస్థానానాం తత్వజ్ఞానం మోక్ష కారకం. ఈశ్వర తత్త్వజ్ఞానం కలుగుటకు జీవాదీతర పదార్థముల తత్వజ్ఞానం ఎంతో అవసరం. ఆ జీవాది పదార్థజ్ఞానం శాస్త్రం వలన సిద్ధించును. శాస్త్రశ్రవణము వలన కలుగు పదార్థజ్ఞానం కుటిలయుక్తుల ద్వారా సంశయగ్రస్తమగునేని మోక్షసాధనం కాజాలదు. అట్టి సంశయాదులను తొలిగించి, దృఢమైన తత్త్వజ్ఞానం కలిగిస్తూ ముముక్షువులకు ప్రధానంగా ఉపకరించునది న్యాయదర్శనము (న్యాయ విద్య). ఈ న్యాయవిద్య దుఃఖ ప్రవృత్తి

దోష మిథ్యాజ్ఞానాదులను క్షోదక్షమంగా చర్చించి జిజ్ఞాసువునకు దృఢమైన జ్ఞానం కలిగిస్తుంది. అందువలన ప్రమాణ ప్రమేయాది తత్త్వజ్ఞానం వలన దుఃఖాత్యంత నివృత్తిపూర్వక మోక్షానందం సిద్ధిస్తుందని న్యాయదర్శనకర్త నిరూపించినాడు. మహర్షి కణాదుడును 'యతోభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః, సధర్మః త్రివిధ దుఃఖాత్యంతాభావః నిశ్శ్రేయసం' అని నుడివినాడు. అభ్యుదయ మనగా ఐహికాముష్మిక అభివృద్ధి. నిశ్శ్రేయసమనగా ముక్తి. అనగా త్రివిధ దుఃఖాత్యంతాభావము.

దుఃఖములు మూడు. 1. ఆధ్యాత్మికము 2. అధిభౌతికం, 3. అధిదైవికము. 1. అధ్యాత్మిక దుఃఖము : వాతపిత్తాది ధాతువైషమ్యం వలన శరీరమందేర్పడే వ్యథ, కామక్రోధాది మూలమున నేర్పడే మనోవ్యథ ఆధ్యాత్మిక దుఃఖములు. మనస్సునందు శరీరమునందు వ్యథ ఏర్పడుచున్నందున, దీనికి ఆధ్యాత్మక దుఃఖమని పేరు. 2. అధిభౌతికము : క్రూరమృగ, పశుపక్ష్యాది మూలమున ఏర్పడే దుఃఖం అధిభౌతికము. 3. అధిదైవికము : అగ్ని జల వాయు ప్రకోపాదులచే వాటిల్లే దుఃఖము అధిదైవికము. కావున దేనివల్ల అభ్యుదయ నిశ్శ్రేయసములు సిద్ధించునో అది ధర్మమనబడుతుంది. వాస్తవంగా ధర్మము అభ్యుదయమునకు సాక్షాత్కారమైనను మోక్షమునకు పరంపరా కారణమౌతుంది. అనగా ధర్మము తత్త్వజ్ఞానమును కలిగించి, దాని ద్వారా మోక్షము కలిగిస్తుందని భావము. కావున తత్త్వజ్ఞానాన్ 'నిశ్శ్రేయసం' అని నొక్కిచెప్పినాడు.

## సృష్టి ప్రళయములు:

పరమాణువుల వల్ల జగత్తు ఉత్పన్నమగుచున్నదని న్యాయవైశేషికములు తెలుపుచున్నవి. ఈశ్వరునిలో సృష్టి, విషయకమైన ఇచ్ఛ కలిగినపుడు మొట్టమొదట వాయు పరమాణువులలో స్పందనం ఏర్పడుచున్నది. అప్పుడు రెండు పరమాణువులు మిళితములగును. ఇట్టి పరమాణువుల సంయోగంవలన ద్వ్యణుకోత్పత్తి అగుచున్నది. పరమాణువు ద్వ్యణుకాలు రెండును అతీంద్రియములు. పిదప మూడు ద్వ్యణుకముల సంయోగము వలన త్రసరేణు ఉత్పత్తి జరుగుతుంది. త్రసరేణు మహత్పరిమాణం అగుట వలన అది ప్రత్యక్షగోచరం అవుతున్నది. పిదప నాలుగు త్రసరేణువులసంయోగంవల్ల

చతురణుకం ఇట్లే పంచాణుకాల ఉత్పత్తి వల్ల మహావాయువు వుత్పన్న మౌచున్నది. పిదప జలీయ పరమాణువులలో స్పంధనం ఏర్పడి క్రమముగా జల మహాభూతం ఉదయిస్తుంది. పిదప తైజస పరమాణువుల సంయోగం పూర్వోక్తక్రమముగా తేజో మహాభూతం ఉత్పన్నమౌతుంది. ఇట్లు 4 మహాభూతాలు ఉత్పన్నమైన పిదప ఈశ్వరుడు ధ్యానించునంత మాత్రమున పార్థివ, తైజస పరమాణువులతో హిరణ్మయ పిండం పుట్టుచున్నది. ఆ పిండమునే హిరణ్యగర్భుడు అని వ్యవహరింతురు. హిరణ్యగర్భుని ద్వారా చతుర్ముఖ బ్రహ్మ అవిర్భవించును. అతని ద్వారా బుద్ధ్యహంకారములు ఉత్ప త్తిల్లును. వాటికే మనస్సని పేరు. ఆ పరమేశ్వరుని సంకల్పము వలన జగత్సృష్టి జరుగుతుంది. క్రమంగా మనువులు దేవతలు ఋషులు పితరులు మనుష్యులు పశుపక్షులు క్రిమికీటకములు మున్నగు వాని సృష్టి జరుగుతుంది.

బ్రహ్మ శతాయుష్కుడు. అతని ఆయువు ముగియునపుడు కొంతకాలము విశ్రాంతి గైకొనవలయుననెడి ఇచ్ఛ కలుగుతున్నది. ఆ ఇచ్ఛచే సృష్టి కార్యము విరతమౌతుంది. అపుడు శరీరం నుండి ఆత్మ విడివడుతుంది. శరీరేంద్రియకర్మలు శరీరేంద్రియ పరమాణువులు విడివడిపోతాయి. పృథివీ జలతేజోవాయు పరమాణువులు క్రమంగా పృథగ్భూతములౌతవి. వీటి పార్థక్యములకే ప్రళయము లేదా సంహారావస్థ యని పేరు. ఈ ప్రకారం ఏర్పడిన అవస్థలో సమస్త జీవజాలము విశ్రాంతి గైకొనును. కేవలం పరమాణువులు శేషిస్తాయి. ఈ విధంగా న్యాయవైశేషికాలు సృష్టి ప్రళయ చక్రమును తెలుపుచున్నవి.

## ప్రామాణ్యవాదం :

ప్రమాణముల వలన ఉత్పన్నమయ్యే జ్ఞానం స్వతః సిద్ధిస్తుందా ? పరతః సిద్ధిస్తుందా ? అనే విషయంలో దార్శనికులలో పెద్దచర్చ జరిగింది. ఈ చర్యకు ప్రామాణ్యవాదమని పేరు. భారతీయ దర్శనములలో ప్రామాణ్యవాదం అతిగహనమే కాదు అతిముఖ్యము. మీమాంసా న్యాయవైశేషిక దర్శనములు బహుళముగా ఈ విచారం కావించినవి.

మీమాంసకులు ప్రామాణ్యమును స్వతః, అప్రామాణ్యమును పరతః గ్రహిస్తారు. న్యాయవైశేషికదర్శనములు ప్రామాణ్యాప్రామాణ్యముల రెంటిని

పరతః గ్రహిస్తాయి. సాంఖ్యదర్శనం ప్రామాణ్యాప్రామాణ్యముల రెంటికి స్వతః పరిగణనం చేస్తుంది. బౌద్ధం అప్రామాణ్యమును స్వతః, ప్రామాణ్యమును పరతః అంగీకరిస్తుంది. జైనదర్శనం ఉత్పత్తిలో రెండింటిని పరతః జ్ఞప్తిలో స్వతఃగా స్వీకరిస్తుంది. 'జ్ఞానగ్రాహకాతిరిక్తానవపేక్షత్వం స్వతస్త్వం, జ్ఞాన గ్రాహకాతిరిక్తాపేక్షత్వం పరతస్త్వం' అని ఈ రెండింటి నిర్వచనం. ఘటము నొకదానిని చూస్తున్నపుడు ఇది ఘటము, ఘటమును చూస్తున్నాననే జ్ఞానము కలుగుచున్నది. కాని మనము చూస్తున్నది వాస్తవంగా ఘటమగునా? ఘటంకానిది మనకెట్లు స్ఫురిస్తున్నది? అనే సందేహం కలుగుచున్నది. అనగా ఘటజ్ఞానం భ్రమకాదని ఎట్లు నిర్ణయిస్తాము. వ్యవహారములో భ్రమకు ప్రమకు భేదమేమి ? ఉన్నదున్నట్లు తెలిసికొనుట 'ప్రమ' యని నిర్వ చింపవచ్చును. కాని జ్ఞాతాంశము ప్రమయా? దానికి విరుద్ధమా ? అని ఎట్లు నిశ్చయింపవలయును. ఆ నిర్ణయము లేకుండా జ్ఞానం ప్రామాణికం కాజాలదు. సత్ప్రమాణమైన జ్ఞానం లేకుండా లోకవ్యవహారం సంభవింపదు. ఎట్టి జ్ఞాన మీమాంస యందైనా జ్ఞాన ప్రామాణికత్వానికి సంబంధించిన చర్చ అవసరమౌతుంది. అందువలన 'ప్రమ' లేదా యథార్థజ్ఞానం స్వతః ప్రమాణమా ? పరతః ప్రమాణమా ? అనే విచికిత్స పుట్టుతుంది. ఇతర ప్రమాణాపేక్ష లేకుండా తన ప్రామాణ్యం సిద్ధించటం స్వతః ప్రమాణము నకు లక్షణము. మరొక ప్రమాణం ద్వారా తన ప్రామాణ్యం నిలవబడుట పరతః ప్రమాణమునకు లక్షణము. సర్వదర్శన సంగ్రహములో ప్రామాణ్యవాదం చక్కగా నిరూపింపబడినది. స్వతః ప్రామాణ్య విషయములో నైయాయికులు ఎంతో ఆక్షేపం కావించుచున్నారు. ప్రామాణ్యం సహజం గానే జ్ఞానంతోపాటు గ్రహింపబడే పక్షంలో సంశయమునకు అవకాశమే ఉండదు. వాస్తవంగా మనకు యథార్థమా ? కాదా ? అను సందేహము ఏర్పడుచున్నది. అందువలన వస్తువును గురించి ఏర్పడిన జ్ఞానమైనను దాని గురించి కలిగిన అనుభవము ఆధారంగా ఏర్పడే కేవల వ్యతిరేకిచే నిర్ణయింపవలసి ఉంటుంది. ఏమాత్రం పరిచయంలేని త్రోవ వెంట వెళ్ళు చున్నవానికి దూరంలో జలము అగుపడిందని అనుకొందాము. అపుడు నేను జలమును చూచితిననే జ్ఞానము అతని కేర్పడినపుడు ఆ జ్ఞానము ప్రమయా? భ్రమయా? అనే సందేహం పొడచూపటం సహజము. దగ్గరకు

వెళ్ళినపుడు అతనికి జలమే గోచరించిన ఎడల మొదట ఏర్పడిన జ్ఞానము 'ప్రమ' యని జలము అగుపడకున్నచో అది 'భ్రమ' అని నిశ్చయమౌతుంది. అందువలన పరతః ప్రమాణము అనుభవసిద్ధమని తేలినది. ప్రామాణ్యము యొక్క స్వతస్త్వము అనగా జ్ఞానంగాని భ్రమగాని ఏదైనా తత్కారణ సామగ్రిచే గ్రహింపబడుతుంది. ఈ నిర్వచనములో మూడు అంశములున్నవి.

1. జ్ఞానమును పుట్టించే సాధన సామగ్రి, దాని ప్రామాణ్య గ్రహణ మునకు కూడా కారణమగుట

2. జ్ఞానోత్పాదక సామగ్రి అంతా, ఆ సాధన యందే ఇమిడియుండుట

3. అజ్ఞాన యథార్థత్వమునకు బాధకములైన అంశములు, ఆ సామ గ్రియందు ఉండకపోవుట. ఇట సామగ్రీ పదం అనుమానాన్ని కూడా స్ఫురింపజేయుచున్నది. ఇది నైయాయికులు చూపే పరతః ప్రామాణ్య వాదము యొక్క సారము.

## సత్కార్యవాదము :

కార్య విషయములో సాంఖ్యులు నైయాయికులు భేదిస్తారు. కార్యము కారణమునందే ఉన్నది. అది పుట్టదని సాంఖ్యులు పేర్కొంటారు. నైయా యికులు కార్యము కొత్తగా పుట్టుతుందని నిర్వచించుతారు. నైయాయిక వాదమునకు అసత్కార్యవాదము అని పేరు. కార్యోత్పత్తి క్రొత్తగా ఆరంభ మవుచున్నందున దీనికి ఆరంభ వాదమను పేరు కూడా కలదు. అవయవి, అవయవములకన్న భిన్నమైనది. ఉత్పత్తికి పూర్వము కార్యము కారణములో ఉండదు. తన ఉత్పత్తికి పూర్వమే కారణమైన తంతువులును, కార్యమైన వస్త్రము ఉన్నచో ఎందుకు అగుపడదు? అట్లయిన క్రొత్తగా దారముమండి కార్యరూప వస్త్ర నిర్మాణము ఎందుకు చేయవలసి వచ్చుచున్నది? అట్లే కార్యరూపమైన దధి కారణరూపమైన క్షీరములో ముందే, ఉన్నచో కొత్తగా తోడు పెట్టవలసిన అవసరం ఎందుకు కలుగుతుంది? మూల ప్రకృతి సర్వసృష్టికి కారణమగుటవలన కార్యరూపమయిన సర్వసృష్టియు కారణ రూపమయిన మూల ప్రకృతివలె అవ్యక్తమయినదని పేర్కొనలసి ఉంటుంది. అందువలన ఉత్పత్తికి పూర్వం కార్యము కారణమునందు ఉండదు. అది

క్రొత్తగా పుట్టుతుంది అని నైయాయికుల వాదం. ఈ వాదమునకు అసత్కార్య వాదమని పేరు. ఇతర కార్యద్రవ్యములకు కర్త ఉన్నట్లే జగత్తునకు కర్త ఉన్నాడు. ఆ కర్త సర్వశక్తిమంతుడైన ఈశ్వరుడు తప్ప మరొకడుకాడు కదా.

## మోక్షము :

భారతీయ తత్త్వశాస్త్రంలో మోక్షము పరమపురుషార్థము. జనన మరణ రూపమైన భవబంధము నుండి విడివడి శాశ్వతానందము పొందుట మోక్షమనబడుతుంది. సకల క్లేశములు తొలగినపుడు సంసార బంధముక్తి కలుగుతుంది. కర్మలు స్వఫలోపభోగం దాకా నిలిచి, క్షీణించి పోవును. కర్మలకు మూలం అజ్ఞానం. అజ్ఞానమే అవిద్య. తత్త్వజ్ఞానం వలన అజ్ఞానం నశిస్తున్నది. కర్మజనితమైన బంధము, తజ్జన్యమైన జననమరణాది రూప దుఃఖము సమూలముగా నశించిపోవుచున్నది. అందువలన దర్శన కర్తలెల్లరు 'తత్త్వజ్ఞానాన్ మోక్షః'. న్యాయవైశేషిక దర్శనాలు చరమ దుఃఖ ధ్వంసంగా అనగా అత్యంతిక దుఃఖ నివృత్తిగా నిరూపించినారు. మిధ్యాజ్ఞానము తొలగిపోయిన పిదప శరీరము, ఇంద్రియములు విషయములు మున్నగు దోషప్రవృత్తి దుఃఖముల నుండి విముక్తి లభించుచున్నది. ఇదే నిశ్శ్రేయసము. గౌతమ మహర్షి ప్రమాణ ప్రమేయాది షోడశ పదార్థముల యొక్క తత్త్వజ్ఞాన సిద్ధివలన నిశ్శ్రేయసము సిద్ధిస్తున్నదని నుడివినాడు. కణాద మహర్షి సత్త పదార్థ సమ్యక్ జ్ఞానమువలన నిశ్శ్రేయసము (సిద్ధిస్తుందని) చేకూరుతుందని అన్నాడు. న్యాయ వైశేషిక దర్శనములు మోక్షావస్థా సుఖదుఃఖ రహితము నిశ్చైతన్యంగా ఉంటుందని నుడువుతున్నాయి. వీరు నిర్వచించే మోక్షం వేదాంతులకు సమ్మతం కాదు. సాంఖ్య దర్శనం పురుషుడు ప్రకృతి పాశములనుండి సర్వదా విముక్తుడై యథార్థస్వరూపం పొందునట్టి కైవల్యము మోక్షమని నిరూపిస్తున్నది. ఈ అవస్థలో పురుషుడు కేవలం ద్రష్టగా సాక్షిగా ఉండిపోవును. అవివేకకారణంవల్ల సంసార జాలములో చిక్కుకొని పురుషుడు త్రివిధ దుఃఖముల ననుభవిస్తున్నాడు. వివేకఖ్యాతి కలిగినపుడు పురుషునకు ముక్తి కలుగుతుందని సాంఖ్యులు నిర్వచింతురు. మీమాంసకులు స్వర్గప్రాప్తియే మోక్షమని నుడువుచున్నారు. కామ్య నిషిద్ధకర్మల నుండి

నివృత్తి, నిత్య నైమిత్తిక కర్మల యందు ప్రవృత్తి మోక్షము సాధనమన్నారు. కర్మజ్ఞానములు రెండు మోక్షప్రాప్తి విషయమున అత్యంతావశ్యకములు అని మీమాంసకులు పేర్కొంటున్నారు. నిష్కామముగా కర్తవ్యబుద్ధితో చేయు కర్మానుష్ఠానము మోక్షసాధకమని ప్రభాకరుడు పేర్కొన్నాడు. ముక్తావస్థలో నిత్యసుఖానుభవము ఉండునని కుమారిలభట్టు తెలిపినాడు. ఈ సుఖము విషయజన్యము కాదు. శుద్ధమైన ఆనందము అని అతని అభిప్రాయము. ఇక వేదాంతులు పలు విధముల ఉన్నందున మోక్ష విషయమున పలు అభిప్రాయాలు కలిగినవి. అద్వైతుల దృష్టిలో బ్రహ్మైక్యమే మోక్షము. మోక్షానికి శ్రవణమననాదులు సాధనాలు విశిష్టాద్వైతుల దృష్టిలో బ్రహ్మైక్యము లేదు. జ్ఞాన భక్తి వైరాగ్యములు భగవత్ సన్నిధి చేర్చుటకు సాధనాలు. ముక్తావస్థలో కూడ జీవేశ్వరుల మధ్య ఉపాసకోపాస్యభేదము ఉంటున్నది. మాధ్వదర్శనంవలె ఉపాస్యోపాసక భేదము జీవదేవుల మధ్య అంగీకరిస్తుంది.

చార్వాకులు దేహోచ్ఛేదమే ముక్తి అన్నారు. బౌద్ధులు పలుతెరంగుల నున్నారు. వారి సంప్రదాయము సంక్షేపముగా నిట్లు భావింపవచ్చును. ప్రపంచమంతా అనిత్యము. ఏదికలదో అది అనిత్యము. ఏది అనిత్యముకాదో అది లేనేలేదు. ఇది బౌద్ధదర్శనములోని ముఖ్యమైన ప్రాతిపదిక. దీని ప్రకారము సంసార మనిత్యము. అనాత్మము. అనిత్యమగు దీనిని నిత్యంగా ఎవడు భావిస్తాడో, ఆత్మరహితమగు దీనిని, ఆత్మ సహితమని ఎవడు విశ్వసించునో అతడు దుఃఖపడును. దుఃఖ హేతువు, దుఃఖ నిరోధము, దుఃఖ నిరోధమార్గము అను మూటిని బుద్ధుడు ఉపదేశించినాడు. నిర్వాణము పొందవలయునన్నవాడు ఎనిమిదింటిని సాధింపవలెను.

ఆ ఎనిమిది 1. సమ్యగ్ దృష్టి 2. సమ్యక్ సంకల్పము 3. సమ్యగ్వాణి 4. సమ్యక్ కర్మ 5. సమ్యగాజీవిక 6. సమ్యక్ ప్రయత్నము 7. సమ్యక్ స్మృతి 8. సమ్యక్ సమాధి. ఈ ఎనిమిది ఉపాయముల వలన నిర్వాణము లభించునని బుద్ధుడు తెలిపినాడు. వైభాషిక మాధ్యమిక బౌద్ధ మతానుసా

రము ఆత్మోచ్ఛేదము మోక్షమనబడుతుంది. వైభాషికులు జ్ఞానసంతానమును ఆత్మగా భావించుదురు. జ్ఞాన సంతానపదమునకు జ్ఞాన ప్రవాహమని యర్థము. జ్ఞాన ప్రవాహమే ఆత్మయైనచో ఆత్మచ్ఛేదమనగా జ్ఞానోచ్ఛేదమే అవుతున్నది. ఆత్మ, జ్ఞానరహిత మగుచున్నది. ఇది మాకును సమ్మతమే. జ్ఞాన సంతానమునకు నతిరిక్తముగా మరియొకటి ఆత్మ యున్నదనినచో అది నిత్యమా? అనిత్యమా? అనే ప్రశ్న కలుగుచున్నది. ఆత్మను నిత్యముగా భావించినచో ఆత్మోచ్ఛేదము సంభవింపదు. ఎందుకనగా నిత్య వస్తువు నశింపదు కదా! పోనిండు. ఆత్మ అనిత్యమనియే తలంచరాదా యన్నచో మోక్షం కొరకు ప్రవృత్తి కలుగదు. సర్వప్రియమైనది ఆత్మ కాబట్టి అట్టి ప్రియమైన ఆత్మను నశింప చేసికొనవలయునను తలంపు కలదు. కావున 'ఆత్మోచ్ఛేదో మోక్షః' అనే బౌద్ధవాదము సరికాదు.

జైనులు సమస్త కర్మల సంక్షయమే మోక్షమని భావింతురు. మోక్ష మందు జీవులు అనంత జ్ఞానము అనంత సుఖములచే వెలుగుదురు. ముక్తులు అనంత జ్ఞాన, అనంత వీర్య, అనంత శ్రద్ధా, అనంత శాంతులనే అను అనంత చతుష్టయమును అనుభవింతురు. ఇది జీవుల నిజస్వరూపము. దీనిని కేవలావస్థా, లేదా కైవల్యము అని అందురు. బద్ధావస్థ యందు ఇది ఆవరింపబడి శుద్ధ స్వరూపము మలలిప్తమౌతుంది. ముక్తులు బద్ధజీవుల కల్యాణం కొరకు పాటుపడుదురు. ముక్తుల సాహాయ్యముచే లోకాకాశ మును దాటి, సిద్ధుల నివాస స్థానముచేరి, అనంత చతుష్టయానుభూతితో జీవుడు ఆనందించును. దుఃఖా భావము, అనంతమైన సుఖము అయినదే మోక్షము. సమ్యగ్ దర్శన, సమ్యగ్ జ్ఞాన, సమ్యక్ చారిత్రముల వలన మోక్షము సిద్ధించు చున్నది అని జైనులు వక్కాణింతురు. జైనుల ఆవ రణ భంగము మోక్షము. ఆవరణమనగా కర్మబంధము. కర్మలు ఆత్మను ఆవరించి యుండును. దీనివలన ఆత్మ యొక్క శుద్ధస్వరూపము గోచరిం చదు. శ్రద్ధా జ్ఞాన చరిత్రల వలన ఆవరణము నశించినపుడు జన్మ మృత్యు రూపమైన కర్మ బంధము కూడా నశించిపోవుచున్నది. కర్మ పుద్గలముల

అభావము సర్వథా ఏర్పడుచున్నది. అపుడు ఆత్మ తన శుద్ధస్వరూపముతో భాసించుచున్నది. ఆత్మ తన శుద్ధ స్వరూపముతో వెలుగవలయునన్న సమస్త కర్మ క్షయము కావలసియున్నది. సమస్త కర్మసంక్షయము మోక్షమను జైనుల వాదము మాకును సమ్మతమే. మా అభిప్రాయము కూడా జన్మ మృత్యురూప కర్మ బంధ సర్వథా విముక్తియే మోక్షమని కదా - అని తార్కికులు పేర్కొన్నారు.

ఇతి శ్రీః

# సాంఖ్య యోగ దర్శన సమీక్ష

మొదటినుండి సాంఖ్యయోగదర్శనములు స్వస్వనామములతోనే వ్యవహరింపబడుచున్నవి. మొదట సాంఖ్యపదనిరుక్తిని తెలిసికొనెదముగాక. 'సం' ఉపసర్గతో కూడిన దర్శనార్థకమగు చక్షిఙ్ధాతువునకు అఙ్ ప్రత్యయము చేర్చగా సాంఖ్య పదమేర్పడినది. 'చక్షిఙ్ వ్యక్తాయాం వాచి అయం దర్శనేఽపి' అనే చక్షిఙ్ ధాతువునకు వ్యక్తవాక్కు, దర్శనము అను రెండర్థము లున్నట్లు పై కౌముది వాక్యం వలన తెలియుచున్నది. 'సమ్యక్ ఖ్యాతి సమ్యక్ దర్శనమ్, లేదా సమ్యక్ జ్ఞానం' అని సాంఖ్య పదవ్యుత్పత్తి వలన లభ్యమైన అర్థము. సత్వపురుషాన్యతా ఖ్యాతి వివేక ఖ్యాతి వివేక జ్ఞానాది అర్థములన్నీ సాంఖ్య పదములో ఇమిడి యున్నవి. ప్రకృతి పురుషుల యొక్క విభాగపూర్వక వివేచన ఈ దర్శనమునందు ప్రధానముగా కలదు. అందువలన కపిల దర్శనమునకు సాంఖ్య దర్శనమనే పేరు సిద్ధించినది. 'సమ్యక్ ఖ్యానమ్ సంఖ్యా'. సంఖ్యైవ సాంఖ్యమ్. ప్రకృతి పురుష వివేకాత్మకం విశిష్టజ్ఞానమ్ ప్రకృతి పురుషుల వివేచనతోపాటు మహదాది పదార్థములయొక్క యథార్థ జ్ఞానము సమ్యక్ లెస్సగా కలిగించుచున్నందున సాంఖ్య మనే పేరు వచ్చినదని పై వ్యుత్పత్తి వలన తెలియుచున్నది. 'సంఖ్యావాన్ పండితః కవిః' అని అమరకోశకర్తయు సంఖ్యా పదము జ్ఞానపరకముగా నిర్దేశించినాడు. జ్ఞానయోగేన సాంఖ్యానాం, కర్మయోగేన యోగినామ్ అను గీతా వాక్యముకూడ సంఖ్యాపదము జ్ఞానార్థకముగా బోధించుచున్నది. చర్చా సంఖ్యా విచారణా అని మరియొకచోట అమరకోశకర్త సంఖ్యాపదము విచారణార్థకముగా లేదా చర్చార్థకముగా నున్నట్లు తెలిపినాడు. దోషాణాంచ గుణానాంచ ప్రమాణం ప్రవిభాగతః కించిదర్థమభిప్రేత్య సా సంఖ్యేత్యుపధార్యతామ్. గుణ దోష మీమాంసా పూర్వకంగా ఏదైనా ఒక విషయముపై సప్రమాణముగా కావించే విచారణ సంఖ్య అనబడుతుందని పై మహాభారతములోని శ్లోకమువలన తెలియుచున్నది.

కొందరు సంఖ్యాపదమును గుణనావాచకముగాను గ్రహించినారు. మత్స్య

ముల పరిగణన ఈ శాస్త్రమందు ప్రధానముగా కావింపబడుట వలన ఈ దర్శనమునకు సాంఖ్యమను పేరు వచ్చినదని మత్స్యపురాణవచనం వలన తెలియుచున్నది. మహాభాగవతము తత్త్వసంఖ్యానము సాంఖ్యమని నుడివినది. మహాభారతవ్యాఖ్యాత శ్రీధరాచార్యులును తత్త్వానాం 'సంఖ్యాతా గణకః సాంఖ్యప్రవర్తక ఇత్యర్థః' అని తత్త్వ ప్రవర్తకునిగా సాంఖ్యుని తెలిపినారు. బ్రహ్మపురాణములో సాంఖ్య దర్శనమేతావత్ పరిసంఖ్యాన ముచ్యతే అని సాంఖ్య దర్శనమును తత్త్వ పరిసంఖ్యానముగా తెలుపబడినది. రామతీర్థ భట్టాచార్యులు ఇరువదిఐదు తత్త్వములపై విచారణ కావించుటవలన సాంఖ్యమను పేరు వచ్చినటుల, 'పంచవింశతి తత్త్వానాం విచారః సాంఖ్యం, తమధికృత్య కృతో గ్రంథః సాంఖ్య ముచ్యతే' అని నుడివినాడు. దేవతీర్థస్వామియు రామతీర్థ భట్టాచార్యులను సమర్థించుచూ, 'సమ్యక్ క్రమ పూర్వకఖ్యానం కథనం యస్యాస్సా సంఖ్యా క్రమపూర్వక విచారణాతాం అధికృత్యకృతో గ్రంథః సాంఖ్యమ్'. క్రమ పూర్వక విచారణ కావించుట వలన ఈ గ్రంథమునకు సాంఖ్యమను పేరు వచ్చినదని తెలిపినారు. ఈ విధముగా గణనావాచక సంఖ్యాపదమునుండి సాంఖ్యం నిష్పన్నమైనట్లు వీరి మాటల వలన తెలియుచున్నది. కాని గౌతమ మహర్షి ప్రణీత న్యాయదర్శనములో షోడశతత్త్వముల గణన కలదు. ఇతర దర్శనములలోను ఎన్నో తత్త్వముల పరిగణన కావింపబడినది. పరిగణనయే ప్రధానమైనచో దానికి కూడ సాంఖ్యమను పేరు రావలసియుండవలెను. అందువలన గణనావాచకము కాకుండ జ్ఞానవాచకముగానే సంఖ్యాపదమును గ్రహించుట యుక్తము. ఎందుకనగా సాంఖ్యములో ప్రకృతి పురుష వివేక జ్ఞానము వలనే పరమ లక్ష్యమైన మోక్షము సిద్ధించునని నొక్కి చెప్పబడినది. ఆ పరమలక్ష్యము సిద్ధించవలయు నన్నచో ప్రకృతి పురుష వివేక జ్ఞానము అవశ్యాపేక్షితమగుచున్నది. కావున సాంఖ్యపదము ప్రకృతి పురుష వివేక జ్ఞానరూపార్థమునే బోధించుచున్నది. ఇదే ప్రధానమైన అర్థము. పంచవింశతి తత్త్వపరిగణన యన్నచో గౌణమగును. మహాభారతము కూడ 'సంఖ్యాం ప్రకురుతేచైవ ప్రకృతిం చ ప్రచక్షతే, తత్త్వాని చతుర్వింశత్ తేన సాంఖ్యం ప్రకీర్తితం' అని ఉభయార్థకముగా గ్రహించినది. అనగా ప్రకృతి పురుష వివేక జ్ఞానము

ుపదేశించుచూ ప్రకృతిని వ్యాఖ్యానించుచు చతుర్వింశతి తత్త్వములను ప్రతి
పాదించుచున్నందువలన దీనికి సాంఖ్యవ్యపదేశము వాటిల్లినదని మహాభారతము
తెలిపినది. శంకరాచార్యులవారు, విజ్ఞానభిక్షువు పూర్వోక్తోభయార్థములను
హించినారు. 'సాంఖ్యం సమ్యక్ వివేకేన జ్ఞానం, పంచవింశతి తత్త్వానాం
చారః సాంఖ్యమ్' అని ఒకచో సాంఖ్య పదమునకు సమ్యక్ ఖ్యాతి
ని మరొకచో పంచవింశతితత్త్వ విచారమని పూర్వాచార్యులు తెలిపి
ారు. షడ్దర్శనసముచ్చయ టీకాకర్త, హరిశ్చంద్రసూరి, మరియొక క్రొత్త
ర్వచనమును చూపినాడు. 'సాంఖ్యం పురుషనిమిత్తేన సంజ్ఞా, సంఖ్యా
మే సాంఖ్యాః, తాలవ్యోవాశకారః శంఖనామ ఆదిపురుషః'. శంఖుడనే
ఆదిపురుషుడు సాంఖ్య ప్రవర్తకుడని అది రానురాను సాంఖ్యపదముగా
ారూపొందినట్లు తెలిపినాడు. బ్రహ్మపురాణములో కూడ 'శంఖశ్చ శంఖపా
శ్చ కపిలో వామనస్తథా సహాషః శంఖరోమా చ మణిరిత్యేవమాదయః'
ని కపిలాది శ్రేణిలో శంఖుడనే ఆచార్యుడు నిర్దేశింపబడినాడు. పద్మపురా
ములోకూడ ఇదే మాటకలదు. కాని ఈ మాటను ఎవరు ప్రమాణంగా
రిగణించుటలేదు. మొత్తము మీద వివేకఖ్యాతిని పరమార్థముగా పెట్టుకొని
ంచవింశతి తత్త్వముల స్వరూపస్వభావములు స్పష్టముగా నిరూపించుట
లన కపిల దర్శనమునకు సాంఖ్యమనే వ్యవహారము అనాదిగా వచ్చుచున్న
దని భావించుట యుచితము.

## యోగ శబ్దార్థము :

సంస్కృత వాఙ్మయములో నానార్థములయందు యోగపదము వాడబ
డినది. 'యోగః సంహననోపాయ ధ్యానసంగతి యుక్తిషు' అని అమరకోశకర్త
సంహననము, ఉపాయము ధ్యానము సంగతి, యుక్తి అనే అర్థములను
తెలిపినాడు. భగవద్గీత 'యోగః కర్మసు కౌశలమ్' కర్మ ప్రావీణ్యార్థకముగా
యోగపదమును నిర్దేశించినది. జ్యోతిశ్శాస్త్రము కొన్ని గ్రహములయొక్క
సహస్థితి యోగమని తెలిపినది. ఆయుర్వేదము కొన్ని ఔషధుల, లేదా
ద్రవ్యముల మిశ్రణమునకు యోగమను పేరు నుపయోగించినది, మరియు
త్రిదోషముల యొక్క యుగపదుద్దీప్తావస్థ సన్నిపాతమని, ఆ త్రిదోషముల
యొక్క ప్రశాంతమయిన సామ్యావస్థ సమాధియగునని తెలిపినది. కాని

యోగ శాస్త్రము ఈ అర్థములో సమాధిపదమును నిర్దేశించుట లేదు. చిత్తవృత్తి నిరోధము యోగమని పతంజలి దర్శనము తెలుపుచున్నది. యుజ్ ధాతువునకు భావ కరణార్థముల యందు ఘఞ్ ప్రత్యయము చేర్చగా యోగపదమేర్పడినది. ధాతుపాఠములో యుజ్ ధాతువు యుజిర్ ధాతువులు కలవు. యుజిర్ ధాతువునకు యోగమని యుజ్ ధాతువునకు సమాధి యని అర్థము ఈయబడినది. సమాధ్యర్థక యుజ్ ధాతువునుండి యోగప దము నిష్పన్నమైనచో, ఆ యోగపదము సమాధ్యర్థమునే బోధించుచున్నది. సమాధి రెండు విధములు. సంప్రజ్ఞాతము అసంప్రజ్ఞాతము అని 'యుజ్యతే అనేనేతి యోగః' - కరణార్థమున యుజ్ ధాతువునకు ఘఞ్ ప్రత్యయము చేర్చుటవలన యోగశబ్దము ఏర్పడుచున్నది. అప్పుడు సంప్రజ్ఞాత సమాధి అని అర్థము వచ్చుచున్నది. యోజనం యోగః అని భావార్థమున ఘఞ్ ప్రత్యయము వచ్చినచో, ఆ యోగపదము అసంప్రజ్ఞాత సమాధి అనే అర్థము నిచ్చుచున్నది. సమగ్రముగా, బాగుగా, ఆత్మ పరమాత్మయందు కలిసిపోవుట అనేది సమాధి పదము యొక్క అర్థము. ఆత్మపరమాత్మల యొక్క మధ్యయందున్న వివిధ భేదములు సమసి పోవుటయేగాక ఆత్మ పర మాత్మలో తాదాత్మ్యము చెందుట యోగమగునని అర్థము, 'జీవబ్రహ్మణో రైక్యం యోగః' అని జీవబ్రహ్మలయైక్యమే యోగపదమునకు గల యర్థమని తెలియుచున్నది. ఈ యర్థము గ్రహించే పలువురు సమాధ్యర్థక యుజ్ ధాతువుతోనే యోగపదము సిద్ధించినటుల భావించుచున్నారు. కాని ఇంత మాత్రము అర్థము యోగపదమునకు సరిపోదు. ప్రకృతి పురుషుల యథార్థా నుభవము సమాధిలో సిద్ధించుచున్నది. సమాధి మహదాదుల సమాహారము. కావున యుజిర్‌యోగే అనే ధాతువునుండి యోగ పదము నిష్పన్నమైనట్లు పమాలోచకులు భావించుచున్నారు. వాస్తవముగా ఈ రెండర్థములు యోగ పదములో, ఇమిడి యున్నవి. ఆ రెండర్థములను లక్షీకరించియే 'యోగః చిత్తవృత్తి నిరోధః' అని ప్రథమ సూత్రము తెలిపినది. చిత్తవృత్తి నిరోధము అనగా నాల్గు వైపుల చిత్తమును పోనీయకుండ ఒకే ధ్యేయముతో సంయో జనకావించుట, అనగా చిత్తము వృత్తి శూన్యము కావిస్తూ పరమాత్మతో ఏకముచేయుట యోగమని గ్రహించుట యుచితము.

## సాంఖ్య యోగముల ప్రాశస్త్యము :

ప్రాచీన కాలములో సాంఖ్య యోగములను గురించి విస్తృతంగా చర్చ జరిగినట్లు వైదిక సాహిత్యములో ఎన్నో ప్రమాణములు లభించుచున్నవి. శ్వేతాశ్వతరోపనిషత్తులో సాంఖ్య విషయక జ్ఞానము వలననే మానవునకు మోక్షప్రాప్తికలుగుచున్నదని తెల్పబడినది. మహాభారతము 'నాస్తి సాంఖ్య సమం జ్ఞానం, నాస్తి యోగ సమం బలం'. సాంఖ్యమును బోలిన జ్ఞానము గాని యోగమును బోలిన బలముగాని లేదని తెల్పుచున్నది. శంకరాచార్యులు సాంఖ్య దర్శనకర్తను ప్రధాన మల్లునిగా పేర్కొనినారు. కూర్మపురాణము- 'వదంతి కారణైర్వేదం సాంఖ్యం సమ్యగ్ ద్విజాతయః ఏతదాహూ ర్మహాప్రాజ్ఞాః సాంఖ్యం వై మోక్షదర్శనమ్' - సాంఖ్యము వేదమేకాదు. మోక్షదర్శనము కూడ అని ఉగ్గడించినది. పూర్వోక్త ప్రమాణముల వలన భారతీయ జ్ఞానవిజ్ఞాన సభ్యతాసంస్కృతి సర్వస్వమునకు మూలస్తంభము సాంఖ్యయోగ దర్శనమేయని తెలియుచున్నది. యోగము భారతీయ మనోవిజ్ఞాన దర్శనము. శివసంహితలో- 'ఆలోక్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః ఇదమేకం సునిష్పన్నం యోగశాస్త్రం పరం మతమ్'. సమస్త శాస్త్రముల నవలోకించి పునః పునః విచారించిన పిదప అన్నిటికంటె ఉత్తమమైన శాస్త్రము యోగశాస్త్రమని నిశ్చిత బుద్ధితో చెప్పుచున్నానని శివుడు చెప్పినాడు. ఈ విధముగా సాంఖ్యముతో బాటు యోగము కూడ విస్తృత ప్రాశస్త్యమును పొందిన శ్రేయోవిధాయకమైన దర్శనము. వాస్తవముగా యోగమే మోక్షసాధనము. యోగము లేకుండ మోక్షము సిద్ధింపదు. భగవద్గీతలో సాంఖ్యయోగములు రెండును శ్రేయస్కరములుగా నుడువబడినవి.

## సాంఖ్య యోగముల ప్రాచీనత్వము :

ఆస్తిక దర్శనములలో సాంఖ్యయోగములు అత్యంత ప్రాచీనములైనవే కాక మహామహిమోపేతములై వైదిక సర్వస్వమును కాపాడుచు వరంపరగా వస్తున్న దర్శనములు. ఈ దృష్టితో పరిశీలిస్తే సాంఖ్య యోగదర్శన ప్రవృత్తి ఒకానొక వైదిక మహర్షి ద్వారా ఏర్పడినట్లు బోధపడుచున్నది. సాంఖ్యయోగములు రెండును ప్రాచీనకాలములో ఏకంగా ఉండే దర్శన

ములు- తరువాత కొన్ని కారణములవలన ఇవి రెండు ఒక వృక్షమునుండి విస్తరించిన శాఖలుగా ఒక జలాశయమునుండి విడివడిన ధారలుగా భావింప వచ్చును. కపిలమహర్షి హిరణ్యగర్భు లనువారు సాంఖ్య యోగ ప్రణేతలుగా ఉపనిషత్తులలో కీర్తింపబడినారు. వీరిరువురు వేదకాలిక ఋషులు. 'దశానా మేకం కపిలం సమానం తం హిన్వన్తి ఋతవే పార్యాయ అని 10 మం. 27 సూ. 18 మం. ఋగ్వేదం కపిల మహర్షి నామమును ఉట్టంకించి నది. బృహదారణ్యకోపనిషత్తులో పాతంజలం కావ్యం సూత్రం అని కలదు. వ్యాఖ్యాత, కావ్య పదమునకు కపిల ప్రోక్తం అనే అర్థమును వివరణ ఇచ్చినాడు. ఋగ్వేదములో హిరణ్యగర్భ సూక్తము కలదు. తదృషియు హిరణ్యగర్భుడే. దీనినిబట్టి కపిల హిరణ్యగర్భులనువారు వేదకాలిక ఋషులని చెప్పవచ్చును. మహాభారత భాగవతములు రెండును కపిలుని అగ్నిఅవతా రముగా సాంఖ్య శాస్త్ర ప్రవర్తకునిగా కీర్తించినవి. చూడుడు. 'అగ్నిస్స కపిలో నామ సాంఖ్య యోగ ప్రవర్తకః - పంచమః స కపిలో నామ సిద్ధేశః కాల విప్లుతం ప్రోవాచాసురయే సాంఖ్యం తత్త్వగ్రామ వినిర్ణయమ్' - అని (భాగవతము) 'సిద్ధానాం కపిలో మునిః' అని గీత కపిలుని సిద్ధ ఋషిగా కీర్తించినది. శంకరాచార్యులు కపిల హిరణ్యగర్భు లనువారొక్కరే యని భావించినారు. శ్వేతాశ్వతరాది ఉపనిషత్తులలో కపిలుడు హిరణ్యగర్భు నిగా కీర్తింపబడినాడు. భారతం భాగవతం అహిర్బుధ్న్యసంహితాది గ్రంథములు హిరణ్యగర్భుని యోగశాస్త్ర ప్రవర్తకునిగా కీర్తించినది. వాస్తవముగా సంహితా యుగములోనే యోగ శాస్త్రానికి నాంది జరిగినది. హిరణ్యగర్భుడను ఋషి ఆ యుగమునకు చెందినవాడు. గీతాకాలమునకు ముందే సాంఖ్యయోగములు ఒకే దర్శనంగా ఉండేవి. సాంఖ్యములో నున్న విషయములే యోగములోను కలవు. తత్త్వాల క్రమములోనే కొద్దిపాటి వ్యతిక్రమముకలదు. 'ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి' అను గీతాచార్యుల వాక్కు సాంఖ్య యోగములొక్కటే యని బలపరచుచున్నది. ఉపనిషత్తులలో సాంఖ్య యోగ దర్శనములకు చెందిన తత్త్వాలెన్నో మనకు గోచరించుచు న్నవి. శ్వేతాశ్వతరోపనిషత్తు 'తత్కారణం సాంఖ్య యోగాది గమ్యం' అని సాంఖ్యయోగము పరమోచ్చ సాధనముగా నిరూపించినది. శ్వేతాశ్వతరోప నిషత్తులో జీవుడు ఈశ్వరుడు ప్రకృతి అనువాటిని పార్థక్యము స్పష్టముగా

తెలుపబడినది. 'ద్వా సుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం పరి షస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్ అన్యో అభిచాకశీతి' అని శ్వేతాశ్వతరోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు 'అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీ ప్రజాః సృజమానాం సరూపాం అజోహ్యేకో జుషమాణోను శేతే, జహాత్యేనాం భుక్తభోగామ జోzన్య' లోహిత శుక్ల కృష్ణ రూపాలతో త్రిగుణాత్మకముగా ఉండేది ప్రకృతి. దానినే అజా మాయా అని వ్యవ హరించెదరు. అజుడయిన ఒక జీవుడు తద్భోక్తగా ఉండును. మరొకడు అభోక్తగా పరమాత్మగా వెలుగుచుండును అని త్రివిధ తత్త్వములను పృథక్ పృథక్‌గా నిర్దేశించినది. ఈ మంత్రములో పురుషుడు రెండు విధాలని మొదటి వానిని జీవ పురుషుడని రెండవ వానిని పరమపురుషుడని, మొద టివాడు భోక్త, రెండవవాడు నిర్లిప్తుడుగా ఉండునని, ఛాందోగ్యోపనిషత్తు సాంఖ్యయోగము నిర్దేశించే తత్త్వత్రయాన్ని పేర్కొనినది. దీనివలన వేద బ్రాహ్మణారణ్యక యుగములనాటికే సాంఖ్య యోగములు విస్తరించినందువ లన దాని ప్రాచీనత గురించి శంకింప పనిలేదు.

'తమ ఆసీత్ తమ సామూఢ మగ్రేzప్రకేతం' అను ఋగ్వేద మంత్ర ములో అవ్యక్తము సంకేతింపబడినది. పురుష సూక్తములో విరాట్పురుష వర్ణనము సాంఖ్య పురుషుని సంకేతించుచున్నది. 'సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్' ఇత్యాది వర్ణనము పురుష నానాత్వాన్ని వెల్లడిం చుచున్నది. 'తతో విరాడ జాయత విరాజోzధి పూరుషః' అనుచోట పురుష పదము జీవాత్మను బోధించుచున్నది. సాయణాచార్యులవారు ఆ పురుషుడు దేవ మనుష్య పశు పక్ష్యాది నానా రూపములలో భాసించు నని ఆ పురుషుని భోగ నిమిత్తము శరీర మేర్పడినదని వివరించినాడు. ఋగ్వేదములో కూడా జీవాత్మ ప్రతి శరీరభిన్నుడై ఉంటాడని తెలిపినది. దీనివలన వేదోపనిషత్తులలోనే కాపిల దర్శన తత్త్వబీజములు ఎన్నో ఉన్నట్లు మనకు తెలియుచున్నది. శంకరాచార్యులవారు సాంఖ్యయోగమును వైదిక దర్శనముగా పేర్కొనినాడు. 'సాంఖ్యయోగాది గమ్యం' అను శ్వేతాశ్వతరో పనిషన్మంత్రాన్ని వివరిస్తూ శంకర భగవత్పాదులు 'వైదికమేవ తత్ర జ్ఞానం ధ్యానం చ సాంఖ్య యోగభ్యామభిలప్యతే' అని నుడివినారు. ఉపనిషత్కాల ములో గూడ సాంఖ్యయోగదర్శనం ఎంతో వ్యాప్తిచెందినది. ఈ దర్శనమునకు

చెందిన మూలతత్త్వము లెన్నియో బృహదారణ్యక ఛాందోగ్యాది ఉపనిషత్తులలో వర్ణింపబడినవి. ఛాందోగ్యోపనిష న్మంత్రము సత్త్వ రజ స్తమోగుణములను సూచించుచున్నది. 'యదగ్నేరోహితం రూపం తేజస స్తద్రూపం యచ్ఛుక్లం త దపాం యత్ కృష్ణం తదన్నస్య తేజో జలాన్నములు అను మూడు రక్త శుక్లకృష్ణ రూపములుగా ఉండుటవలన త్రిగుణాత్మకములుగా పేర్కొనబడినది. ఆత్మస్వరూపమును ఛాందోగ్యోపనిషత్తు, 'ఏష ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యుర్విశోకోఽవిజిఘ త్సోఽపిపాసః' - జరా మృత్యు పాప శోక బుభుక్షా పిపాసాది రహితముగా వర్ణించుచు పేర్కొనినది. బృహదారణ్యకోపనిషత్తు, 'యోఽశనాయా పిపాసే శోకం మోహం జరాం మృత్యుమత్యేతి' అని ఆత్మ యొక్క శోక మోహ జరా మృత్యు పిపాసాది రాహిత్యమును తెలిపినది. పురుషుడు కర్తృత్వాదులు లేనివాడు. ఇదే మాటను ఛాందోగ్యోపనిషత్తు బలపరచినది. ఇంతేకాదు సాంఖ్యుల సత్కార్యవాదమును 'సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్ . . . నాసతోఽసజ్జాయత్' అని ఛాందోగ్యోపనిషత్తు స్పష్ట ముగా వెల్లడించినది. కఠోపనిషత్తులో సాంఖ్యయోగాలకు చెందిన అనేక భావములు వర్ణింపబడినవి. 'ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః మనసస్తు పరాబుద్ధిః, బుద్ధే రాత్మా మహాన్ పరః, మహతః పరమవ్యక్తం, అవ్యక్తాత్ పురుషః పరః పురుషాన్నపరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః' ఇత్యాది శ్లోకములలో సాంఖ్య ప్రతిపాదిత తత్త్వముల యొక్క క్రమ వివేచన కావింపబడినది. శ్వేతాశ్వతరోపనిషత్తులో 'అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః అజోహ్యేకో జుష మాణోఽను శేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః' ప్రకృతి అజాయమాసగా లోహిత శుక్ల కృష్ణ రూపగా తెలుపబడినది. సాంఖ్యములో ప్రకృతి త్రిగు ణాత్మికగా అజగా ప్రతిపాదింపబడినది. ఈ ప్రకృతి సమస్త ప్రపంచాన్ని సృష్టించుచున్నది. ఇదే ప్రపంచమునకు ఉపాదానకారణమగుచున్నది. ప్రకృతి కంటె భిన్నముగా పురుషుడున్నాడు. ఆ పురుషులలో నొకడు భోక్త కాగా మరియొక్కడు ఉదాసీనుడుగా ఉంటున్నాడు, అని ఛాందోగ్యోపనిషత్తు అభి ప్రాయాన్ని యోగదర్శనము సంవదించుచున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తులో- 'ప్రాణాన్ ప్రపీడ్యేహ సయుక్తచేష్టః క్షీణే ప్రాణే నాసిక యోచ్ఛ్వసీత స్వదే హామరణిం కృత్వా, ప్రణవం చోత్తరారణిం ధ్యాన నిర్మథ నాభ్యాసాత్

దేవం పశ్యేన్నిగూఢవత్' అని యోగశాస్త్ర ప్రక్రియ సంపూర్ణముగా తెలుపబడినది. ప్రశ్న, ఈశావాస్యాది ఉపనిషత్తులలో సాంఖ్యయోగాలకు చెందిన అమూల్య తత్త్వములు ఎన్నో గోచరించుచున్నవి. భగవద్గీత- 'ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరః మనః మనసస్తు పరాబుద్ధిః యోబుద్ధేః పరతస్తు సః' ఇంద్రియములు శ్రేష్ఠములు. వాటికంటె మనస్సు శ్రేష్ఠము, మనస్సుకంటె బుద్ధి, బుద్ధి కంటె పురుషుడు శ్రేష్ఠుడు అనునది సాంఖ్య తత్త్వమును స్పష్టముగా అనువదించినది. అట్లే 'భూమిరాపోzనలోవాయుః ఖం మనో బుద్ధిరేవచ అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టథా' పృథివీ జలం అగ్ని వాయువు ఆకాశము మనస్సు అహంకారము బుద్ధి అన్నవి 8 ప్రకృతులను భగవద్గీత నిర్దేశించినది. కపిల ప్రణీత తత్త్వ సమాసములో 'అష్టౌ ప్రకృతయః' అనే సూత్రము ప్రకృత్యష్టకమును నిర్దేశించినది. యాస్కాచార్యులు సాంఖ్య తత్త్వాలను భిన్నరూపముగా వివేచించినాడు. పృథివీ జలం తేజస్సు వాయువు ఆకాశం మనస్సు విద్యా మహాత్మ ప్రతిభా ప్రకృతి పంచతన్మాత్రలు భూతాత్మ భూత ప్రకృతి, పురుష పంచవింశకం అని తెలిపినాడు. సత్త్వరజస్తమస్సులను గూడ ఆయన నిర్దేశించినాడు. సాంఖ్యుల యొక్క మొదటి తత్త్వం ప్రకృతి. నిరుక్తములో ప్రతిభగా ఉగ్గడింపబడినది. రెండవ తత్త్వమైన బుద్ధి, నిరుక్తములో విద్యగా, కఠోపనిషత్తులో సత్త్వంగా పేర్కొనబడినది. బుద్ధికే మహత్తత్త్వ మని పేరు. దీనినుండే అహంకారము ఏర్పడుచున్నది. అహంకారము వలన మనస్సు, ఇంద్రియములు, పంచతన్మాత్రలు పుట్టుచున్నవి. పంచతన్మాత్రలనుండి పంచభూతములేర్పడుచున్నవి. ఈ 24 తత్త్వములకు అతీతంగా పురుషుడనేవాడు వేరొక్కడు ఉన్నాడని సాంఖ్యము చెప్పుచున్నది.

ఈ విధంగా వేదోపనిషత్తులలో సాంఖ్యయోగ తత్త్వాలు విడివిడిగా వర్ణింపబడినాయి. వాటి క్రమికత్వము కల్పించిన ఘనత సాంఖ్యమునకు దక్కుతున్నది.

సాంఖ్యయోగదర్శనములపై విశేష కృషిజేసిన వారిని కేవల సాంఖ్యులని, కేవల యోగులని చెప్పలేము. స్థూలముగా వారి చారిత్రక క్రమమిట్లున్నది.

ఆసురి :

భారతీయ దర్శన సాహిత్యములో అసురి, కపిలుని శిష్యునిగా, పంచశిఖుని గురువుగా కీర్తింపబడినాడు. యోగసూత్ర వ్యాసభాష్యమునందు 'ఆది విద్వాన్ నిర్మాణచిత్తమధిష్ఠాయ కారుణ్యాద్ భగవాన్ పరమర్షి రాసురయే జిజ్ఞాసమానాయ తంత్రం ప్రోవాచ' పంచశిఖాచార్యులు యోగసూత్రమును ఉద్ధరించినారు. దీనివలన కపిలుడు యోగశక్తితో సిద్ధదేహమును దాల్చి అసురికి సాంఖ్యశాస్త్రముపదేశించనట్లు తెలియుచున్నది. సాంఖ్యకారికకు చెందిన జయమంగళ టీకా, మాఠర ఉక్తులనునవి కూడ పై విషయమునే బలపరుచుచున్నవి. సాంఖ్యకారిక 70వ శ్లోకములో మరియు భాగవతములోను ఇదేమాట ఉట్టంకింప బడినది. హరిభద్రసూరి వ్రాసిన షడ్దర్శన సముచ్చయ టీకలో 'వివిక్తే దృక్పరిణతే బుద్ధౌ భోగోzస్య కథ్యతే ప్రతిబింబోదయః స్వచ్ఛో యథా చంద్ర మసోంభసి' యను అసురీ శ్లోకమును ఉద్ధరించినారు. కాని అసురి గ్రంథము ఏదియు లభించుటలేదు.

## పంచశిఖుడు :

సాంఖ్యకారిక 70వ శ్లోకములో పంచశిఖుడు అసురి శిష్యునిగా ఉగ్గడింపబడినాడు. కపిల మహర్షి వ్రాసిన షష్టి తంత్రము తన గురువగు అసురిద్వారా ఉపదేశముపొంది అనేక శిష్యుల కుపదేశించినాడు. ~~ఈ~~తడు షష్టి తంత్రమును పదేశించిన 60 పదార్థములలో నొక్కదానిని ఒక్కొక్క అధ్యాయముఖమున వివేచించినాడు. మహాభారతము ఇతనిని పరాశరగోత్రునిగా, ఇతని తల్లి కపిలాదేవియనీ వెల్లడించినది. 'పంచస్రోతసి నిష్ణాతః పంచరాత్రవిశారదః, పంచజ్ఞ పంచకృత్ పంచగుణః పంచశిఖః స్మృతః' అని మహాభారతము పంచశిఖాచార్యులను స్పష్టముగా ప్రస్తుతించినది. పంచశిఖాచార్యులకు జైగీషవ్యుడు ధర్మధ్వజుడు జనకుడు మున్నగువారు శిష్యులైరి. క్రీపూ. 5వ శతాబ్దికిముందే పంచశిఖాచార్యులున్నట్లు చారిత్రకులు చెప్పుచున్నారు.

## వార్షగణ్యుడు:

ఇతనిని చీనీపరంపర- వృషుడు, వృషగణ్యుడని ఉల్లేఖించినది. మహాభారతము సాంఖ్యాచార పరంపరలో ఉన్నట్లు ఇతనిని తెలుపుచున్నది. ఇతడు సాంఖ్యశాస్త్రముపైనేగాక పాతంజల యోగదర్శనముపై కూడ గ్రంథములు వ్రాసినట్లు తెలియుచున్నది. ఇతని సమయము క్రీ.పూ. 400.

## వింధ్యవాసి:

వింధ్యారణ్య నివాసము వలన ఇతనికీ పేరు వచ్చియుండవచ్చును. ఇతడు వార్షగణ్యుని శిష్యునిగా పేర్కొనబడినాడు. వింధ్యవాసి వసుబంధువుయొక్క గురువు అగు బుద్ధిమిత్రుని శాస్త్రార్థములో ఓడించినట్లు వసుబంధు చరిత్ర వలన తెలియుచున్నది.

## జైగీషవ్యుడు:

ఇతడు పంచశిఖుని శిష్యుడు. ఇతని గ్రంథమేదియు లభించుటలేదు. యోగసూత్రమునకు చెందిన వ్యాస భాష్యములో ఇతని పేర ఎన్నో ఉద్ధరణలు లభించుచున్నవి. 'అవట్య జైగీషవ్య సంవాదము' కూడ వ్యాస భాష్యములో గోచరించుచున్నది. విజ్ఞానభిక్షువు తన సాంఖ్య ప్రవచన భాష్యములో ఇతని అభిప్రాయములను ఎత్తి చూపెను. ఇతని కాలము క్రీ.పూ.500.

## దేవలుడు:

యాజ్ఞవల్క్యుని 'అపరార్క టీక'లో దేవలుని పేర కొన్ని ఉద్ధరణలు కానవచ్చుచున్నవి. కృత్యకల్పతరువులో కూడ దేవలుని ఉద్ధరణలు కానవచ్చును. దీనివలన ఇతడు సాంఖ్యసూత్రములపై ఏదేని మహావ్యాఖ్యయో, భాష్యమో రచించి యుండవచ్చును. మహాభారతములో దేవలుడు సాంఖ్య శాస్త్రాచార్యుడుగా కీర్తింపబడినాడు. చీనీ పరంపర దేవలుడు ఈశ్వరకృష్ణుని గురువని తెలుపుతున్నది. ఇతని సమయము క్రీ.పూ. 500 ప్రాంతము.

**పతంజలి:** క్రీ.పూ. మూడవ శతాబ్దము.

## ఈశ్వరకృష్ణుడు:

సాంఖ్యదర్శన ఇతిహాసములో ఈశ్వరకృష్ణుని నామము స్వర్ణాక్షరములలో లిఖింపబడి యున్నది. సాంఖ్యదర్శన సిద్ధాంతమును డెబ్బది కారికలలో స్పష్టముగా నిరూపించినవాడు ఈశ్వరకృష్ణుడు. కావున ఇతని గ్రంథమునకు 'సాంఖ్యసప్తతి కారికా' అనే నామములు ఏర్పడినవి. ఒక్కొక్క కారిక బంగారమగుటవలన సాంఖ్యసప్తతిని 'హిరణ్యసప్తి' యని వ్యవహరించుచు న్నారు. సర్వదర్శన సంగ్రహకర్త ఈశ్వరకృష్ణుని కారికలనే పలు చోట్ల

ప్రమాణముగా తీసికొనినాడు. కొందరు సర్వదర్శన సంగ్రహకర్త సాంఖ్యకారికలనే ప్రమాణముగా స్వీకరించుటవలనను, సాంఖ్యసూత్రములను పేర్కొనక పోవుటవలనను సాంఖ్యకారికయే ప్రథమగ్రంథము అని తత్త్వసమాసముగాని సాంఖ్యసూత్రములు 16వ శతాబ్దమున మొదటివని తెలుపుతున్నారు. కాని పండిత ఉదయవీరశాస్త్రి వీరివాదమును ఖండించి సాంఖ్యసూత్రములు తత్త్వసమాసము రెండును కపిలకృతముగానే సప్రమాణముగా నిరూపించినారు. ఈశ్వరకృష్ణుని సమయము క్రీ.పూ. 2, 3 శతాబ్దులు.

**మాఠరుడు :** ఇతడు సాంఖ్య కారికలకు టీక వ్రాసిన వారిలో ప్రాచీనుడు. మాఠరవృత్తి యను పేర ఇతని భాష్యము లభించుచున్నది. ఇతడు క్రీ.శ. 1వ శతాబ్ది నుండి 5వ శతాబ్ది మధ్య ఉన్నట్లు చారిత్రకులు భావిస్తున్నారు.

## మేధాతిథి :

మేధాతిథి భాష్యము శ్లోకవార్తికము షడ్దర్శన సముచ్చయము. అది గ్రంథాలలో ఇతని పేర ఉద్ధరణలు లభించుచున్నవి. ఇతడు క్రీ. శ. 3వ శతాబ్ది వాడని తెలియుచున్నది.

## గౌడపాదుడు :

సాంఖ్య కారికలపై వెలువడిన ప్రాచీన టీకలలో గౌడపాదాచార్యుల టీక ప్రశస్తి గడించినది. ఇతని టీకను గౌడపాద భాష్యమనియు నుడువుదురు. క్రీ. శ. 5, 6 శతాబ్దములకు చెందినవాడు.

## వాచస్పతి మిశ్రుడు :

ఇతడు షడ్దర్శనాచార్యుడు. న్యాయవైశేషికాది గ్రంథములనేన్నో వ్రాసినాడు. ప్రామాణికుడుగా కీర్తిని గడించినాడు. సాంఖ్యకారికపై ఇతడు వ్రాసిన తత్త్వ కౌముదీ టీక ఎంతో అమూల్యమైనది. మీమాంసపై న్యాయకారిక, న్యాయదర్శనముపై న్యాయవార్తిక తాత్పర్యము, యోగభాష్యముపై తత్త్వ వైశారది, బ్రహ్మ సూత్ర శాంకర భాష్యముపై భామతి అను నీతని వ్యాఖ్యలు మహత్త్వ పూర్ణములు. ద్వాదశ దర్శన కానన పంచానన అనే బిరుదు వాచస్పతి మిశ్రులకు కలదు. ఇతని సమయము 8, 9 శతాబ్దుల

మధ్య కాలము.

## విజ్ఞానభిక్షువు :

ఇతడు మహాదార్శనికుడు. సాంఖ్య యోగవేదాన్తముల యందు ఇతని పాండిత్యము పరాకాష్ఠనందినది. సాంఖ్య ప్రవచన సూత్రములపైన సాంఖ్య ప్రవచన భాష్యము, వ్యాస భాష్యముపైన యోగ వార్తికము బ్రహ్మసూత్రములకు విజ్ఞానామృత భాష్యమును వ్రాసినాడు. ఇవియేకాకుండా అనేక గ్రంథాలు వ్రాసినట్లు తెలియుచున్నది. ఇతడు 16వ శతాబ్ది మధ్య భాగమున నున్నట్లు ఐతిహాసికులు భావించుచున్నారు.

## భావగణేశుడు :

ఇతడు విజ్ఞానభిక్షువు యొక్క శిష్యుడు. తత్త్వ సమాసమునకు తత్త్వ యాథార్థ దీపనము అనువ్యాఖ్య కావించినాడు. ఇతని కాలము 16వ శతాబ్దము. వీరేకాకుండా మిషానందుని సాంఖ్య తత్త్వవివేచనము, మహాదేవుని సర్వోపకారిణి వ్యాఖ్యలు సాంఖ్య దర్శనముపై లభించుచున్నవి.

## అనిరుద్ధుడు :

ఇతడు సాంఖ్య షడధ్యాయిపై అని రుద్ధవృత్తి యను వ్యాఖ్య వ్రాసినాడు. ఇతని సమయము 17వ శతాబ్దము.

## మహాదేవుడు :

అనిరుద్ధవృత్తిని అనుసరించి సాంఖ్య షడధ్యాయిపై వృత్తిసారమనే వ్యాఖ్య వ్రాసినాడు. ఇతడు 16వ శతాబ్దమునకు చెందినవాడు.

# సాంఖ్యయోగముల సామ్యము

వేద కాలములో సాంఖ్య యోగములు ఒకేదర్శనముగా రూపొందినవి. సాంఖ్య యోగప్రవక్త కపిలుడు లేదా హిరణ్యగర్భుడు. సాంఖ్య యోగానికి చెందిన అనేకానేక తత్త్వాలు వేదకాలిక ఋషుల ద్వారా అభివ్యక్తమైనవి. కొంతకాలము గడచినపిదప సాంఖ్య యోగములు రెండూ విడిపోయినవి. సాంఖ్యములో 25 తత్త్వములు రూపొందింపబడినట్లే యోగములోనూ ప్రతిపాదింపబడివి. సాంఖ్యుల ప్రకృతి పురుష యోగమును యథాతథముగా యోగదర్శనము స్వీకరించినది. కాని యోగదర్శనము పురుషవిశేషమైన పరమ తత్త్వమును 26వ తత్త్వముగా పేర్కొనినది. ఈశ్వరునిగూర్చి తెలుపనందున సాంఖ్యము నిరీశ్వరవాదమైనది. ఈశ్వర తత్త్వమును ప్రత్యేకించి పేర్కొనుటవలన యోగము సేశ్వర సాంఖ్యముగా పరిగణింపబడుచున్నది. ఇవి రెండు 25 తత్త్వముల విషయములో ఐక్య కంఠమును వహించుచున్నవి. వాస్తవముగా కపిలుడు ప్రతిపాదించిన సాంఖ్యము నిరీశ్వరము కాదు. సాంఖ్యములో నిరీశ్వర వాదమును ప్రవేశపెట్టినవాడు ఈశ్వరకృష్ణుడు. అతనిద్వారా నిరీశ్వరవాదమును అంగీకరించిన సాంఖ్యుల పరంపర కొనసాగినది. భగవద్గీతా కాలమునాటికే సాంఖ్యయోగము ఒకే దర్శనముగా నున్నట్లు 'ఏకం సాంఖ్యం చ యోగం త యః పశ్యతి స పశ్యతి' 'సాంఖ్య యోగౌ పృథక్ బాలాః ప్రవదన్తి న పణ్డితాః' 'సాంఖ్య యోగేన తుల్యోహి ధర్మ ఏకాన్త సేవితః యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే' ఇత్యాది గీతా భాగవత వాక్య ప్రమాణములవలన తెలియుచున్నది. యోగదర్శనము సాంఖ్యమును పూరించు దర్శనము. 'ఆత్మ జ్ఞానస్య తత్త్వకాణ్డమ్ సాంఖ్యమ్, సాధనకాణ్డమ్ యోగః' అను మహాభారత వచనానుసారము సాంఖ్యము ఆత్మజ్ఞానాన్ని వెల్లడించే తత్త్వకాండం కాగా యోగం ఆ ఆత్మతత్త్వసిద్ధికి ఉపయోగపడే సాధనకాండంగా భావింపవచ్చును. సాంఖ్యము వివేచనాత్మకమయినచో, యోగము కర్మమార్గము. సాంఖ్యముకన్న యోగము క్రియపై ఆధారపడియుంటుంది. వివేకజ్ఞానము వలన దుఃఖత్రయ విముక్తి కలుగుచున్నదని సాంఖ్యము బోధించినప్పుడు యోగము చిత్తవృత్తి నిరోధమువలన అది చేకూరుతుందని తెలుపుతున్నది. వాస్తవముగా సాంఖ్యము ప్రతిపాదించిన ప్రకృతి పురుష వివేక ఖ్యాతిని వ్యావహారికముగా అనుభవస్థితిలోనికి

తీసికొని వచ్చిన ఘనత యోగదర్శనమునకు దక్కుచున్నది. అందువలన సాంఖ్యమునకు పూర్వము యోగము అనిభావించుటలో పొరపాటు లేదు.

## సాంఖ్యదర్శన ప్రాదుర్భావ వికాసములు :

సాంఖ్యయోగ దర్శనములకు చెందిన సిద్ధాంత విషయాలెన్నియో వైదిక కాలములోనే గోచరించుచున్నవి. ఈ దర్శనములకు చెందిన తత్త్వములను ప్రవచించిన మహర్షి కపిలుడు. ఇతనికే హిరణ్యగర్భుడను నామాంతరము గలదు. 'నాసదాసీన్నోసదాసీద్' ఇత్యాది మంత్రములలో సాంఖ్య తత్త్వము స్ఫురించుచున్నది. సాంఖ్యదర్శనమునకు చెందిన మొదటి గ్రంథము తత్త్వ సమాసము. సాంఖ్యసూత్రములు వికాస క్రమములో షష్టీతంత్రము అనే గ్రంథము సాంఖ్య సిద్ధాంతమును విస్తృతముగా నిరూపించుచున్నది. తరువాత సాంఖ్య కారిక పేర్కొన దగినది.

## కపిలుడు :

సాంఖ్యదర్శన ప్రవక్త కపిలుడు. ఈ మహర్షి వలననే మొట్టమొదట ఈ దర్శనం ఆవిర్భవించింది. శ్వేతాశ్వతరోపనిషత్తునందు 'ఋషి ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యేత్, తత్కారణం సాంఖ్య యోగాధిగమ్యం జ్ఞాత్వా లోకే హర్ష శోకా జహాతి' అను మంత్రము కపిల మహర్షి నామమును స్పష్టముగా నిర్దేశించినది. భగవద్గీత 'సిద్ధానాం కపిలో మునిః' అని కపిలుని సిద్ధమునిగా ఉగ్గడించినది. మహాభారతమువందు సాంఖ్యశాస్త్ర ప్రవృత్తి కపిల మహర్షి వలన కలిగినట్లు తెలుపుతూ యోగశాస్త్రప్రవక్తగా హిరణ్యగర్భుని కీర్తించినది. 'సాంఖ్యస్య వక్తా కపిలః పరమర్షిః స ఉచ్యతే, హిరణ్యగర్భో యోగస్య వేత్తా నాన్యః పురాతనః' అని తెలిపినది. శ్రీమద్భాగవతము 'కపి తత్త్వసంఖ్యాతా భగవాన్ ఆత్మమాయయా పంచమః కపిలో నామ సిద్ధేశః కాలవిప్లుతం, ప్రోవాచాసురయేసాంఖ్యమ్ తత్త్వగ్రామ వినిర్ణయం' ఇత్యాది రూపమున విష్ణుభగవానుని ఐదవ అవతారముగా కపిలుడు పేర్కొనబడినాడు. అతడు అసురి యను మహర్షికి కాలార్క భక్షితమైన సాంఖ్యమును తత్త్వవివేచన పూర్వకముగా ఉపదేశించినాడు అని తెలిపినది. పురాణేతిహాసములు కపిల మహర్షిని గురించి

అడుగడుగున ప్రస్తావించినవి.

కపిల నామమున వ్యవహరింపబడువారు ఎందరోనున్నట్లు పెద్దలు భావించుచున్నారు. వారిలో త్రేతాయుగమున నొకరు. మరొకరు ద్వాపరయుగమున. వేరొకరు కలియుగమున, గౌతమవంశమునందు జన్మించినట్లు, అతని పేరుతోనే కపిలవస్తునగరము రూపొందినట్లు, బౌద్ధవాఙ్మయము తెలుపుచున్నది. విదేశీయులు గౌతమ వంశ కపిలునికే సాంఖ్యకర్తృత్వమును అంటగట్టుచున్నారు. కాని ఇది నమ్మదగినదిగాదు. సాంఖ్య దర్శనము అతి ప్రాచీనము. విద్వాంసులు పేర్కొనిన కపిలత్రయములో బ్రహ్మ మానస పుత్రుడొకడు. ఆది జ్ఞాని. రెండవ ఋషి అగ్ని అవతారము. మూడవవాడు దేవహూతి కర్దమప్రజాపతుల పుత్రుడు. పై వ్యక్తులలో మూడవకపిలుడే సాంఖ్య దర్శనమును ప్రవర్తింపచేసినాడని సమాలోచకుల అభిప్రాయము. శ్రీమద్భాగవతము రెండవ స్కంధము 'ఏతన్మే జన్మ లోకేస్మిన్ ముముక్షూణాం దురాశయాత్ ప్రసంఖ్యానాయ తత్త్వానాం సమ్మతాయాత్మదర్శనే' అని వర్ణింపబడినది. సరస్వతీ నదీ తీరమున నున్న కర్దమ ప్రజాపతి తపోవనమునకు మరీచ్యాదులతోపాటు బ్రహ్మ వచ్చినట్లు కర్దమునితో ఆదిపురుషుడైన విష్ణుభగవానుడు తన మాయ ద్వారా ప్రాణులకు శుభము చేకూర్చుటకై కపిలదేహమును ధరించినాడని చెప్పినట్లు కలదు. మరియు ఆ బ్రహ్మ దేవహూతితో 'మనుపుత్రీ, నీ కడుపున విష్ణువు ఉదయిస్తున్నాడు, అతడు అవిద్యవలన కలిగే సంశయాలన్నింటినీ తొలగించి సాంఖ్యము లోకమున ప్రచారము చేయును. సిద్ధపురుషులకంటే శ్రేష్ఠుడై సాంఖ్యశాస్త్రప్రవచనముల ద్వారా సుప్రతిష్ఠితుడై కపిలనామమున ప్రసిద్ధి వహించును' అని చెప్పినట్లు కలదు. విజ్ఞానభిక్షువు సాంఖ్యవ్యాఖ్యాన సందర్భమున 'తదితం సాంఖ్యశాస్త్రం కపిలమూర్తిః భగవాన్ విష్ణుః అఖిలలోక హితాయ ప్రకాశితవాన్'. లోక క్షేమము కొరకు విష్ణుభగవానుడే కపిలరూపమున సాంఖ్యమును ప్రకాశింపచేసినాడని తెలిపినాడు. ఇదే సందర్భమున అగ్నిఅవతారమైన కపిలుడు సాంఖ్యమును రూపొందించినట్లు తెలిపే ఇతరుల వాదము నాతడు ఖండించినాడు. షడ్దర్శనములను వ్యాఖ్యానించిన శ్రీవాచస్పతిమిశ్రుడు- కపిల మహర్షియే సాంఖ్యదర్శనకర్త యని వెల్లడించినాడు. ఇతడు సాంఖ్యకౌముదియందు 69వ కారికను వివరిస్తూ అందలి పరమర్షిపదమునకు కపిలుడు అని అర్థము వ్రాసినాడు. అతడే 43వ

కారికవివరణలో 'యథా సర్గాదౌ ఆది విద్వాన్ భగవాన్ కపిలో మునిః ధర్మ జ్ఞానవైరాగ్యైశ్వర్య సంపన్నః ప్రాదుర్భూవేతి స్మరన్తి' అని ఉల్లేఖించినాడు. ఇందరు విద్వాంసులు ఇన్ని ప్రమాణములతో కపిల మహర్షి అస్తిత్వమును నిరూపించుచుండగా పాశ్చాత్య విద్వాంసులతోపాటు కొందరు ఆధునిక విద్వాంసులు కపిలమహర్షి చారిత్రక పురుషుడే కాదని వాదించుచునారు. వారి వాదము యుక్తిసహితము కాదు. 'ఆదివిద్వాన్ స్వయంభూః సర్గాదౌ ఆవిర్భూతః విష్ణుః నిర్మాణ చిత్తం యోగబలేన స్వనిర్మితం చిత్తం అధిష్ఠాయ సాంఖ్యేన ప్రవిశ్య కపిలాఖ్యం పరమర్షిః భూత్వా కారుణ్యాత్ జిజ్ఞాసవే ఆసురయే తత్త్వం ప్రోవాచ' అని వ్యాసభాష్యవార్తికటీక తెలుపుతున్నది. సృష్ట్యాది యందు కపిలుడు, నిర్వాణము పొందుటకు పూర్వము సిద్ధదేహమును కల్పించుకొని శిష్యుడైన ఆసురికి సాంఖ్యతత్త్వమును బోధించినట్లు పై వాక్యము తెలుపుచున్నది. మరియు కాళీపదభట్టాచార్యులు తన లేఖలో కపిలమహర్షి క్రీ.పూ. 700 లకు ముందే ఉండి యుండునని తెలిపినాడు. ఈశ్వర కృష్ణుడు వ్రాసిన 71 కారికలో వర్ణింపబడిన సాంఖ్యాచార్య శిష్యపరంపర గ్రహించినాడు. కపిలుడు మొదలుకొని ఈశ్వరకృష్ణుని వరకు లెక్కింపగా 25 మంది ఉన్నట్లు గణించి ఒక్కొక్కరి జీవితకాలము సగటున 30 సం.లని ఎంచి పై కాలమును నిర్ణయించినారు. కాని ఈ గణన సరియైనది కాదు. యుక్తిదీపిక యందు భట్టాచార్యులు పేర్కొన్న శిష్యపరంపరయేగాక మరొక 20 మంది పరంపర యున్నట్లు తెలియుచున్నది. అందువలన కపిల మహర్షి కాలము వేదకాలమువలె స్పష్టముగా నిర్దేశింపవీలులేదు. మరికొందరు శంకరాచార్యులుగాని, సాయణాచార్యులుగాని సాంఖ్యసూత్రములను తమ రచనలలో నిర్దేశింపనందున కపిలునిపేర నున్న సాంఖ్యసూత్రములు తరువాతి కాలమున ఏర్పడినట్లు పేర్కొంటున్నారు. కాని కొందరు ముందువారిపేరు ఉట్టంకింపబడనందున అవివారి తరువాత ఏర్పడియుండునని భావింపవీలు లేదు అని యందురు. అదిగాక సాయణాచార్యులు ఋగ్వేదభాష్యమునందు మాధవుని నామము తప్ప అంతకు పూర్వము వేదమునకు భాష్యము వ్రాసిన స్కందస్వామి, నారాయణ ఉద్గీథ, భట్టభాస్కరాదులను ఉగ్గడింప లేదు. అంతమాత్రమున సాయణాచార్యులకు వారు తరువాతి వారని పేర్కొందుమా? మరికొందరు 'నవయం షట్పదార్థివాదినో వైశేషికాదివత్'

'షోడశకాదిష్వ ... ' అను సాంఖ్యసూత్రములలో కణాది గౌతమ తత్త్వ ములను నిర్దేశించుటవలన సాంఖ్యసూత్రమును న్యాయవైశేషికముల పిదప ఏర్పడినట్లును తెలుపుచున్నారు. కాని ఆదిమహర్షి కపిలుడు ప్రవచించిన సాంఖ్యసూత్రములు నేడు యథాతథముగా లభించుటలేదు. సూత్రముల క్రమము గూడ వ్యత్యస్తముగా గోచరించుచున్నది. ఎన్నో లుప్తమైనవి. ఎన్నో తరువాతివారు చేర్చినారు. పూర్వపక్ష సూత్రములు సిద్ధాంతసూత్ర ములుగా, సిద్ధాంత రూపములు పూర్వపక్ష సూత్రములుగా కలగాపులగము చేసినారు. ఈ విషయము డా. ఉదయవీరశాస్త్రిగారు తమ సాంఖ్యేతిహాస గ్రంథములో సప్రమాణముగా నిరూపించినారు. ఈశ్వరకృష్ణుడు 'సప్తత్యాఞ్కి లయేzర్థాః తేzర్థాః కృత్స్నస్య షష్టీతన్త్రస్య ఆఖ్యాయికా విరహితాః పరవాద వివర్జితాశ్చ' అను 72వ కారికలో కారికాసప్తతిలో నిర్దేశించిన సమస్త పదార్థములు షష్టీతన్త్రములోనివే. కాని షష్టీ తంత్రములోని ఆఖ్యాయికలు ఏకవాద ఖండముకు ఇందు చూపలేదు అని స్పష్టముగా తెలిపినాడు. షష్టీ తంత్రము అనునది కపిల కృతము. ఈశ్వరకృష్ణుడే షష్టీ తంత్రమును పేర్కొనుచుండ, షష్టీతంత్రము లేదా సాంఖ్యదర్శనము అర్వాచీనమని తరువాతివారు వాదించుట విడ్డూరము. దీనివలన కపిల మహర్షి తత్త్వస మాసము సాంఖ్యసూత్రములు అను రెంటిని వ్రాసినాడనీ, అతడే ఆసురికి సాంఖ్య తత్త్వము నుపదేశించిననాడని భావించుటలో పొరపాటు లేదు.

## సాంఖ్య సూత్రములు :

దర్శన సాహిత్యేతిహాసము ప్రకారము సాంఖ్యశాస్త్రమునకు ఆది ప్రవక్త కపిల మహర్షి. ఇతడు సాంఖ్య తత్త్వమును వెల్లడించుటకై సూత్రములను రచించినాడు. ఆ సూత్రములు రెండు విధముల కలవు 1. సంక్షిప్తము 2. వివరణము. సంక్షిప్త సూత్రములను తత్త్వ సమాసములని, విస్తృత సంకలనములను సాంఖ్య ప్రవచన సూత్రములని వ్యవహరించుచున్నారు.

## తత్త్వ సమాస సూత్రము :

దీనిలో సూత్రముల సంఖ్య 22 కలవు. 1. అష్టౌప్రకృతయః 2. షోడశవికారాః 3. పురుషః 4. త్రైగుణ్య సంచరః 5. ప్రతిసంచరః 6.

అధిభూతం 7. అధ్యాత్మం 8. అధిదైవం 9. పంచాభివృద్ధయః 10. పంచకర్మయోనయః 11. పంచావయవాః 12. పంచకర్మాత్మానః 13. పరమవిద్యావిద్యా 14. అష్టావింశతిధాశక్తిః 15. నవధాతుష్టిః 16. అష్టధా సిద్ధి 17. దశమూలికార్థాః 18. అనుగ్రహసర్గః 19. చతుర్దశవిధోభూత సర్గః 20. త్రివిధోబంధః 21. త్రివిధోమోక్షః 22. త్రివిధం ప్రమాణం తత్త్వసమాసమునకు పంచశిఖాచార్యులు భాష్యము వ్రాసినట్లు త్రివిధం మోక్షం క్రమేణ ఆహ తత్త్వసమాసాఖ్య భాష్యే పంచశిఖాచార్యః అని బ్రహ్మసూత్రములపై విజ్ఞానభిక్షువు వ్రాసిన వ్యాఖ్య తెలుపుచున్నది. 'సమాస సూత్రమాలక్ష్య వ్యాఖ్యా పంచశిఖస్య చ' అనియు మారరవృత్తియు తెలుపు చున్నది. దేవలుడు కూడా 'షోడశవికారాః దశమూలికార్థాః త్రివిధో బంధః' అని తత్త్వసమాసములోని సూత్రములను యథాతథముగ ఉద్ధరించినాడు. దీనివలన తత్త్వసమాసము వార్షగణ్యకృతం కాదని తేలినది. ఎందుకనగా వార్షగణ్యుని కన్న పూర్వుడు దేవలుడు కావున.

## సాంఖ్య ప్రవచన సూత్రములు :

ఇది బృహత్ సూత్ర సంకలన గ్రంథము. ఇందు 6 (ఆరు) అధ్యాయములుండుట వలన షడధ్యాయి అని షష్టితంత్రమని, కపిలదర్శనమని వ్యవహరింపబడుచున్నది. ఈ విషయమునే ఈశ్వరకృష్ణుని 'సప్తత్యాంకిలయే + అర్థాః' అనే 72 వ కారిక ఋజువుపరచుచున్నది. సాంఖ్యసూత్రములపై వృత్తిని వ్రాసిన అనిరుద్ధుడు 'అతికారుణికో మహామునిః జగదుద్దిధీర్షుః కపిలో మోక్షశాస్త్రమారభమాణః ప్రథమం సూత్రం చకార' అని ప్రారంభించి నాడు. సాంఖ్య ప్రవచన భాష్య ప్రారంభములో విజ్ఞానభిక్షువు 'శ్రుత్యవిరోధినీః + ఉపపత్తీః షడధ్యాయీ రూపేణ వివేక శాస్త్రేణ కపిలమూర్తిః భగవాన్ ఉవదిదేశ' అని భాష్యోపసంహారమున, 'తదిదం సాంఖ్యశాస్త్రం కపిలమూర్తిః భగవాన్ విష్ణుః అఖిలలోకహితాయ ప్రకాశితవాన్' అని కపిలకర్తృకత్వమును స్పష్టపరచినాడు. 6వ శతాబ్దికి చెందిన న్యాయవార్తికకర్త ఉద్యోతకరుడును సాంఖ్య సూత్రములను ఉద్ధరించినాడు. వాత్స్యాయనుడు కూడా సాంఖ్య సూత్రములను పరిగ్రహించినాడు. దీనివలన తత్త్వసమాసము, షడధ్యాయి అను గ్రంథములు కపిలకృతములని వాటిని అర్వాచీనులు వ్రాయలేదు అని

సుస్పష్టమగుచున్నది. కాని సర్వదర్శన సంగ్రహకర్త ఏ కారణముననో ఈ సూత్రములను గ్రహించక పోవుట, ఈశ్వర కృష్ణుని కారికలను ప్రమాణము గ్రైకొనుట ఆశ్చర్యమును కలిగించుచున్నది.

## షష్ఠీతంత్రము :

కపిలమహర్షి వ్రాసిన షష్ఠీతంత్రమునందు రెండు భాగములు కలవు. మొదటి భాగము ప్రాకృతము రెండవ భాగము వైకృతము. ప్రాకృత మండలములో 32 అధ్యాయములు కలవు. ఇవి తంత్రములను పేర పేర్కొనబడుచున్నవి. వైకృతమండలములో ఇరువది ఎనిమిది (28) అధ్యాయములున్నవి. వీటికి కాండమని వ్యవహారము. ప్రాకృతమండలము సాంఖ్య తత్త్వమును నిరూపింపగా, వైకృతము యోగతత్త్వమును నిరూపించుచున్నది. సాంఖ్యయోగములు ఒకటేనని తత్కర్త కపిల మహర్షి యని లోగా తెల్పబడినది. షష్ఠీతంత్రము అదే విషయమును బలపరచుచున్నది.

సర్వదర్శన సంగ్రహకర్త ఈశ్వరకృష్ణుని కారికలను ప్రమాణముగా తీసికొని సాంఖ్యతత్త్వమును ప్రదర్శించినాడు. సర్వదర్శన సంగ్రహమునందు సుమారు 14 కారికలు గ్రహింపబడినవి. 'అభిమానోహంకారః తస్మాత్ ద్వివిధః ప్రవర్తతే సర్గః ఏకాదశ కరణగణః, తన్మాత్రపంచకంచైవ' –24।

సాత్త్విక ఏకాదశకః ప్రవర్తతే వైకృతాదహంకారాత్ - భూతాదేస్తన్మాత్రః అసతామసః తైజసాదుభయం -- 25

బుద్ధీన్ద్రియాణి చక్షుశ్శ్రోత్రఘ్రాణరసత్వగాఖ్యాని, వాక్పాణిపాద పాయూపస్థాః కర్మేంద్రియాణ్యాహుః – 26

ఉభయాత్మక మత్రమనః - సంకల్పక మిన్ద్రియంచ - సాధర్మ్యాత్ – 27

ప్రకృతేర్మహాన్ తతోహంకారః తస్మాద్గణశ్చషోడశకః తస్మాదపి షోడశకా, పంచభ్యః పంచభూతాని - 22

దృష్ట మనుమాన మాప్తవచనం చ సర్వప్రమాణసిద్ధ త్వాత్, త్రివిధం ప్రమాణమిష్టం ప్రమేయ సిద్ధిః ప్రమాణాద్ధి - 4

(అసత్వాన్నాస్తి సంబంధః కారణైస్సత్త్వసంగిభిః, అసంబద్ధస్యచోత్పత్తిం, ఇచ్ఛతో న వ్యవస్థితిః) అనుకారిక సాంఖ్యాచార్యులు తెలిపినట్లు చూపించి నారు. కాని ఆ సాంఖ్యాచార్యులపేరు తెలుపబడలేదు.

'అసదకరణాత్ ఉపాదాన గ్రహణాత్ సర్వసంభవాద్ శక్తస్య శక్యకర ణాత్ కారణాభావాచ్చ సత్కార్యమ్' - 9. వత్స వివృద్ధి నిమిత్తం క్షీరస్య యథా ప్రవృతిరజ్ఞస్య పురుషవిమోక్ష నిమిత్తం తథా ప్రవృతిః ప్రధాస్యాత్ -57. పురుషస్య దర్శనార్ధం కైవల్యార్థం తథా ప్రధానస్య పఙ్గ్వన్ధవదుభ యోరపి సంబంధః తత్కృతస్సర్గః - 21. రఙ్గస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథా నృత్యాత్ పురుషస్య తథాత్మానం ప్రకాశ్య వినివర్తతే ప్రకృతిః -59. మరియు 'ఖండశః మూలప్రకృతిరవికృతిః - మహదాద్యా ప్రకృతి వికృతయస్సప్త షోడశకస్తు వికారః, న ప్రకృతి ర్నవికృతిర్పురుషః' అని కారికా వాక్యములను గ్రహించినాడు.

సాంఖ్యదర్శన ప్రారంభమున 'అథ సాంఖ్యైరాఖ్యాతే పరిణామవాదే పరి పంథిని జాగరూకే కథంకార వివర్తవాదః ఆదరణీయో భవేత్' సాంఖ్యులు పేర్కొన్న పరిణామవాదము ప్రధాన ప్రతిపక్షముగా నిలిచియుండ వివర్త వాదా నికి పురస్కారము ఎట్లు సంభవించు చున్నది అని సర్వదర్శనసంగ్రహకర్త ఉల్లేఖించి పిదప సంక్షేపముగా సాంఖ్యతత్త్వ నిరూపణ ఇట్లు గావించినాడు.

సాంఖ్యదర్శనమందు పదార్థములు నాలుగు విధములున్నవి. 1. ప్రకృతి 2. వికృతి ప్రకృతి 3. వికృతి 4. అనుభయము. ఈ విషయము సాంఖ్యకా రిక 'మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతితయస్సప్త షోడశకస్తు వికారో న ప్రకృతిః న వికృతిః పురుషః' అను 3వ కారిక వెల్లడించుచున్నది. మహదాదులకు మూలమై తాను మరొక దానికి వికృతి కాకుండా ఉండే ప్రధానతత్త్వం మూలప్రకృతి అనబడుతుంది. ఇక ప్రకృతి వికృతులైనవి 7 తత్త్వములు కలవు. అవి మహత్తు, అహంకారము, శబ్ద, రూప, రస, స్పర్శ, గంధములనే పంచతన్మాత్రలు. ఇవి ప్రకృతులుగా వికృతులుగా ఉన్నవి.

మూలప్రకృతి నుండి బుద్ధికలుగుచున్నది. కావున ప్రకృత్యపేక్షయా బుద్ధి లేదా మహత్తు (వికారమగుచు) వికృతి యగుచు అహంకారమును కలిగించుటవలన, అహంకారమునకు బుద్ధి ప్రకృతి యగుచున్నది. బుద్ధితత్త్వము వలన ఏర్పడిన అహంకారము, బుద్ధికి వికృతి యగుచు పంచతన్మాత్రలు కలిగించుట వలన పంచతన్మాత్రలకు అహంకారము ప్రకృతి యగుచున్నది. శబ్దతన్మాత్రలు అహంకారము వలన ఏర్పడుటచే వికృతియై ఆకాశోత్పత్తికి కారణమగుటచే ఆకాశమునకు ప్రకృతి యగుచున్నది. అహంకారము వలన పుట్టిన స్పర్శ తన్మాత్ర అహంకారమునకు వికృతియగుచు వాయుభూతోత్పత్తికి హేతువగుట వలన వాయువునకు ప్రకృతియగుచున్నది. అహంకారోత్పన్నమైన గంధతన్మాత్రము అహంకారమునకు వికృతియగుచు పృథివ్యుత్పాదకమగుటచే పృథివికి ప్రకృతియగుచున్నది. అహంకారసంభవమైన రూపతన్మాత్రము అహంకారవికృతి యగుచు, తేజస్సర్జకమగుటచే, తేజస్సునకు ప్రకృతి యగుచున్నది. అహంకారనిష్పన్నమైన రసతన్మాత్రము అహంకారవికృతియై జలోత్పాదకమగుటచే జలమునకు ప్రకృతి యగుచున్నది. అందు వలన మహదాది సప్తకము ఒక పదార్థమునకు ప్రకృతి, మరొక పదార్థమునకు వికృతి అయినందువలన ప్రకృతి వికృతులుగా పేర్కొనబడినవి.

ఇక 'షోడశకస్తు వికారః' - పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు ఉభయాత్మకమైన మనస్సు అను 11 ఇన్ద్రియములు, పృథివ్యాది పంచభూతములు కలసి షోడశతత్త్వములు వికృతులుగానే ఉండును. ఇవి వేటికిని ప్రకృతులు కావు. మిగిలిన 25వ పురుషతత్త్వము దేనికి ప్రకృతి కాదు. వికృతి కాదు. కూటస్థముగానుండును. ఇవి సాంఖ్యులు చెప్పే 25 తత్త్వముల విభాగము ఈశ్వరకృష్ణకారిక వలన తెలుపబడినది. దీనినే విద్యారణ్యస్వామివారు స్వీకరించినారు. 25 తత్త్వములను కొందరు 3 విధాల విభజించినారు. 1. వ్యక్తము 2. అవ్యక్తము 3. జ్ఞము. మహత్తత్త్వము నుండి 5 భూతములవరకు ఉండే 23 తత్త్వములు వ్యక్తములని, సూక్ష్మరూపముగా ఉండే ప్రధానతత్త్వము లేదా ప్రకృతి అవ్యక్తము అని పురుషుడు జ్ఞము అని విభాగము తెలుపుచున్నది. తత్త్వసమాసములో 25 తత్త్వములు మరొక విధముగా విభజింపబడినవి. అందు 8 ప్రకృతులు. వీటిలో మూలప్రకృతి మొదలుకొని బుద్ధ్యాది సప్తకము గ్రహింపబడినది. రెండవది

షోడశవికృతులు. (16 వికారములు). ఈ విభాగములో జ్ఞాన కర్మేంద్రియములు మన ఇంద్రియము 5 మహాభూతములు చేరుచున్నవి. పురుషుడు, ప్రకృతి వికృతులకు భిన్నుడై ఉండువాడు.

## సాంఖ్యమునందు ప్రకృతి

సాంఖ్యకారికా కర్తయైన ఈశ్వరకృష్ణుడు వ్యక్తావ్యక్త సాధర్మ్య వైధర్మ్యములను ప్రకృతి వైధర్మ్యములను తెలుపుచు ప్రకృతిని ఈ క్రింది కారికలద్వారా నిరూపించినాడు.

'హేతుమదనిత్య మవ్యాపి సక్రియమనేకమాశ్రితం లిఙ్గమ్, సావయవం, పరతన్త్రం, వ్యక్తమ్. విపరీతమవ్యక్తమ్.' 'త్రిగుణ మవివేకివిషయః సామాన్యచేతనం ప్రసవధర్మి వ్యక్తం తథా, తద్విపరీతస్తథా పుమాంసః'. మహత్తు మొదలుకొని పంచభూతముల వరకు ఉండే 26 తత్త్వములు ఇన్ద్రియ గోచరము అగుటవలన వ్యక్తము అనబడచున్నవి. వ్యక్తము లన్నింటికి ఉపాదానకారణము ప్రకృతి లేదా అవ్యక్తము. అవ్యక్తము హేతువైనందున వ్యక్తము హేతుమంతము లనబడుచున్నవి. ఎట్లులనగా ప్రకృతివలన మహత్తు పుట్టుచున్నది. ప్రకృతి హేతువైనందున మహత్తు హేతుమంతమగుచున్నది. బుద్ధియనే మహత్తువలన అహంకారమేర్పడుటవలన బుద్ధి హేతువు అయి అహంకారము హేతుమంతమగుచున్నది. ఇట్లే మిగిలినవి గ్రాహ్యములు.

కార్యమైన వస్తువు అనిత్యమగుచున్నది. ఒక దానినుండి పుట్టే వస్తువు కార్యమనబడుచున్నది. మృత్తునుండి ఘటము పుట్టుచున్నది. కావున ఘటము కార్యమగుచున్నది. ఏది కార్యమో అది అనిత్యము. ఘటాదికార్యములు నశించునవి. కావున అనిత్యములు. వాటికి ఉపాదాన కారణము మృత్పిండము - నిత్యము. అదే విధముగా వ్యక్తములన్నియు కార్యములైనందున అనిత్యములని వీటికి ఉపాదానకారణమైన అవ్యక్తప్రకృతి నిత్యమని గ్రహింపవలయును. వ్యక్తము అవ్యాపి. అనగా సర్వగతము కాదు. అవ్యక్తమైన ప్రకృతి కార్యజాతమంతటా వ్యాపించి ఉంటుంది. ఆభరణాదులలో స్వర్ణము, ఘటాదులలో మృత్తిక వ్యాపించినటుల మహదాది వ్యక్తములలో అవ్యక్తము వ్యాపించి ఉంటుంది. కావున వ్యక్త మనిత్యమైతే అవ్యక్తము నిత్యమౌతుంది. వ్యక్తములు సక్రియలు. అనగా జనన మరణాది సంస

రణ క్రియలు వ్యక్తములో ఉండును. అవ్యక్తమునకు ఇట్టి సంసరణలేదు. వ్యక్తమనేకము. అనగా మహత్తునుండి పంచభూతముల వరకు 23 రూప ములలో నుండునది. కాని అవ్యక్తమేక విధము. వ్యక్తము ఆశ్రితము. అనగా బుద్ధ్యాదులు తమ కారణములైనవాటిని ఆశ్రయించి ఉండునవి. బుద్ధి ప్రధానమును ఆశ్రయించగా, బుద్ధిని అహంకారము, అహంకారమును పంచతన్మాత్రలతోపాటు 11 ఇన్ద్రియములు, పంచతన్మాత్రలను పంచమహా భూతములు ఆశ్రయించియుండును. కాని అవ్యక్తము దేనిని ఆశ్రయింపదు. అవ్యక్తమునే ఇతరములు ఆశ్రయించునని తాత్పర్యము. వ్యక్తము లింగము. లిఙ్గపదమునకు లయమును పొందునది లేదా మరొక దానిలో లీనమగుచున్నది యని అర్థము. అనగా పంచమహాభూతములు తన్మాత్రలలో, తన్మాత్రలు ఏకాదశేంద్రియములతోపాటు అహంకారములో, అహంకారము బుద్ధిలో, బుద్ధి లేదా మహత్తు ప్రధానము లేదా అవ్యక్తములో లీనమగుచున్నది. అవ్యక్తము మరియొకదానిలో లీనము కాదు. తనలోనే 23టిని లీనము చేసుకొనుచున్నది. వ్యక్తము సావయవము. అనగా శబ్ద స్పర్శ రూప రస గంధాదులు అవయవ విభాగము వ్యక్తములో నున్నది. అవ్యక్తమునకు ఈ విభాగము లేదు. వ్యక్తమంతయు పరాధీనము. బుద్ధి ప్రధానపరతంత్రము కాగా బుద్ధితంత్రము అహంకారము. అహంకారపరాధీనములు తన్మాత్రేంద్రియములు అహంకారప రాధీనములు. పంచమహాభూతములు పంచతన్మాత్రాధీనములు. అందువలన వ్యక్తమంతయు పరాధీనమని, అనగా అవ్యక్తము యొక్క చెప్పుచేతలలో నుండునది వ్యక్తమని, అవ్యక్తమును నడుపించునది మరియొకటి లేదని తాత్పర్యము. ఈ కారికలో వ్యక్తావ్యక్తములకుగల వైధర్మ్యము చెప్పబడినది.

2వ కారికలో వ్యక్తావ్యక్తములకున్న సాధర్మ్యము తెలుపబడుచున్నది. వ్యక్తావ్యక్తములు రెండును త్రిగుణమైనవి. అనగా సత్త్వరజస్తమోగుణములు అవ్యక్తములో నున్నట్లు వ్యక్తములోను ఉండును. ఇవి రెండును అవివే కులు. అవివేకి పదమునకు విడదీయరానిదని అర్థము. సత్త్వరజస్తమోగుణ ములనుండి అవ్యక్తము విడదీయరాని విధమున, వ్యక్తమును విడదీయలేదు. అనగా సత్త్వాది గుణత్రయమే అవ్యక్తమయినట్టు వ్యక్తమూ అవుచున్నది. వ్యక్తావ్యక్తములు రెండునూ విషయములే. విషయ పదమునకు భోగ్యములని అర్థము. అవ్యక్తము సర్వపురుషభోగ్యమైనట్లే, వ్యక్తము సర్వపురుషభోగ్యమ

వుచున్నది. కావున వ్యక్తావ్యక్తములు రెండును సామాన్య మనబడుచున్నవి. సామాన్య పదమునకు సర్వసాధారణమని అర్థము. వ్యక్తావ్యక్తములు రెండునూ అచేతనములు. రెండునూ ప్రసవ ధర్మము గలవి. ప్రసవధర్మపదము నకు పరిణమించునదని అర్థము. అవ్యక్తమునుండి మహత్తు, మహత్తునుండి అహంకారము, అహంకారము నుండి పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియములు, పంచతన్మాత్రల నుండి పంచమహాభూతములు ప్రసూతములగుచున్నవి. కావున వ్యక్తావ్యక్తములు రెండును ప్రసవ ధర్మోపేతములని గ్రహింపవలెను. ఈ విధముగా వ్యక్తావ్యక్తములకుగల సాధర్మ్యవైధర్మ్యములు తెలుపబడినవి. పురుషుడు ఈ రెంటికిని అతీతుడైన వాడని గ్రహింపవలయును.

ప్రకృతి తత్త్వము సిద్ధించుటకు ఈశ్వరకృష్ణుడు 'భేదానాం పరిమాణాత్ సమన్వయత్ శక్తితః ప్రవృత్తేశ్చ కారణ కార్య విభాగాత్ అవిభాగాత్ వైశ్వరూపస్య కారణమస్త్యవ్యక్తమ్' అను కారికలో 5 హేతువులను చూపినాడు.

1. భేదానాం పరిమాణాత్ : మహదాది కార్యములకు ఏదో ఒక కారణము ఉంటుంది. కారణము లేకుండా కార్యము కలుగదు. కుమ్మరి పరిమితమైన మృత్పిండముతో పరిమితముగా ఘటాది నిర్మాణము చేయుచు న్నాడు. మహదాది వస్తుజాతమునకు ఏదో ఒక కారణము కలిగి తీరవలయును. మహదాదులకు కారణమున్నట్లే ఆ కారణమునకు మరియొకటి చొప్పున కల్పించుకొనిపోయినచో కారణకల్పనలో విశ్రాంతి యుండదు. అనవస్థాదోషము వచ్చుచున్నది. ఏదో ఒకటి మూలకారణమును అంగీకరింపవలసి వచ్చును. ఆ చిట్టచివరి కారణమే ప్రకృతి అనబడుచున్నది. కావున భేదపరిమాణ మువలన ప్రకృతి ఒకటియున్నదని తేలినది.

2. సమన్వయాత్ : కార్యకారణములయందు ఏదో ఒక సామాన్య ధర్మము ఉంటుంది. మహదాదులు పరస్పర భిన్నముగనున్నను వాటిలో సుఖదుఃఖమోహాత్మక సామ్యము కలదు. కార్యములైన మహదాదులలో సుఖదుఃఖమోహాది ధర్మములున్నట్లు వాటికి కారణమైనదానిలోనూ ఆ ధర్మములు ఉండి తీరును. కారణగుణములు కార్యమునందు సంక్రమించుట స్వభావసిద్ధము. మహదాది కార్యములలో మోహాది ధర్మములు కలవు. ఇవే ధర్మములు మహదాదులకు కారణమైనదానిలోనూ ఉండునుకదా. ఆ

సామ్యమును బట్టియు వాటికి కారణమైన ప్రకృతి సిద్ధించుచున్నది.

3. శక్తితః ప్రవృత్తేశ్చ : కార్యపరిణామము కారణ శక్తి వలన చేకూరుచున్నది. కారణములో ఉండే ఏ కార్యమునుత్పత్తి చేసే శక్తినిబట్టి ఆ కార్యము కలుగుచున్నది. ఘటోత్పాదనశక్తి మృత్తికలో నున్నందువలననే మృత్తికనుండి ఘటము ఏర్పడుచున్నది. కాని పటము ఉత్పన్నమగుటలేదు. తైలోత్పాదన శక్తి తిలలో నున్నందున తిలల నుండి తైలము స్రవించుచున్నది. కాని ఇసుకనుండి లభించుటలేదు. అదే విధముగా మహదాది కార్యములను ఆవిర్భవింపచేసే శక్తి వాటికి కారణమైన అవ్యక్తములోనే సిద్ధించి యుండును. దీనివలన ప్రకృతి యున్నదని తేలినది.

4. కారణకార్య విభాగాత్ : ఏది ఉత్పత్తికి మూలమగుచున్నదో అది కారణము. ఏది ఉత్పన్నమగుచున్నదో అది కార్యము. మధు జల క్షీరాదులను భరించుటకు ఆధారమైన ఘటాది పదార్థములకు మృత్తికయే కారణము కదా. మృత్తిక నుండి ఘటాదులు ఏర్పడుచున్నవి. అవి భిన్నమై మృత్తికలోనే తిరోహితమగుచున్నవి. మహదాది కార్యములు తమ తమ కారణముల నుండి ఆవిర్భవిల్లుచు తమ తమ కారణములలోనే తిరోహితమైనందున వాటి ఆవిర్భావ తిరోభావములకు మూలమైనదేదో ఒక కారణము ఉండవలసి వచ్చును. ఆ ఉండవలసిన కారణము ప్రకృతిగాక మరేమగుచున్నది?

5. అవిభాగాత్ వైశ్వరూపస్య : కార్యము నష్టమైన కారణములోనే విలీనమగుచున్నది. మహదాది కార్యప్రాదుర్భావమునకు అవ్యక్తము కారణమైనట్లే తిరోభావమునకును అదే ప్రకృతి కారణమగుచున్నది. దీనివలన ప్రకృతి అస్తిత్వము అంగీకరింపక తప్పదు.

అనగా కార్యమును బట్టి కారణమును అనుమానించుచున్నాము. ఘటమును బట్టి మట్టిని, పటమును బట్టి తంతువులను అనుమానించినట్లే మహదాది కార్యము త్రిగుణాత్మకము. వాటికి కారణముగూడ త్రిగుణాత్మకమై యుండును. త్రిగుణాత్మకంగాయుండేది ప్రకృతే కావున ప్రకృతి నుండే మహదాది కార్యము సిద్ధించుచున్నది. ఈ రెండు కారికలద్వారా 23 తత్త్వములకు (వ్యక్త తత్త్వములకు) ప్రధానకారణము ప్రకృతి యని తేలినది.

## గుణత్రయము :

సాంఖ్యదర్శనములో సత్త్వరజస్తమస్సు లనునవి మూడు గుణములు. ప్రకృతి త్రిగుణాత్మకమగుట వలన ముప్పేటలతాడే ప్రకృతి స్వరూపమని తెలియనగును. పురుషుని బంధించుటకు త్రాళ్ళవలె నివి ఉపకరించుచున్నవి. ప్రకృతిలోనున్న 3 గుణాలు పురుషుని బంధించు చున్నవని వీటికి గుణమన్న పేరు యేర్పడినదని, సాంఖ్యాచార్యులు తెలిపినారు. ప్రకృతిలో గుణత్రయము అవికసితంగా యనుద్బుద్ధముగా నుండును. మహదాది వ్యక్తములలో ఇవి ఉద్బుద్ధములగును. 'గుణానాం పరమంరూపం న దృష్టిపథ మృచ్ఛతి'. అవ్య క్తములోని గుణత్రయము అతీంద్రియము. మహదాది కార్యస్థితిని బట్టి అవి అనుమేయమగునని యోగసూత్ర వ్యాసభాష్యమున తెలుపబడినది. 'సత్త్వం లఘు ప్రకాశక మిష్టముపష్టంభకం చలం చ రజః గురు వరణకమేవ తమః ప్రదీపవచార్థతో వృత్తిః'.

## సత్త్వాది గుణముల స్వరూపము :

'ప్రీతి అప్రీతి విషాదాత్మకాః ప్రకాశ ప్రవృత్తి నియమార్థాః, అన్యోన్యాఽభిభవాఽశ్రయ జనన మిథున వృత్తయశ్చ గుణాః'. ఈ కారికలో 3 గుణముల స్వరూపము నిరూపింపబడినది. ప్రీత్యాత్మకము సత్త్వగు ణము. ప్రీతి అనగా సుఖము. అప్రీత్యాత్మకము రజోగుణము. అప్రీతి అనగా దుఃఖము. విషాదాత్మకము తమోగుణము. విషాదమనగా మోహము. ప్రకా శసమర్థము సత్త్వగుణము. ప్రవృత్తి సమర్థము రజోగుణము. స్థితి సమర్థము తమోగుణము. అనగా సత్త్వము ప్రకాశమును, రజస్సు క్రియను, తమస్సు స్థితిని కలిగించు స్వభావము కలవి. ఇవి పరస్పరము అభిభవించుచు, ఆశ్ర యించుచు, పరస్పరము ఉత్పాదకము లగుచుండును. అనగా సత్త్వగుణము ఉత్కటమైనచో రజస్సు, తమస్సులు అభిభూతములగునని ప్రీతి ప్రకాశరూ పమున సత్త్వగుణము నిలద్రొక్కుకొనును. రజోగుణము ఉత్కటమైనప్పుడు సత్త్వ తమస్సులు అభిభూతములగునని దుఃఖప్రవృత్తుల రూపమున రజో గుణము నిలబడునని, తమోగుణము ఉత్కటమైనప్పుడు సత్త్వ రజస్సులు అభిభూతములగునని అది విషాదస్థితి రూపమున నిలిచియుండునని గ్రహిం పవలయును. ఒకవైపు పరస్పరాభిభూతములగుచునే అన్యోన్యాశ్రయములై

అన్యోన్యజనకములుగా నుండునని తాత్పర్యము. సత్త్వగుణము తేలికగా ఉంటుంది. రజోగుణము చంచలంగా ఉత్తేజకంగా క్రియాత్మకంగా దుఃఖ రూపంగా ఉంటుంది. ఇది ప్రతిపదార్థములోనూ గతిశీలముగా ఉండును. తమోగుణము గురువుగా, (బరువుగా), అవరోధకముగా, మోహాత్మకముగా ఉంటుంది. గతిని బాధించుచున్నది. తమోగుణస్వరూపమైన మోహము విషాదాన్ని అజ్ఞానాన్ని కలిగించుచున్నది. విషాదమువలన ఆలస్య నిద్రా తంద్రా మూర్ఛా ఉత్సాహరాహిత్యము లేర్పడుచున్నవి. సత్త్వగుణమును నిరోధించుచూ రజోగుణప్రవృత్తిని కలిగించుచున్నది. ఇట్లయ్యును ఒక దానికొకటి ఆధారముగా స్త్రీ పురుషులవలె కలసి సంసారమును కొనసాగించుచున్నవి. సత్త్వగుణము చిత్తమునకు శాంతిని, సుఖమును, చైతన్యస్ఫూర్తిని ఏర్పరచుచున్నది. రజోగుణస్వభావము ఉత్తేజముగా, దుఃఖాత్మకముగా ఉన్నందున చిత్తమునకు చాంచల్యమును అపాదించుచు సంక్షోభములను సృష్టించుచున్నది. తమోగుణము గురువై మోహాత్మకంగా ఉన్నందున చిత్తమునందు అజ్ఞానావరణాన్ని కల్పిస్తూ కామక్రోధలోభమోహాది భావములను ఉప్పతిల్ల జేస్తుంది. ఈ గుణములు నిత్యపరిణామశీలకములు. ఒక్కొక్కప్పుడు తమ స్వరూపాలనే మార్చుచుండును. స్వరూప వైషమ్యము ఏర్పడినప్పుడు సంసారప్రాదుర్భావము, సారూప్యమేర్పడినప్పుడు ప్రళయము కల్గుచున్నది. వాస్తవముగా సత్త్వ, తమో గుణములలో క్రియాప్రవృత్తి లేదు. రజోగుణము కలసినప్పుడే అవి రెండు క్రియాప్రవృత్తము లగుచుండును. రజోగుణ సహకారము లేకుండా అవి రెండు కార్యోన్ముఖములు కావని తేలినవి. ఇవి మూడును ఒకదానినొకటి విడిచి ఉండలేవు. ఇవి మూడు కలిసియే ఉండును. కలిసియే పనిచేయును. అభిభూతము ఐనప్పుడు ఏ గుణము అభిభవించుచున్నదో దాని స్వరూపము అధికముగా వికసించుచున్నది. అనగా సత్త్వగుణము ఇతర గుణములను అభిభవించినపుడు కార్యాభిరుచు కలుగుచున్నది. అనగా సత్త్వగుణము వలన కార్యవిషయక జ్ఞానము, రజోగుణము వలన కార్యములను నిర్వహింపవలయునను ప్రవృత్తి కలుగుచున్నది. తమోగుణము అభిభవించినపుడు కార్యవిషయక జ్ఞానము తద్విషయక ప్రవృత్తియు కుంఠితములగు చున్నవి. పరస్పర విరుద్ధములైన తైలాగ్నివర్తి సంయోగము ద్వారా దీపము ఆయా వస్తువులను ప్రకాశింపజేయుచున్నట్లు సత్త్వ రజ

స్తమోగుణములు పరస్పర విరుద్ధములయ్యును అయా అర్థములను వెల్ల డించున్నవని భావము.

వ్యక్తావ్యక్తములందు త్రిగుణములుండును. మూడుగుణములు సుఖదుఃఖమోహాత్మకములు. ఉదా: ఒక మామిడి చెట్టునుండి పండు పడినదను కొనండి. ఆ పండును పొందుటకు పరుగిడిన ఇద్దరు పిల్లలలో ఒకరికి లభించినపుడు పండు లభించినవానికానందము, లభింపని వానికి దుఃఖము తటస్థముగా నున్నవానికి ఔదాసీన్యము కలుగుచున్నది. ఈ మూడు ప్రతిక్రియలు ముగ్గురిలో కలుగుటకు పండొకటే కారణమగుచున్నది. ఒక పాట వింటున్నప్పుడు రసికునకు ఆనందము, సిర శ్శూలగల వానికి దుఃఖము, ఏదీ పట్టించికోని వానికి ఔదాసీన్యము ఏర్పడుచున్నది. ముగ్గురిలో మూడు రకాల ప్రతిక్రియలు కలుగుటకు గేయమే కారణము కదా? జగత్తులోని ప్రతిపదార్థమునందు మూడు గుణములుండుటవలననే ప్రతిక్రియలు కలుగుచున్నవి. వ్యక్తతత్త్వములలో గుణత్రయము ఉండుటవలన తత్కారణమైన అవ్యక్తమునందు మూడు ఉండితీరుతవి.

## సాంఖ్యసిద్ధాంతమున పురుషుడు

సాంఖ్యదర్శనము నందు 'శరీరాది వ్యతిరిక్తః పుమాన్ సంహాత పదార్థత్వాత్ త్రిగుణాది విపర్యయాత్ అధిష్ఠానాచ్చేతి భోక్తృభావాత్ కైవల్యార్థం ప్రవృత్తేశ్చ' ఇత్యాది సూత్రములు పురుషతత్త్వమును సాధించుచున్నవి. 'సంఘాత పదార్థత్వాత్ త్రిగుణాది విపర్యయాత్ అధిష్ఠానాత్ పురుషోఽస్తి భోక్తృభావాత్ కైవల్యార్థం ప్రవృత్తేశ్చ' అనే 17వ కారిక పూర్వోక్త సూత్రార్థములను వివరించుచున్నది. శరీరాది ప్రకృత్యంత పదార్థాలు సంఘాతమనబడు చున్నవి. శయ్యాసనాది ఉపకరణము ఒకానొక పురుషుని ఉపభోగార్థము ఉపయుక్తమైనట్లు శరీరాది పదార్థములన్నియు ఒకానొక భోక్తను నిర్దేశించు చున్నవి. జగత్తులోని పదార్థములన్నియు సంఘాత మయములు. ఇటుక, రాయి, సిమెంటు, కఱ్ఱ మున్నగు వాని సంఘాతమే గృహము కదా. అనేక తంతు సంఘాతమే వస్త్రమైనట్టు ప్రకృతి నుండి ఏర్పడిన సంఘాతమయములగు వస్తువులన్నీ ప్రకృతి కంటె భిన్నమైన వ్యక్తి యొక్క ఉపయోగము కొరకు ఏర్పడినవి. వాటిని ఉపయోగించే వ్యక్తికాక మరియొ

కలెట్లగును. త్రిగుణమయమైన ప్రకృతి కంటె భిన్నమైన కారణమున ఏదో ఒక అసంఘాతపదార్థము కలిపించుకొనవలసి వచ్చును. ఆ అసంఘాతత్త్వము పురుషుడు కాక మరియొకటెట్లు కాగలదు. జడ పదార్థము చేతన సహాకారము లేకుండా ప్రవర్తింపదు. సారధి సహాకారము లేకుండా రధము అడుగైనా ముందువేయదు. అదేవిధమున సుఖదుఃఖాత్మకమై జగత్తు ఒకానొక చేతన తత్త్వముచే అధిష్ఠితమైనపుడే ప్రవృత్తమగుచున్నది. ఆ జడతత్త్వము నధిష్ఠించిన చేతన వ్యక్తి పురుషుడు కాక మరెవ్వరు అగును? జగత్తులోని సమస్త విషయములు భోగవిషయములు. భోగవిషయము భోక్త కొరకే ఏర్పడినవి. వానిని భోగించే వ్యక్తి ఎవరో ఒక చేతన వ్యక్తి కావలసియుండును. అట్టి భోక్త పురుషుడు కాక మరియొకటెట్లగును. ప్రతి వాడు అనాది కాలమునుండి దుఃఖాలనుండి బంధాల నుండి విముక్తి నభిలషిస్తున్నాడు. ఈ ప్రవృత్తి చేతన పురుషునియందే సిద్ధించుచున్నది. కాబట్టి పురుష వ్యక్తి ఈ కారణ సామాగ్రిచే సిద్ధించుచున్నాడు. అనగా భోగము గాని అపవర్గముగాని పొందే వ్యక్తి చేతనుడు, కాని జడపదార్థము కాదు. శరీరాది పదార్థములన్నీ ఇతరుల భోగము కొరకు ఏర్పడినవి. భోగమును అనుభవించునది శరీరము కాదు. దాని నధిష్ఠించిన భోక్తయే పురుషు డనబడుచున్నాడు. వ్యక్తావ్యక్తములన్నీ త్రిగుణములు. అచేతనములు. స్వస్వగుణములనుండి విడదీయరానివి. పురుషుడు త్రిగుణియగు చేతనుడు. త్రిగుణసంఘాతము నుండి విడదీయబడెడి వాడు. బండికి సారధి అధిష్ఠాతమైనట్లు శరీరమునకు అధిష్ఠాత పురుషుడు. శరీరాదులు అజరములు అచేతనములగుట వలన అవి అధిష్ఠేయములు. అధిష్ఠాత కానేరవు. పురుషుడు భోక్త యగుట వలన శరీరాదుల కంటే భిన్నుడు, శరీరాదులలోనే అంతర్భవించిన పక్షమున అచేతనములకు భోక్తృత్వము సిద్ధింపదు. మరియు పురుషుడు శరీరాది భిన్న తత్త్వముకానిచో మోక్షమునకై ప్రవృత్తియే కలుగనేరదు. కావున వ్యక్తావ్యక్తములకంటె భిన్నమైన చైతన్య స్వరూపకముగు పురుష వ్యక్తి ఉన్నాడని పూర్వోక్త కారణములచే తెలియుచున్నది. ఈ పురుషుడు కూటస్థ నిత్యుడు. అపరిణామి. దేనికి ప్రకృతియు వికృతియు కాదు. సాంఖ్యదర్శనము పురుష నానాత్వ మంగీకరించు చున్నది.

## సాంఖ్యదర్శనమున ప్రమాణములు

'ద్వయోరేకతరస్యవాప్యసన్నికృష్టార్థ పరిచ్ఛిత్తిః ప్రమా, తత్ సాధక తమం యత్ - తత్ త్రివిధం ప్రమాణం'. సాంఖ్యుల జ్ఞానప్రక్రియలో బాహ్య పదార్థములైన ఘటపటాదులు బుద్ధిని లేదా పురుషుని ఆరోహించును. బుద్ధి సత్త్వము వస్త్వాకారమును పొందుటవలన బుద్ధియందారోహించును. సాన్నిహిత్యమువలన బుద్ధి పురుషుని యందు ప్రతిఫలించుటచేత బుద్ధిగత వస్తువులు పురుషునియందు ఆరూఢములగును. బుద్ధి పురుషులు ప్రమాతృ పదముచే పేర్కొనబడుదురు. కావున ప్రమాత యందు బాహ్య వస్తువుల ఆరోహణము సన్నికర్షగా పేర్కొనబడుచున్నది. సన్నికృష్టమనగా అధిగతము. అసన్నికృష్టమనగా అనధిగతము. పరిచ్ఛిత్తి యనగా తనయందున్న ట్లుగా తెలిసికొనుట. ఇట్లు బాహ్యముగా వస్తువు పూర్వము తెలియబడక, పురుషునియందో, బుద్ధియందో ఆరూఢమగును. అట్టి స్వరూపప్రాప్తే ప్రమ. ప్రమకు సాధనమైనది ప్రమాణము. ప్రమ బుద్ధినిష్ఠమైనపుడు బుద్ధి ప్రమాత్రి అవుతున్నది. పురుషుడు సాక్షి అగును. ఇది ఘటము. ఇది పటము. ఇత్యాది నిశ్చితజ్ఞానము ప్రమ అనబడుతుంది. నేత్రాదీంద్రియములు ప్రమాణములనబడుచున్నవి. ప్రమ పురుష నిష్ఠమైనపుడు బుద్ధియందు ప్రతిబింబించే పురుషుడు ప్రమాత యగును. బుద్ధి ప్రతిబింబిత పురుషునియందు ఉండే ప్రమ పురుషనిష్ఠ ప్రమ యని వ్యవహరింతురు. అట్లు ప్రతిబింబించిన పురుషుడే సాక్షి యగుచున్నాడు. ఇది ఘటము ఇది పటము అని వస్త్వాకారము పొందిన బుద్ధి వృత్తి ప్రమాణమౌతున్నది. నేత్రాదులు గౌణ ప్రమాణముగా నెంచబడుచున్నవి. ముఖ్యప్రమాణము బుద్ధి వృత్తియే అని సాంఖ్యులు ప్రమను గురించి తెలిపినారు.

సాంఖ్యసిద్ధాంతమున ప్రత్యక్షానుమాన శబ్దములను ప్రమాణములు వైశేషిక దర్శనమునందు వలె అంగీకరింతురు. (వైశేషికదర్శన వ్యాసమున ఈ మూడు ప్రమాణముల గురించి విపులమైన వివరణ కలదు.)

వస్తువుల అనుపలబ్ధి విషయమున సాంఖ్యులు 8 కారణములు తెలిపినారు. ఆ కారణములను మాత్రము ఈ కారిక ద్వారా తెలిసికొనవచ్చును. 'అతిదూరాత్, సామీప్యాత్, ఇంద్రియఘాతాత్, మనోఽనవస్థానాత్, సౌక్ష్మ్యాత్, వ్యవధానాత్, అభిభవాత్, సమానాభిహారాచ్చ'. అతి

దూరమున పదార్థమున్నను ప్రత్యక్షము కాదు. అతి సమీపమున నున్నను పదార్థము గోచరము కాదు. తనకన్నే తను దిద్దుకున్న కాటుకను చూడలేదు. ఇంద్రియములు దెబ్బతిన్నను పదార్థము గోచరముకాదు. అంధత్వదోషము కంటికి కలిగి నపుడు కంటికి ఎదుటనున్న వస్తువు కనిపింపదు. మనస్సు వ్యగ్రంగా, వికలంగా, అనవస్థితంగా నున్నప్పుడు విషయజ్ఞానము కలుగదు. అతి సూక్ష్మముగా పదార్థమున్నను గోచరింపదు. ఆకాశములో పరమాణు రూపమున నున్న జలము అతి సౌక్ష్మకారణమున గోచరించుటలేదు. ఏదేని వ్యవధానము లేదా ఆవరణయున్నప్పుడు వస్తువు యొక్క ఉపలబ్ధి కలుగదు. గోడలోపల పెట్టిన పదార్థము వ్యవధానమున గోచరించుటలేదు. ప్రబల వస్తువు దమనం వల్ల కూడా వస్తువు గోచరించుట లేదు. సూర్యతేజస్సు మూలమున నక్షత్రములు అగుపడుటలేదు కదా. సమాన స్థితిలోనూ వస్తువు స్ఫుటముగా గోచరింపదు. పెసళ్ళ కుప్పలో పారవేసిన పెసర గింజకాని, పావురాల మధ్యచేరిన పావురముకాని ప్రత్యక్షము కాకపోవుటకు కారణము సమావాభిహారమే. అందువలన పురుష తత్త్వంకాని, ప్రకృతి తత్త్వం కాని స్ఫుటంగా గోచరించకపోవుటకు హేతువు అతి సౌక్ష్మ్యాదులే. ప్రకృతి కార్యములను బట్టి ప్రకృతి, చైతన్య కారణమును బట్టి పురుషుడు అనుమాన ప్రమాణమున సిద్ధిస్తున్నారు.

## సత్కార్యవాదము

సాంఖ్యదర్శనము సత్కార్యవాదమును ప్రతిపాదించుచున్నది. కార్య విషయములో 4 వాదములు కలవు. కార్యవిషయములో 4 వాదములు కలవు. 1. బౌద్ధుల శూన్యవాదము 2. నైయాయికుల అసత్కార్యవాదము 3. శాంకరాద్వైతుల వివర్తవాదము 4. సత్కార్యవాదము.

బౌద్ధులు అసత్తునుండు సత్తు కలుగునని పేర్కొనుచున్నారు. సత్ పదమునకు క్షణికమను నర్థమును గ్రహింపవలయును. 'నాసదుత్పాదో నృశృంగవత్'. మనుజులకు కొమ్ములులేనట్లె అసత్తునుండి కలుగదు అని శూన్య వాదమును నిషేధించినది. కారణమునుండి కార్యము క్రొత్తగా పుట్టును. నైయాయిక వాదమును అంగీకరించిన పక్షమున ఈ కార్యమునకు ఇయ్యదియే ఉపాదానకారణమను నియమము ఉండక పోవలసి వచ్చును. అంతేకాక

ఒకే కారణమునుండి అనేక కార్యములు ఏర్పడవలసి వచ్చును. మట్టినుండి కుండపుట్టినట్లే, పటమునుండి కూడా పుట్టవలసి వచ్చును. కారణము సత్యము. కాని దాని అభాసయే కార్యము. శుక్తిని జూచి రజతముగా, త్రాటిని జూచి సర్పముగా భ్రమించుటలో శుక్తి రజ్జువులే సత్యము. రజత సర్పములు భ్రాంతి విషయములు అని శాంకరాద్వైతులు పేర్కొనుచున్నారు. వాస్తవముగా ఈ ఉదాహరణము పొసగుటలేదు. ఏలననగా కారణమైన బ్రహ్మము ప్రపంచ కార్యముగా అభాసించుచున్నది. అది పరమార్థముగాదు. అని పేర్కొనుచు ఆ ఉదాహరణము నిచ్చుచున్నారు. శుక్తి రజతములకు సామ్యము కలదు. కాని జడమైన ప్రపంచమునకు చేతనమైన బ్రహ్మమునకు ఏ కొద్దిగానైన సామ్యములేదు. కాబట్టి కారణము కార్యముగా ఆభాసించుట యనగా బ్రహ్మము ప్రపంచముగా ఆభాసించుట సంభవింపదు. ఏ జ్ఞానము లోనైనా ప్రమాత, ప్రమేయము, ప్రమిత, ప్రమాణము అను చతుష్టయము అవశ్యముగానుండును. వివర్తవాదమున భ్రమాధిష్ఠానము, భ్రమవిషయము, భ్రమపడువాడు అను నాలుగు అంశములు గోచరంచుటలేదు. అందువలన అసత్తునుండి సత్తు కలుగునను బౌద్ధవాదముకాని, సత్తునుండి అసత్తు ఏర్పడునను నైయాయికుల అసత్కారవాదముకాని, సత్తు అసత్తుగా ఆభాసించునను శంకరాద్వైతుల వివర్తవాదముకాని యుక్తిసహముగ లేదు. అనుభవ విరుద్ధము లైనవి అని సాంఖ్యులు ఆ మూడు వాదములను ఖండిస్తూ కార్యము కారణములో సూక్ష్మరూపమున ఉండునని, కారణమే కార్యముగా పరిణమించుచున్నదని తంతువులు పటముగా, మృత్తిక ఘటముగా, పాలు పెరుగుగ పరిణమించుచున్నవని ఈ పరిణామమునందు రెండు దశలుండునని, మొదటిది కారణదశకాగా రెండవది కార్యదశయని కారణముయొక్క అవస్థాంతరమే కార్యమని పరిణామవాదమును లేదా సత్కారవాదమును ప్రతిపాదించినారు.

సాంఖ్యదర్శనమునందు 'నా సదుత్పాదో నృశృఙ్గవత్, ఉపాదాన నియమాత్ - సర్వత్ర సర్వదా సర్వాసంభవాత్, శక్తస్య శక్యకారణాత్, కారణభావాచ్చ' అను 5 సూత్రములు సత్కారవాదముగా స్థాపించుచున్నవి. ఈశ్వరకృష్ణుడును 'అసదకరణాత్, ఉపాదాన గ్రహణాత్, సర్వసంభవాత్, శక్తస్య శక్యకరణాత్, కారణాభావాచ్చ - సత్కార్యమ్' అను కారికలో

న్యాయదర్శన సూత్రార్థములనే నిగుడించినాడు. ఏది సత్తుగాదో అది అసత్తు అనబడుతుంది. అసత్తునుండి సత్తుగాని, సత్తునుండి అసత్తుగాని ఏర్పడదు. ఏలనన సత్తు ఎప్పుడు అసత్తుగాదు. ఈ రెండు పరస్పర విరుద్ధములు. ఇదే భావము 'నాసతో విద్యతేభావో నాభావో విద్యతే సతః' అని భగవద్గీత పేర్కొనుచున్నది. సత్తు నుండి అసత్తు ఏర్పడునని అంటిమేని - ఇసుక నుండి చమురు ఏల కలుగుటలేదు? ఇసుకలో చమురు లేకపోవుటయే కారణము. అందువలన కారణముసత్తైనట్లే కార్యము సద్రూపము.

ఏది దేనికి కారణమో దానినే గ్రహించుచున్నారు. పెరుగు అభిలషించువారు పాలను తోడుపెట్టుచున్నారు. ఆభరణము కావలెననుకొన్నవారు సువర్ణమునే వాంఛించుచున్నారు. బట్ట కావాలనుకున్నవారు తంతువులనే గ్రహించుచున్నారు. ఇట్లు ఉపాదాన కారణము గ్రహించుటచే ఆ ఉపాదాన కారణమునందు దధ్యాది కార్యము అవ్యక్తరూపమున ఉంటుంది. అందువలన తగిన ఉపాదానమును లోకులు గ్రహించుచున్నారు. మరియు ప్రతి పదార్థము ప్రతిదానినుండి పుట్టదు. ఇసుకలో నూనె, తంతువులలో ఘటము ఏర్పడక పోవుటకు ఇదే కార్యకారణనియమము ఉంటున్నది. ఆ నియమమును బట్టి కారణోచితమైన కార్యమేర్పడుచున్నది. మరియు కార్యమును ఉత్పత్తిచేసే శక్తి ఆ కారణముకున్నప్పుడే ఆ కారణమునుండి ఆ కార్యమేర్పడుచున్నది. కుమ్మరివాడు మృత్తికనుండి దండాది సహాయమునన ఘట నిర్మాణము చేయుచున్నాడు. ఇంతేకాదు. కారణము ఎట్టిదో కార్యమట్టిదే యుండును. జొన్నవిత్తనమునకు జొన్నపంట వచ్చుచున్నది. వేరొకటి కాదు. ఈ యుక్తులవలన కారణమునందు కార్యము అవ్యక్తరూపమున ఉంటుందని, కారణము కార్యముగా పరిణమించుచున్నదని సత్కార్యవాదము పేర్కొనుచున్నది.

## సాంఖ్యదర్శనము - విశ్వము

ప్రకృతి పురుష సంయోగమువలన విశ్వసృష్టి జరుగుతున్నది. ప్రకృతి జడమైనందున విశ్వసృష్టి చేయలేదు. పురుషుడు స్వభావతః అసంగుడు, నిష్క్రియుడు అగుట వలన పురుషుడును స్రష్ట కాలేదు. సంసారమేర్పడుటకు ప్రకృతి పురుష సంయోగము ఆవశ్యకము. చేతనుని అధ్యక్షతలో జడమైన ప్రకృతి సృష్టికార్యోన్ముఖ మగుచున్నది. కాని విరుద్ధ స్వభావములకు

చెందిన ప్రకృతి పురుషులు కలియుట ఎట్లు? ఈ విషయములో సాంఖ్యులు లౌకికోదాహరణము నొసగి సమన్వయమిట్లు చేయుచున్నారు. 'పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం ప్రధానస్య పఙ్గ్వన్ధవత్ ఉభయోరపి సంబంధస్తత్కృతస్సర్గః'. గ్రుడ్డివాడు చూడలేడు. కుంటివాడు నడువలేడు. కుంటివాడు చూడగల్గును. త్రోవచూస్తూ నడచి వెళ్లవలసియున్నది. గ్రుడ్డివాని భుజములపై కుంటివాడు కూర్చుని త్రోవను చూపిస్తుండగా గ్రుడ్డివాడు నడచి వెళ్లును. ఈ ఇరువురి సహవాసము వలన దర్శన గమన క్రియలు ఈడేరుచున్నవి. అదే విధముగా ప్రకృతి జడమైనను సక్రియ. పురుషుడు నిష్క్రియుడయ్యు చేతనుడు. ప్రకృతి భోగ్య. పురుషుడు భోక్త. భోక్త లేకుండా భోగ్యమైన ప్రకృతికి స్వరూపసిద్ధి ఉండదు. భోక్తద్వారా దృష్టము లేదా అనుభూతమైనపుడే ప్రకృతికి భోగ్యత్వము సిద్ధించుచున్నది. కాబట్టి చేతనుడైన పురుషుడు జడమైన ప్రకృతితో సంపృక్తుడైనందున సంసార మేర్పడుచున్నది. వివేక జ్ఞానము కలిగిన మరుక్షణము పురుషునకు కైవల్యము సిద్ధించుచున్నది. ప్రళయదశలో ప్రకృతి సామాన్యావస్థలో నుంటుంది. గుణత్రయము సమభావము చెందినందున ప్రళయ మేర్పడుచున్నది. పురుష సంపర్కమువలన ప్రకృతిలో గుణ సంక్షోభము కలుగుచున్నది. ఒక గుణము మరియొక గుణమును అదిమి పెట్టుచున్నది. వశపరచుకొనుటకు ఉద్యమించును. దీనివలన సృష్టికార్యము కొనసాగుచున్నది. ప్రకృతిలో గుణసంక్షోభము ఏర్పడినప్పుడు మొట్టమొదట మహత్తత్త్వము పొడచూపుతున్నది. జగదుత్పత్తికి మహత్తే బీజమగుచున్నది. సంసారోత్పత్తి యందు విశేషమహత్వమును పొందియున్నందున దీనికి మహత్తు అను పేరు వచ్చినది. మహత్తునకే బుద్ధియని పేరు. దీనికే అధ్యవసాయమని నామాంతరము. బుద్ధి తనకు తాను ప్రకాశించుచు విషయాలను ప్రకాశింప చేస్తుంది. ఈ బుద్ధి నేను నాది అను భావాలను వెల్లడించుచున్నందున అహంకారమను పేరుతో పిలువబడుచున్నది. మననము చేయుట వలన మనస్సనియు, బుద్ధియే వ్యవహరింపబడుచున్నది. సత్త్వగుణాధిక్యము బుద్ధిలో నున్నప్పుడు ధర్మ జ్ఞాన వైరాగ్యైశ్వర్యాలు ఉదయించును. తమోగుణాధిక్యము బుద్ధిలో కలిగినపుడు అధర్మ అజ్ఞాన అసక్తి అశక్తి అనువి కలుగును. బుద్ధి ప్రకృతికార్యమైనందున స్వయంగా జడమైనను పురుషునికి అతి సన్నిహితముగా నుండుట వలన పురుషుని చైతన్యము

అంతా బుద్ధిలో ప్రతిబింబితమై అది చేతనముగా ప్రతీతి గోచరమగుచున్నది. అందువలన బుద్ధిలోనే సుఖదుఃఖానుభవము ఏర్పడుచున్నది. ఆ బుద్ధి సుఖదుఃఖానుభవమును పురుషున కర్పించుచున్నది. బుద్ధి సహాయత వలన పురుషుడు భోక్తయగును. భుక్తిని ముక్తిని పొందుచున్నాడు. బుద్ధిలో గుణవైషమ్య మున్నట్లే, అహంకారములో గుణవైషమ్యముండును. గుణ వైషమ్యమును బట్టి అహంకారము సాత్త్విక, రాజస, తామస భేదములను పొందుచున్నది.

ప్రబలముగా ఉన్న గుణము ఇతర గుణములను ఉపమర్దించుచున్నది. సాత్త్వికాహంకారము నుండి మనస్సుతోబాటు జ్ఞానకర్మేంద్రియములు అభివ్యక్తమగుచున్నవి. తామసాహంకారము నుండి పంచతన్మాత్రలు ఏర్పడు చున్నవి. విజ్ఞానభిక్షువు సాత్త్వికాహంకారము వలన మనస్సు, రాజసాహంకారము వలన దశేంద్రియములు, తామసాహంకారము వలన పంచతన్మాత్రలు పుట్టునని, ఈశ్వరకృష్ణ, వాచస్పతిమిశ్రులకు భిన్నముగా పేర్కొన్నారు. మనస్సు అహంకారము బుద్ధి అనునవి 3 అంతఃకరణములు. ఈ మూడు ఆయా ఇంద్రియముల ద్వారా విషయాలను గ్రహించుచున్నవి. శబ్ద స్పర్శ రూప రస గంధములను తన్మాత్రలు తామసాహంకారము వలన ఏర్పడుచున్నవి. ఇవి అతి సూక్ష్మముగా నున్నందున ప్రత్యక్ష గోచరము కావు. అనుమేయములు. తన్మాత్రలవలన పంచమహాభూతములు క్రమముగా ఏర్పడునని సాంఖ్యులు సృష్టిక్రమము గూర్చి తెలిపినారు.

సాంఖ్యదర్శనము సృష్టిని ప్రకృతి పరిణామముగా భావించుచున్నది. ఉత్పత్తి వాదమును అంగీకరించదు. సత్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతిలో ప్రసవ ప్రతిప్రసవ ధర్మాలు కలవు. ప్రసవమనగా విరూప పరిణామము. సజాతీయము విజాతీయంగా పరిణమించటానికి విరూపపరిణామము అందురు. ప్రతిప్రసవము సరూపపరిణామము. విజాతీయము సజాతీయంగా మారుట. సత్వరజస్తమోగుణముల సామ్యవైషమ్యావస్థలు ప్రసవ ప్రతిప్రసవ రూపంగా రూపొందునని తాత్పర్యము. సాంఖ్యసిద్ధాంతమున లింగశరీరము తన్మాత్రలవలన ఉద్భూతమైన పంచమహాభూతములకు విశేషమని పేరు. ఇట్టి విశేషము సూక్ష్మ శరీరము, మాతా పితృ జన్యమైన సూక్ష్మశరీరము,

మహాభూతములని 3 విధములు. సూక్ష్మశరీరమునకే లింగశరీరమని పేరు. ఇది నిత్యమైనది. మహత్తు అహంకారము తన్మాత్రలు ఏకాదశేంద్రియములు అను వాటితో సూక్ష్మ శరీర నిర్మాణము జరుగుతున్నది. ప్రతి పురుషునకు లింగశరీరము భిన్నభిన్నంగా ఉంటుంది. సృష్టిక్రమమే ఇట్లు రూపొందినది. లింగశరీరము అకుంఠితముగా ఉంటుంది. ఇది అతి కఠినమైన శిలలోనూ ప్రవేశిస్తుంది. ఆకాశములోనికి చొచ్చుకుని పోతుంది. ప్రళయము దాకా స్థిరముగా ఉంటుంది మహత్తునుండి తన్మాత్రలవరకు ఉండే 18 తత్త్వాలు సూక్ష్మశరీర నిర్మాణమునకు మూలమగుచున్నవి. లింగశరీరము భోగ్యవంతమైనది. ధర్మ, అధర్మ, జ్ఞాన, అజ్ఞాన, వైరాగ్య, అవైరాగ్య, ఐశ్వర్య, అనైశ్వర్యములను 8 భావములతో లింగశరీరము కూడి చరించుచున్నది. అధిష్ఠానము లేకుండా గృహము, భిత్తి లేకుండా చిత్రము నిలవనట్లే సూక్ష్మ శరీరము నాశ్రయించకుండా బుద్ధ్యాదులు నిలువజాలవు. పురుషప్రయోజనము కొరకు ఏర్పడిన ఈ సూక్ష్మశరీరము ధర్మాధర్మాది నిమిత్తములతో శరీరముతోను సంబద్ధమై నటునిలాగా విభిన్నరూపముల ధరించుచున్నది.

సాంఖ్యమతానుసారము ప్రకృతి నుండి పంచభూతములదాకా ఏర్పడే సృష్టియొక్క వికాసక్రమము ప్రత్యయసర్గ, తన్మాత్రసర్గ భేదమున రెండు విధములు. ప్రత్యయసర్గమునకే బుద్ధిసర్గయని పేరు. ఈ సర్గలో బుద్ధ్యహంకారములతో పాటు ఏకాదశేంద్రియములు చేరుచున్నవి. తన్మాత్ర సర్గకు భౌతికసర్గయని పేరు. భౌతికసృష్టి 14 విధముల నుండును. అందు 8 ప్రకారముల దేవసృష్టి. 5 విధాల తిర్యక్ సృష్టి. ఒక విధము మానవ సృష్టి. బ్రహ్మ, ప్రజాపతి, ఇంద్ర, పితృ, గంధర్వ, యక్ష, రాక్షస, పిశాచములనునవి 8 దేవసృష్టులు. పశు, పక్షి, మృగ, సరీసృప, లతావృక్ష రూపస్థావరములనునవి 5 తిర్యక్ సృష్టులు.

సాంఖ్యసిద్ధాంతమునందు పరమాణువుల ఉత్పత్తి పంచతన్మాత్రల వలన కలుగుచున్నది. పరమాణువులు పంచన్మాత్రల వికారము ఐనందున అవి నిత్యము కావు. నైయాయికులు మాత్రము పరమాణువులను నిత్యముగా భావిస్తారు. వాటినుండే జగత్తు ఏర్పడుచున్నదని పేర్కొనుచున్నారు. కాని సాంఖ్యులు జగత్తునకు ఉపాదానకారణము ప్రకృతి యని ప్రతిపాదిస్తున్నారు.

సాంఖ్యసిద్ధాంతమందు ఆకాశము పరమాణువుగా పేర్కొనబడినది. నైయా యికులు ఆకాశాన్ని పరమాణువుగా అంగీకరించరు. సాంఖ్యయోగములు ఇంద్రియాలను భౌతికముగా అంగీకరింపవు. సాత్వికాహంకార జన్యము లగుటచే అహంకారికములని పేర్కొనుచున్నవి. నైయాయికులు భూతవిశే షగుణములను గ్రహించుటను బట్టి ఇంద్రియములు భౌతికములని నిరూ పించుచున్నారు. నైయాయికుల దృష్టిలో మనస్సు భౌతికంకాదు. అది ప్రత్యేక ద్రవ్యము. సాంఖ్యయోగదృష్టిలో మనస్సు భౌతికంకాదు. అది ప్రత్యేక ద్రవ్యము. సాంఖ్యయోగదృష్టిలో సాత్వికాహంకారజన్యము.

## అవిద్య

సాంఖ్యదర్శనానుసారము అసత్తును సత్తుగా, ఒక వస్తువును మరొక వస్తువుగా భావించుట అవిద్య యనబడుచున్నది. వేదాంతులు దీనిని 'అధ్యాస' అని పేర్కొనినారు. యోగదర్శనము విపర్యయమని నుడువు చున్నది. విపర్యయమన్నా మిథ్యాజ్ఞానమన్నా ఒకటే.

'అవిద్యాఽస్మితా రాగద్వేష అభినివేశాః యథా సాంఖ్యం తమోమోహ మహామోహ తామిస్రాంధతామిస్ర సంజ్ఞకాః పంచవిపర్యయ భేదాః' అను సాంఖ్యతత్త్వ కౌముదీ వచనానుసారము అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అను భేదమున నవవిధములని, వీటికే క్రమముగా తమస్సు, మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము అని పేర్లు అని తెలియుచున్నది. యోగదర్శనము పంచక్లేశములుగా వీనిని పేర్కొనుచున్నది. అనాత్మ వస్తువులను ఆత్మగా భావించుట లేదా ఆత్మయొక్క వాస్తవ రూపమును గ్రహించక పోవుట . అజ్ఞాన మనబడుచున్నది. ఈ అజ్ఞానము వలన పురుషుడు తన స్వరూపాన్ని గ్రహింపక పోగా ప్రకృతి వికారములను దనవి గానే భావిస్తున్నాడు. ఇట్టి అజ్ఞానమునకు తమస్సు అని పేరు. అష్టై శ్వర్యములను నిత్యంగా భావించుట అస్మిత లేదా మోహమని అందురు. శబ్దస్పర్శాదులపట్ల, అణిమాద్యష్టైశ్వర్యములను అనుభవించేవారిని చూచుట వలన కలిగే ద్వేషానికి తామిస్రమని పేరు. పూర్వోక్త విషయాలను నశింపజేయవలెనను గాఢమైన అభినివేశము అంధతామిస్ర మనబడుచున్నది. పురుషుడు వాస్తవముగా నిర్లిప్తుడు. బుద్ధి ప్రతిబింబితమగు పురుషచైతన్యమును

బట్టి పురుషుడు తనదిగా భావించును. ఈ భావన అజ్ఞాన మూలకమైనది. అజ్ఞానము తొలగిననాడు అనగా వివేక ఖ్యాతి కలిగినపుడు బంధ విముక్తి యేర్పడుచున్నది.

## దుఃఖత్రయము

సుఖదుఃఖములు చక్రనేమి క్రమముగా జీవితమును పెనవేసికొని యుండును. హేయము, హేయహేతువు, హానము, హానోపాయమను నాల్గింటిని ప్రధానముగా దర్శనములు తెల్పుచున్నవి. త్రివిధ దుఃఖములు హేయములు. ప్రకృతి పురుషసంబంధము వలన కలిగే అవిద్య లేదా అవివేకము హేయహేతువు. త్రివిధ దుఃఖాత్యంతిక నివృత్తి అనగా అవివేకము సర్వదా తొలగుట హానము. వివేక ఖ్యాతి హానోపాయము. కావున బందవిముక్తిని ప్రబోధించే ప్రతి దర్శనము చతుర్వ్యూహాత్మకమని తెలుపుచున్నది. ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక భేదమున దుఃఖము త్రివిధములుండును. ఆధ్యాత్మిక దుఃఖము శారీరక మానసిక భేదమున ద్వివిధముగా నుండును. వాతపిత్తాది ప్రకోపముల వలన ఏర్పడే వ్యధ లేదా దుఃఖము శారీరకము. కామక్రోధలోభేర్ష్యాదుల వలన కలిగే దుఃఖము మానసికము. మనుష్య పశుపక్ష్యాది కృత దుఃఖము అధిభౌతికము. భూతప్రేతాదిజన్యమగు దుఃఖము అధిదైవికము. మానవుని పరమ లక్ష్యము ఏతత్త్రివిధ దుఃఖాత్యంతిక నివృత్తి. ఆ త్రివిధ దుఃఖాత్యంత నివృత్తి వివేకఖ్యాతివలన కలుగుతున్నది. బంధము 3 విధముల ఉంటున్నది. 1. ప్రాకృతికము 2. వైకారికము 3. దాక్షిణికము. ప్రకృతిని అత్మగా భావించుచు దానినే ఉపాసించుటవలన ప్రాకృతిక బంధమేర్పడుచున్నది 'పూర్ణం శతసహస్రంహి తిష్ఠంత్యవ్యక్త చింతకాః' అని పురాణములు అవ్యక్తోపాసకులు వేయి సంవత్సరముల వరకు ప్రకృతి విలీనులౌచున్నారని తెలుపుచున్నవి. ఇంద్రియములు మున్నగు ప్రకృతి వికారములయందు తత్పరులైనవారికి వైకారిక బంధము ఏర్పడుచున్నది. వీరి దృష్టిలో ఇంద్రియములే ఆత్మ. కావున తదుపాసనయే ముఖ్యమని భావింపబడుచున్నది. 'దశ మన్వంతరాణీహ తిష్ఠంతీంద్రియ చింతకాః'. ఇంద్రియోపాసకులు 10 మన్వంతరముల వరకు వానిలోనే విలీనమయ్యెదరని వాయుపురాణము చెప్పుచున్నది. ఇట్లే పంచభూతోపాసకులు

100 మన్వంతరాలకాలము అహంకారోపాసకులు 1,000 మన్వంతరాల కాలము, బుద్ధి ఉపాసకులు 10,000 మన్వంతరాల కాలము, తమ తమ ధ్యేయములో విలీనమగుచు అవధి గడచిన పిమ్మట పునర్జన్మ నెత్తెదరని ఆ వాయుపురాణమే చెప్పుచున్నది. ఫలదృష్టితో కావించే ఇష్టాపూర్తకర్మల వలన దాక్షిణికమనే బంధము సిద్ధించుచున్నది. ఇష్టాపూర్తములు సాత్త్విక కర్మలైనందువలన తదనుకూలమైన స్వర్గసుఖము అనుభవించి 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' అన్నట్లు తిరిగి పునర్జన్మ నెత్తుదురు. ఇట్టి బంధము దాక్షిణిక బంధము. ఈ బంధాలన్నియు తొలగుటకు దుఃఖాత్యంత నివృత్తి చేకూరుటకు మోక్షము సిద్ధించుటకు వివేక ఖ్యాతి ప్రధానసాధనము.

## వివేకఖ్యాతి

మోక్షమునకు ప్రధాన సాధనము తత్త్వజ్ఞానము. దీనినే వివేకఖ్యాతి యందురు. వివేకఖ్యాతి యనగా వివేకజ్ఞానము. పురుషునకు ప్రకృతి తద్వికార మహదాది వివేకజ్ఞానమువలన మోక్షము సిద్ధిస్తుంది. వివేకఖ్యాతి వలన త్రివిధ దుఃఖవినాశము చేకూరుతుంది. సాంఖ్యదర్శనానుసారము పురుషుడు శుద్ధుడు, బుద్ధుడు, చైతన్య స్వరూపుడు. అతడు ఒక శరీరము నుండి మరొక శరీరమునకు వెళ్లడు. బంధము మోక్షము జన్మాంతరాది వికారములు బుద్ధి అహంకార ఆదిప్రకృతి పరిణామముల వలన కలుగుతున్నవి. ప్రకృతి తనకు తానే బంధించుకొనుచున్నది. బంధముకాని సంసరణము కాని మోక్షము కాని ప్రకృతికే కలుగుచున్నవి. కాని సంసరణ ధర్మాలన్నీ ప్రకృతిలో ఆరోపితము లగుచున్నవి. ప్రకృతి స్వయంగా ధర్మాది సప్త రూపాలతో తనకు తానే బంధించుకొనుచున్నది. ఇంతేకాదు. అదే ప్రకృతి జ్ఞానముచేత తనకు తానే విముక్తమగుచున్నది. పురుషునకు వాస్తవముగా బంధము సంసరణము మోక్షము లేకున్నను పురుషునకు చెందినవిగా చెప్పబడుచున్నవి. లోకములో జయాపజయములు సైన్యమువలన కలుగుచున్నను అవి రాజునకు అంటగట్టబడినట్లు సంసరణ ధర్మాలన్నీ బుద్ధికి సంబంధించినవేయైనను, తత్ప్రతిబింబిత చైతన్యము ద్వారా పురుషునకు చెందినవిగా చెప్పబడుచున్నవి. లింగశరీరము అజ్ఞాన కారణము వలన ప్రకృతి బుద్ధుల నుండి పురుషుడు తనను పృథగ్భూతునిగా గ్రహింపలేకపోవుచున్నాడు.

మీదు మిక్కిలి ఆ ధర్మాలు తనయందే అధ్యాపించుకొనుచున్నాడు. బుద్ధికి చెందిన సుఖ దుఃఖములు తనవిగా భావిస్తున్నాడు. అందు వలన తాను ప్రకృతికంటే భిన్నునిగా గ్రహింపలేకపోవుచున్నాడు. ప్రకృతికంటే తనను భిన్నునిగా తలపోయనందువలననే సుఖదుఃఖమోహాదులను పుట్టించే శబ్దాది వికారములు తనవిగా అభిమానిస్తూ తద్భోగము పొందినట్లు అనుకొనుచున్నాడు. దృశ్యప్రపంచమంతా తనకొరకు ఏర్పడినట్లు భావించును. ఇదియే నిజమని విశ్వసించుచున్నాడు. వివేకజ్ఞానము కలిగిన మరుక్షణము అతనికి ఇవి నావి కావు. నేను ఎప్పుడును నిత్యశుద్ధ ముక్తుడను. నాకు బంధములేదు. మోక్షము లేదు అని దృఢముగా భావించుటవలన అతడు ప్రకృతిబంధ ముక్తుడగుచున్నాడు. ఇవి ప్రకృతి ధర్మములు ఇవి బుద్ధి ధర్మములు. వీటిమూలముననే నాకు బంధముకలిగినది. వీటికన్నింటికి అవిద్యయే కారణము. అవిద్య నశించుటకు వివేకఖ్యాతియే ప్రధానసాధనము. ప్రకృతి పురుషుల భేదము సంపూర్ణముగా తెలియుటయే వివేకఖ్యాతి. స్ఫటికము నిర్మలమైనది. శుభ్రమైనది. జపాకుసుమ సంపర్కము వలన అది ఎఱ్ఱగా గోచరిస్తుంది కాని దాని ఎఱుపు సాంక్రామికమైనది. వాస్తవమైనది కాదు. అదే విధముగా పురుషుడు నిర్లిప్తుడు. శుద్ధ బుద్ధుడు. బుద్ధి సంపర్కమువలన తత్ప్రతిబింబిత చైతన్యముద్వారా అవి తనవిగానే భావించి బద్ధుడు కాకున్నను బంధములో చిక్కినట్లు తలపోయుచున్నాడు. ఈ అజ్ఞానము ప్రకృతిపురుషాన్యతాఖ్యాతి వలన తొలగి పోవుచున్నది. అవిద్యానాశనమే మోక్షమని నుడువు చున్నారు. సాంఖ్యకారికలో నటి వివిధ భూమికల ద్వారా పురుషులయెదుట వివిధ లీలలను ప్రదర్శించునట్లే ప్రకృతి, పురుషుని ముందే, తన వికారముల ప్రదర్శించు చున్నది. నటి వలె ప్రకృతి నటనము నుండి విరతమగుచున్నది. లీలలు గాని రూపములుగాని నటివైనట్లే సంసరణ ధర్మము లన్నియు ప్రకృతికి చెందిన వగుచున్నవి. పురుషునకు బంధమోక్షములు లేవు. అవిద్యానాశమే మోక్షము. మోక్షము జీవన్ముక్తి, విదేహముక్తి యని రెండు విధములు. జీవన్ముక్తిలో కొంత సంస్కారము శేషించి యుంటుంది. విదేహముక్తిలో ఆ సంస్కారము పూర్ణరూపేణా నశిస్తున్నది. సంస్కారము శేషించి యున్నను కైవల్యానుభవమందు కొరత యుండదు. కుమ్మరి వాడు కఱ్ఱతో సారెను త్రిప్పి దానిని ( కఱ్ఱను) పడవేసినను సారె తిరుగు చున్నట్లే

తత్త్వజ్ఞానము ఏర్పడినను, పూర్వసంస్కారము శేషించి యున్నందున కొంత కాలము జీవన్ముక్తుడు శరీరధారణము కావించుచున్నాడు. సంస్కారములన్నీ పూర్ణరూపేణ నశించుటవలన శరీరపాతానుక్షణము దుఃఖాత్యంతిక నివృత్తి చేకూరుతుంది. సంస్కారము నశించి పూర్ణరూపేణ ముక్తి కలుగుట విదేహముక్తి యని తాత్పర్యము. వివేకఖ్యాతియే మోక్షసాధనమని అవిద్యా ప్రభావమువలన బంధమేర్పడుచున్నది. వాస్తవంగా పురుషుడు నిర్లిప్తుడు, అతని యందు యే గుణము లేదు. అతడు చైతన్య స్వరూపుడు. అతని ధర్మము చైతన్యము కాదు. బుద్ధి ప్రతిబింబిత చైతన్యమే ఇదంతా తన దిగా భావిస్తుంది. వాస్తవముగా నేను నాది అని అభిమానించునది సంకల్ప వికల్పములు కలిగించునది, నిర్ణయించునది, బుద్ధియే. నిర్ణయించుకున్నప్పుడు బుద్ధియని, నేను నాది అని భావించినప్పుడు అహంకారమని సంకల్పవిక ల్పాదులు కావించినపుడు బుద్ధియే త్రివిధముగా రూపొందుతుందని, బుద్ధియే మహత్తని, ఇదియే మిగతా వికారములుగా పరిణమిస్తున్నదనీ బుద్ధికూడా వికృతియేయని, వికృతియైన బుద్ధికి ప్రకృతియే మూలమని, ద్విగుణాత్మక ప్రకృతియని, త్రిగుణసామ్యావస్థ ప్రళయావస్థయని, ప్రకృతిగుణవైషమ్యావస్థ సృష్టియని, సాంఖ్యులు పేర్కొనుచున్నారు.

## సాంఖ్యసిద్ధాంత సారము

సాంఖ్యము ప్రకృతిపురుష భేదమున రెండు ప్రధాన తత్త్వములను అంగీ కరించును. ఈ రెండు తమ అస్తిత్వవిషయములో పరస్పరము అధారపడని స్వతంత్ర తత్త్వములు. పురుషుడు చేతనుడు. చైతన్యము అతని స్వరూ పము. గుణముకాదు. శరీరముకంటె ఇంద్రియములకంటె మనస్సుకంటెను భిన్నముగా ఉండు ఆత్మయే పురుషుడు. వస్తుతః పురుషుడు విశ్వమునకు అతీతుడుగా ఉండుచు, నిత్యచైతన్యమూర్తియై, జగత్పరిణామములను వాటి క్రియాకలాపములను సాక్షీభూతుడుగా అవలోకించుచుండును. కాని పురుషుడు ఎట్టి పరిణామములకును, క్రియలకును అధీనుడు కాదు. జగత్తునకంతటికీ మూలమైన కారణము ప్రకృతి. ఇది ఇంద్రియగోచరము కానందున అన్ని టియందును బీజరూపమున ఉంటున్నందున అవ్యక్తమనబడుచున్నది. ఇది నిత్యము, జడము, సతత పరిణామోపేతము. ప్రకృతికి పరమార్థము పురు

షునకు తృప్తి కావించుటే. సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ ప్రకృతి యనబడుచున్నది. సత్త్వరజస్తమస్సులు అనునవి గుణములు. ఇట గుణప దమునకు త్రాడు అని అర్థము. 3 చేరులు కలసిన త్రాళ్లే గుణములు. ఇవి ప్రకృతి స్వరూపాంశములు. ప్రపంచములోని వస్తువులన్నియు కార్య ములు. వీటిలో సుఖ దుఃఖ మోహ గుణములు స్ఫురించుచుండును. అందు వలన ఈ కార్యముల కన్నింటికి పరమకారణమైన ప్రకృతిలో సుఖ దుఃఖ మోహములు బీజరూపమున ఉండి తీరును. ప్రకృతి పురుష సంయోగము వలన జగత్తు ఆవిర్భవిల్లునని సాంఖ్యులు పేర్కొనుచున్నారు. ఉభయుల సంయోగము వలన ప్రకృతిలోని సామ్యావస్థకు భంగము వాటిల్లి ఆ ప్రకృతి కార్యోన్ముఖమగును. ప్రకృతినుండి మహత్తు మొదట కల్గును. ఈ మహత్తు మహావిశ్వమునకు మూలకారణము. దీనిని బుద్ధి యనికూడ వ్యవహరింతురు. పురుషుని చైతన్యము బుద్ధిలో ప్రతిబింబితమైనందున అది చేతన తుల్యముగా స్ఫురించునట్లు చేయును. ఆ బుద్ధి నుండి అహంకారము కలుగును. నేను నాదియను అభిమానము అహంకారము అనబడుచున్నది. అహంకారము నుండి సత్త్వగుణభావము అధికమైనప్పుడు, పంచ జ్ఞానేంద్రి యములు, పంచ కర్మేంద్రియములు ఉభయేంద్రియములను ప్రవర్తింపజేసే మనస్సు కలుగు చున్నది. తమోగుణభాగ మధికమైనపుడు ఇట్టి అహంకార మునుండి శబ్ద స్పర్శ రూపరస గంధములనే పంచతన్మాత్రలు ఏర్పడుచున్నవి. పంచతన్మాత్రల నుండి క్రమంగా ఆకాశవాయు తేజో జల భూతములనే పంచమహాభూతము లభివ్యక్తము లగుచున్నవి. పురుషులలో తప్ప మిగిలిన తత్త్వము లన్నింటిలోను ప్రకృత్యంశ ఉంటుంది. భౌతికతత్త్వము (వస్తువు) లన్నింటికి ప్రకృత్యంశములే కారణము లగుచున్నవి. పురుషుడు దేనికి ప్రకృతి గాని వికృతి గాని కాడు.

సాంఖ్యదర్శనమునందు 3 ప్రమాణములుండును. అర్థపరిచ్ఛిత్తికి ప్రమ యని పేరు. అర్థపరిచ్ఛిత్తి యంటే ఏ మాత్రమూ భ్రమలేనట్టి నిశ్చితమై నజ్ఞానము. బుద్ధివృత్తివలన అర్థపరిచ్ఛిత్తి కలుగుతుంది. బుద్ధి జడమైనను ఆత్మచైతన్యము ప్రతిబింబించుటవలన ఇది ఏర్పడుచున్నది. బహిరింద్రియ ములయొక్క ప్రవృత్తి ద్వారా పదార్థముల ఆకారములు ఆత్మ చైతన్యము ప్రతిబింబించే బుద్ధిలో ముద్రితమైనపుడు ఆ వస్తువులకు సంబంధించిన

యథార్ధజ్ఞానము కలుగుచున్నది. ఒక వస్తువునకు ఒక ఇంద్రియముతో సన్ని కర్ష ఏర్పడుటవలన ఆ వస్తువును గూర్చిన తెలివి మనకు స్పష్టముగా కలుగుచున్నది. అట్టిజ్ఞానము ప్రత్యక్షమన బడును.

ఇది రెండు విధములు. ఒకటి నిర్వికల్పకము. రెండు సవికల్పకము. వస్తుదర్శన మాత్రమున కలుగు స్థూల జ్ఞానము నిర్వికల్పకము. నామరూప విశేష వివేచన జ్ఞానము సవికల్పకము. రెండు వస్తువులలో నుండే నియత సాహచర్యసంబంధము పురస్కరించుకొని ప్రత్యక్షగోచరమైన వస్తువును బట్టి, ప్రత్యక్షగోచరముగాని ఆ రెండవ వస్తువును అనుమానించుట లేదా సాధించుట అనుమాన ప్రమాణము. ప్రత్యాక్షానుమానాలతో చేకూరని జ్ఞానము ఆప్తవాక్యముతో సిద్ధించుచున్నది. వస్తుతత్త్వమును యథాతథంగా గ్రహించి భ్రమప్రమాది దోషములు లేకుండా నితరులకు చెప్పే ఆప్తుల వచనము శబ్దప్రమాణ మనబడుచున్నది.

ఆత్మస్వతంత్రము. అమరము. అవిద్య వలన మనశ్శరీరములతో తాదాత్మ్యము కలిగి భ్రాంతికి లోనై, వాటి సుఖదుఃఖములను తనవిగానే భావించి అనుభవించుచున్నను, ప్రకృతి పురుష వివేకము కలిగిననాడు ఆత్మ బంధవిముక్తి చెందుతుంది. ఆత్మానాత్మ వివేక రాహిత్యమే సర్వబంధములకు మూలమగుచున్నది. సమస్త దుఃఖములనుండి విముక్తి కలుగవలయునన్న మనశ్శరీరములకంటె బుద్ధికంటే ఆత్మ వేరనే విస్పష్టమైన జ్ఞానము లేదా వివేకజ్ఞానము అపేక్షితమౌతున్నది. ఇట్టి వివేకం గల్గినపుడు ఆత్మ సకల బంధ విముక్తమౌతుంది.

ఇట్టి ముక్త స్థితికి ముక్తి, కైవల్యము అని పేరు.

# పాతంజలదర్శనము

వేదకాలమున సాంఖ్య యోగములు కలిసి ఒకే దర్శనముగ ఉండి యుండెను. కాలక్రమేణ రెండును భిన్న దర్శనములుగ రూపొందినవి. 'తత్త్వకాండం సాంఖ్యం సాధనకాండం యోగః' అనే మహాభారతోక్తియు సాంఖ్యయోగముల ఐకాత్మ్యమును వెల్లడించుచున్నవి. మహాభారతము హిర ణ్యగర్భుని యోగ శాస్త్ర ప్రథమ ప్రవక్తగా 'హిరణ్యగర్భో యోగస్య వక్తా నాన్యః పురాతనః' అని కీర్తించినది. అదే మహాభారతము హిరణ్యగర్భునినే కపిలాచార్యునిగా వెల్లడించినది. యోగ భాష్యమునకు చెందిన తత్త్వవైశార దియు కపిలుడే హిరణ్యగర్భుడని నుడివినది. కపిలుని తత్త్వ సమాసములో, అతని షష్టి తంత్రములోను యోగ విషయాలెన్నో నిరూపింపబడినవి. ఈ కారణములవలన సాంఖ్యయోగములొకే దర్శనమని తత్కర్తయు కపి లుడే యనియు ప్రాచీన విద్వాంసులు తెలుపుచున్నారు. వార్షగణ్యాదులవలన సాంఖ్యములో ఈశ్వర ప్రాధాన్యము దగ్గిపోయినట్లు, అప్పటినుండే అది నిరీ శ్వర సాంఖ్యమైనట్లు కొందరు పేర్కొనుచున్నారు.

## మహర్షి పతంజలి

పతంజలి మహర్షి యోగశాస్త్రమును ప్రవర్తింప జేసినాడు. సాంఖ్య తత్త్వములను అవలంబించి పతంజలి యోగశాస్త్రమును సంగ్రథించినట్లు తెలియుచున్నది. 'అథ యోగానుశాసనమ్' అను సూత్రము పతంజలిని యోగశాస్త్రకర్తగా కాక అనుశాసన కర్తగా పేర్కొనుచున్నది. ప్రణయ నము వేరు అనుశాసనము వేరు. ఉపదిష్టమైన తత్త్వాలను కలగాపులగము కాకుండా లోకమున వెల్లడించుట అనుశాసన పదమునకు అర్థము. పతంజలి నామమున ఎందరో ఉన్నారు. ఒకరు మహాభాష్యకర్త. రెండవవాడు నిదా నసూత్రకర్త. మూడవవాడు చరకసంస్కర్త. నాల్గవవాడు యోగశాస్త్రకర్త. ఐదవవాడు (సాంఖ్యాచార్యులలో) సాంఖ్య ప్రతిష్ఠాపకుడు. యుక్తి దీపికలో మరియొక కోశకర్త పతంజలి యున్నట్లు పేర్కొనుచున్నది. ఇంత మందిలో

ఏ పతంజలి యోగశాస్త్రమును ప్రవర్తింపజేసినాడని ఇదమిద్ధమని స్పష్టముగా చారిత్రకులు తెల్పలేకున్నారు. పండిత పరంపరాగతంగా వస్తున్న ఈ శ్లోకము మాత్రము 'యోగేన చిత్తస్య, పదేన వాచాం, మలం శరీరస్యతు వైద్యకేన, యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి' యోగ సూత్ర ప్రణేత్ర మహాభాష్యకర్త చరకసంహితా కర్త అయిన యిమ్మువురును ఒక్కరే అని తెల్పుచున్నది. యోగసూత్రములపై వృత్తి వ్రాసిన భోజదేవుడు కూడా ఇదే యభిప్రాయమును వెల్లడించినాడు. వాక్యపదీయములో కూడ ఇదేమాట కలదు. చరకసంహితా టీకాకర్త చక్రపాణియు. 'పాతంజల మహాభాష్య చరక ప్రతి సంస్కృతైః మనోవాక్కాయ దోషాణాం హన్త్రేఽహి పతయేనమః' అని పూర్వోక్త విషయాన్ని సమర్థించినాడు. కాని పండిత ఉదయ్‌వీరశాస్త్రి మాత్రము యోగసూత్రకర్త పతంజలి మహాభాష్యకర్త పతంజలియు భిన్నులని తెలిపినాడు. కాని భిన్నులని ఆధారములు లభింపనందున ఆ ముప్పురు ఒక్కరే అని భావించుట ఉచితము.

## పతంజలి కాలము (300 సం. క్రీ.పూ.)

యోగదర్శనముపై వ్యాసుని పేర ఒక భాష్యము కలదు. ఇతడు వేదవ్యాసుడు కాదు. వ్యాసభాష్యము లబ్ధప్రతిష్ఠమైనది. వ్యాసభాష్యముపై తత్త్వవైశారది యను వ్యాఖ్యను వాచస్పతిమిశ్రుడు రచించినాడు. భోజుడును యోగసూత్రముపై రాజమార్తాండమను పేర వివరణకావించినాడు. రాజమార్తండమునకు భోజవృత్తి యను నామాంతరము కలదు. విజ్ఞానభిక్షువు వ్యాసభాష్యముపై యోగవార్త్తికమను టీకను వ్రాసినాడు. ఈతడే యోగసారమను సంగ్రహగ్రంథమును కూడ లిఖించెను. ఇదే విధముగ భావగణేశునివృత్తి, రామానందుని మణిప్రభ, అనంత పండితుని యోగచంద్రిక, నాగోజీభట్టు ఛాయావృత్తి రామానందసరస్వతి పాతంజల రహస్యము మున్నగు వ్యాఖ్యలు యోగసూత్రములపై తత్, భాష్యముపై వెలువడినవి.

## యోగము :

యోగ మనగా చిత్తవృత్తి నిరోధము. చిత్తవృత్తులు క్లిష్ట, అక్లిష్ట భేదమున రెండు విధములు. క్లేశమును కలిగించునవి క్లిష్టములు. క్లేశావహము కానివి అక్లిష్టములు. వాస్తవముగా వృత్తుల సంఖ్యను నిర్ణయించలేము. అయినా

యోగదర్శన కర్త స్థూలంగా ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతి భేదమున వృత్తులు ఐదు విధములని నుడివినాడు. ఈ వృత్తులు రాజస తామసములైనపుడు క్లేశము కలిగించునని, సాత్త్వికములైనచో క్లిష్టము కావని పేర్కొనినాడు. నిరోధమనగా వృత్తుల నడ్డగించుట లేదా దమనము చేయుట యని యర్థము కాదు. స్వస్వ విషయములందు అనాసక్తము కావించుట నిరోధ పదమున కర్థము. చిత్తమనగా అంతఃకరణము. మనోబుద్ధ్యహంకార ముల సమష్టి తత్త్వము చిత్త మనబడుతుంది. సత్త్వ ప్రధానమైన ప్రకృతి యొక్క పరిణామము చిత్తము. ప్రకృతి త్రిగుణాత్మకమైనందున తత్పరిణా మమయిన చిత్తము త్రిగుణాత్మకమగుచున్నది. సత్త్వరజస్తమోగుణముల తారతమ్యమును బట్టి చిత్తము మూడు రూపములె నొందుచున్నది. అందు వలన ప్రఖ్యాశీలముగా, ప్రవృత్తి శీలముగా, స్థితి శీలముగా చిత్తము ప్రసరించుచున్నది. రజస్తమోగుణముల సంసర్గవలన ప్రఖ్యాశీలమైన చిత్త సత్త్వము ఐశ్వర్యాది విషయములయందు సంసక్తమగుచున్నది. తమోగు ణాధిక్యము వలన అదే చిత్తము అధర్మ, అజ్ఞాన, అవైరాగ్య, అనైశ్వర్య ముల యందు వ్యాపృతమగుచున్నది. తమోగుణావరణము క్షీణించి రజో గుణాంశము మాత్రము శేషించి యున్నట్టి చిత్తము ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యములను పొందుచున్నది. రజో గుణము లేశమాత్రము కూడా లేనట్టి చిత్తము సత్త్వ ప్రధానమై యున్నందున ప్రకృతి పురుష వివేక జ్ఞానమును పొందజాలుచున్నది. అప్పుడు ధర్మమేఘ సమాధి సిద్ధిస్తుంది. వాస్తవముగా చిత్తమేక విధము అయినను గుణవైషమ్య మూలమున విభిన్న పరిణామ ములను చెందుచు అనేకావస్థలతో పరిఢవిల్లుచున్నది. ప్రకృతి కార్యమంతయు పరిణామమని సాంఖ్య దర్శనము చెప్పుచున్నది. పూర్వ ధర్మమును విసర్జించి అన్య ధర్మమును గ్రహించుట పరిణామము. పాలు పెరుగుగా మారునపుడు, పూర్వమందున్న క్షీరధర్మము తొలగిపోతుంది. ప్రకృతి మహదాది రూప ధర్మాంతరాలను గ్రహించుట ప్రకృతి పరిణామము. అందువలన ప్రకృతి యొక్క మొట్టమొదటి సత్త్వప్రధాన పరిణామము చిత్తమని తెల్పబడినది. దీనిని చిత్త సత్త్వమని సాంఖ్యయోగులు పేర్కొనుచున్నారు.

## చిత్తభూములు :

చిత్తమునకు ఐదు అవస్థలు కలవు. 1. క్షిప్తము. 2. మూఢము. 3. విక్షిప్తము. 4. ఏకాగ్రము. 5. నిరుద్ధము.

రజోగుణాభిభూతమయిన చిత్తము నిరంతరము సుఖదుఃఖాది విషయములయందు లంపటమయి యున్నందున, అతి చంచలమగుటచే ఆ చిత్తము క్షిప్తమనబడుచున్నది. చిత్తము తమోగుణాభిభూతమయినపుడు కర్తవ్యాకర్తవ్య వివేచన లేకుండ కామక్రోధ నిద్రాతంత్రాదిగ్రస్త మగుటచేత అది మూఢ మనబడుచున్నది. ఇట్టి మూఢ చిత్తము రాక్షస పిశాచాదులలో, మాదకద్రవ్యములను సేవించెడి వారిలోను ప్రధానంగా ఉంటుంది. ఒకప్పుడు స్థిరముగా వేరొకప్పుడు చంచలముగా నున్నట్టి చిత్తము విక్షిప్తమనబడుచున్నది. జ్ఞానము ఆర్జింపదలచిన వారి చిత్తము విక్షిప్తముగా ఉంటుంది. సమస్త వస్తువుల యందు లాంపట్యమును విసర్జించి, ఒకే ఒక విషయమందు కేంద్రితంగా ఉండే చిత్తము ఏకాగ్రమనబడుచున్నది. ఏకాగ్రావస్థలో బహిరింద్రియ వృత్తి నిరోధము సిద్ధించుచున్నది. ఇది ప్రథమ దశలో ఉండే యోగులకు కలుగుచున్నది. సమస్తవృత్తి నిరోధము సాధించిన చిత్తము నిరుద్ధమనబడుతుంది. ఇట్టి చిత్తము సిద్ధయోగులలో మాత్రము వెలుగుచున్నది.

## చిత్తవృత్తులు :

ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి అనునవి చిత్తవృత్తులు.

## ప్రమాణము :

యథార్థజ్ఞానమును కలిగించెడి ప్రధానసాధనము ప్రమాణమనబడుతుంది. ప్రమాకరణం ప్రమాణమని ప్రమాణలక్షణము. ప్రమయనగా యథార్థ జ్ఞానము. ప్రమాణము సాంఖ్యదర్శనమునందువలె యోగదర్శనమునందును త్రివిధము. 1. ప్రత్యక్షము 2. అనుమానము 3. ఆగమము.

## ప్రత్యక్షము :

చక్షురాదీంద్రియములద్వారా అంతకు పూర్వము తెలియబడనిదై ముందు ముందు బాధితము కానట్టి వస్తువిషయకమైన చిత్తవృత్తి ప్రత్యక్షప్రమాణ మనబడుచున్నది. చిత్తము ఇంద్రియ ప్రణాళికల ద్వారా బాహ్యవస్తువుతో

సంపృక్తమైనపుడు ఆ వస్తువు యొక్క సామాన్య విశేష ధర్మములను నిర్ణయించు చిత్తవృత్తి ప్రత్యక్షప్రమాణమని యోగభాష్యకర్త తెలిపినాడు. లింగ పరామర్శజన్యమై, అనధిగతము, అబాధితమునైన వస్తు విషయకమైన చిత్త వృత్తి అనుమాన ప్రమాణము. ఆప్తోపదేశమువలన అనధిగత అబాధిత వస్తు విషయకమగు చిత్తవృత్తి శబ్దప్రమాణము లేదా ఆగమ ప్రమాణము.

## విపర్యయము :

మిథ్యాజ్ఞానము విపర్యయము. త్రాటిని చూచి సర్పమనుకొనుట, ఎండ మావులలో నీళ్లున్నవనుకొనుట, ముత్తెపుచిప్పను వెండియనుకొనుట విపర్య యము లేదా మిథ్యా జ్ఞానము. తార్కికులు దీనిని అయథార్థానుభవమన్నారు. ఇది 5 విధములు 1. అవిద్య 2. అస్మిత 3. రాగము 4. ద్వేషము 5. అభినివేశము. వీటినే తమస్సు, మోహము, మహామోహము తామిస్రము, అంధతామిస్రము అని పేర్కొందురు.

## అవిద్య :

నిత్యము కానట్టి కార్య జగత్తును నిత్యమని, అశుచియైనట్టి శరీరమును శుచియని, సుఖము కానట్టి విషయభోగాదులను సుఖమని, ఆత్మ కానట్టి బుద్ధ్యాదులను ఆత్మ యని భావించుట అవిద్య అనబడుతుంది.

## అస్మిత :

పురుషుడు మరియు బుద్ధి అనునది అత్యంత విభిన్నములు. ఒకటి ఆత్మ వేరొకటి అనాత్మ. బుద్ధి ఆత్మ కాకున్నను ఆత్మ వలె వ్యవహరిస్తున్నది. అత్యంత విభిన్నములైన ప్రకృతి పురుషులను ఒకటి యనియే భావించుట 'అస్మిత'. ఇట్టి అస్మితాక్లేశమువలన పురుషుడు సుఖిని, దుఃఖిని, కర్తను, భోక్తను అని భావిస్తున్నాడు. వివేకఖ్యాతి కలిగిన మరుక్షణము అస్మిత తొల గిపోతుంది. జీవాత్మ తాను బుద్ధికంటె సర్వదా భిన్నుడనని గ్రహించినపుడు అతనికి ముక్తి సిద్ధించుచున్నది. ఉపనిషత్తులలో 'అస్మిత' హృదయ గ్రంధిగా వ్యవహరింపబడింది.

## రాగము :

సుఖమునుగాని సుఖ సాధనాలనుగాని పొందుటకై సుఖస్మరణ పూర్వకముగా ఏర్పడిన చిత్తవృత్తి లేదా అభిలాష రాగము అనబడుతున్నది.

## ద్వేషము :

దుఃఖము ఒకమారు అనుభవించినపుడు దుఃఖస్మృతి యేర్పడుచున్నది. అట్టి స్మృతి వలన దుఃఖమునను భవించిన పురుషుని చిత్తములో క్రోధము అనే వికారము కలుగుచున్నది. దీనినే ద్వేషమని యందురు.

## అభినివేశము :

ప్రతి ప్రాణి తాను చావ గూడదు. తానెల్లప్పుడు జీవించాలని కోరును. మృత్యువంటే యేమిటో ఏమీ తెలియని ప్రాణికి ఇటువంటి కోరిక కలుగజాలదు. అందువలన ప్రతి ప్రాణిలో మరణ భీతి పూర్వజన్మానుభవమును తెలియజేయుచున్నది. ఇట్టి మరణ భయము విజ్ఞులయందే కాక అజ్ఞుల యందు క్రిమికీటాదులయందును ఉన్నట్లు మనం గమనిస్తున్నాము. క్రిమికి మరణ భయమెట్లు కలుగుచున్నది. మరణ దుఃఖ జ్ఞానము ఒకమారు కలిగినప్పుడే అట్టి దుఃఖం తిరిగి రాకుండా ఉండాలనే కోరిక జనించుచున్నది. కావున ప్రాణులకు కలిగే మరణ భయం 'అభినివేశం' అనబడుచున్నది.

ఈ విధముగా అస్మిత రాగద్వేష అభినివేశములను నాల్గింటితో కూడుకొనిన 'అవిద్య'ను పంచపర్వగా యోగులు పేర్కొన్నారు. అంటే అవిద్యావికారములుగా రాగద్వేషాదులను నుడివినారు. అవిద్య కలిగినపుడు రాగద్వేషాదులు కూడ కలుగును. వివేకఖ్యాతి ఏర్పడనందువలన విదేహ ప్రకృతిలయులైనవారి చిత్తములో అస్మితాది క్లేశములు ప్రసుప్తంగా అనగా బీజరూపమున ఉండును. ఆలంబములభించిన మరుక్షణం తిరిగి ప్రబుద్ధములౌను. వివేకఖ్యాతి కలిగినపుడు క్లేశములు దగ్ధబీజములంకురించనట్లు వస్తువు ఆలంబముగా లభించినను ప్రబుద్ధములు కావు. 'సమ్యక్-జ్ఞానము' అవిద్యకు ప్రకృతి పురుష వివేకము అస్మితకు ఉదాసీనత రాగద్వేషములకు ఉపకారబుద్ధి అభినివేశమునకు ప్రతిపక్షములని తలంచి వాటిని పునః పునః అనుసంధించుటవలన అవిద్యాది క్లేశములు క్షీణించిపోవును. అవిద్యాదులలో ఒక క్లేశము సజాతీయముగాను, విజాతీయముగాను ఉన్నప్పుడు

మరియొక క్లేశము ఏర్పడుటచే విచ్ఛిన్న మౌతున్నది. రాగమున్నప్పుడు క్రోధము, క్రోధమున్నప్పుడు రాగము విచ్ఛిన్నమగును. ఒక విషయములో రాగముండగా, మరొక విషయంలో రాగముండదని చెప్పలేము. ఒకవ్యక్తి ఒక స్త్రీయందు రక్తుడైనపుడు, అన్యస్త్రీలందు విరక్తుడని చెప్పలేము. అనురక్తస్త్రీయందు అతనిరాగము లబ్ధవృత్తిగాను, అన్యస్త్రీలయందు భవిష్య ద్వృత్తిగాను ఉంటుంది. ఇట్లు భవిష్యద్వృత్తి గల క్లేశాలు ప్రసుప్తతను విచ్ఛిన్న రూపాలలో ఏదో ఒక రూపమున ఉండునట్లు ఎంచవలెను. ప్రబోధకములు లేనందున సంస్కార రూపమున నుండునది ప్రసుప్తమని, క్రియా-యోగముచేత శిధిలముగావింపబడినవి తనువులని, సజాతీయ విజాతీయ క్లేశాంతరములచే అణగియుండునవి విచ్ఛిన్నములని, విషయ ప్రాప్తి కలిగినపుడు వృత్తి రూపమునొందునవి ఉదారములని, యోగదర్శనము తెలుపుచున్నది. ఇట్లు ప్రసుప్తతను విచ్ఛిన్నోదార భేదమున ఉండే రాగద్వేషాదులకు మూలము అవిద్య యని తెలియవలెను.

'ప్రసుప్తాస్తత్త్వలీనానాం, తన్వవస్థాశ్చ యోగినాం, విచ్ఛిన్నోదార రూపాశ్చ క్లేశా విషయసంగినాం' ప్రకృత్యాది సూక్ష్మ తత్త్వాలలో విలీనులైనట్టి విదేహ ప్రకృతిలయుల క్లేశములు ప్రసుప్తస్థితి యందుండునని క్రియా యోగుల క్లేశములు క్షీణించినందున తనువులై యుండునని, విషయాసక్తుల క్లేశముల విచ్ఛిన్నోదార స్థితియందుండునని గ్రహింపవలయును. పృథివ్యాది పంచభూతములలో ఒకదానిని ఆత్మగా తలచి, దానిని ఉపాసించుచు కేవలము సంస్కార రూపమున మిగిలియున్నట్టి చిత్తముగలవారై స్థూలదేహరహితులై మరణానంతరము తాము భావించిన భూతములలో విలీనతచెందువారు విదేహులనబడుదురు. పంచభూతములు కాకుండ అవ్యక్తము మహత్తత్త్వము అహంకారము పంచతన్మాత్ర లనువాటిలో ఏదో ఒకదానిని ఉపాసిస్తూ తద్వాసనావాసితాంతఃకరణులై, మరణానంతరము ఆ అవ్యక్తాది ప్రకృతి వికారములలో విలీనులై యుంటున్నవారు ప్రకృతి లయులనబడుదురు. వీరికి దేహాదులలో విరక్తి కలిగినను వివేకఖ్యాతి కలుగదు. వైరాగ్యమువల్ల సమాధి ఏర్పడినను, చిత్తము పూర్తిగా నశింపక ప్రకృతియందు విలీనమై ఉంటుంది. వైరాగ్యమూలమున ఒనగూడిన సంస్కార విరోధబలమున్నంత వరకు అట్లే ఉండి తరువాతి జన్మకు హేతువు అగుచున్నది. వివేకఖ్యాతి

కలిగించిన చిత్తము చరితార్థమౌతుంది. వివేకఖ్యాతి కలిగింపని చిత్తము అచరితార్థమై కొంతకాలము ప్రకృతి మహత్తత్త్వాదులలో విలీనముగా ఉండుచు వృత్తిశూన్యత ఏర్పడుటవలన సమాధిలో కైవల్య సుఖమువంటి సుఖమును ఏర్పరచి, నిరోధబలము తొలగిపోగానే తిరిగి జన్మహేతువు అగుచున్నది.

## వికల్పము :

నిర్విషయకమైన శబ్ద జ్ఞానానుపాతియగు చిత్తవృత్తి వికల్పము. వికల్పము విపర్యయముకాదు సంశయము కాదు. ఆకాశకుసుమము, వంధ్యాపుత్రుడు, శశవిషాణము మున్నగు వస్తువులు లేవు. అవిలేకున్నను శబ్దవ్యవహారము మాత్రము ఉండి వస్తువులేకుండా శబ్ద (వ్యవహృతమై) వ్యవహారమువలన ఒకానొక చిత్తవృత్తి యేర్పడుచున్నది. అట్టి చిత్తవృత్తిని వికల్పమని నుడువుదురు. జాగ్రత్స్వప్నాది వృత్త్యభావమున ఏర్పడిన చిత్తవృత్తి నిద్ర, త్రిగుణాత్మకమైన చిత్త సత్త్వమునందు తమోగుణము సత్త్వరజోగుణములను ఆవరించుట వలన అంధకారము వ్యాపించుచున్నది. అప్పుడు బుద్ధి విషయాకారమున పరిణమించదు. ఇట్టి అవస్థను సుషుప్త్యావస్థ యందురు. పురుషుని కప్పుడు అంతస్సంజ్ఞా ఉంటుంది. నిద్ర నుండి మేల్కొని, నేను సుఖముగా మేల్కొన్నాను: నా మనస్సు ప్రశాంతముగా నున్నది. ఇత్యాది వ్యవహారము సుషుప్తియందు పురుషునకు అంతస్సంజ్ఞ ఉన్నదనుటకు ప్రమాణమగుచున్నది. సుషిప్తియందు అట్టి జ్ఞానము లేకుంటే ఇట్టి విమర్శచేకూరదు. కాబట్టి నిద్రయూ, తమోరూప ప్రత్యయ విషయమైన వృత్తి లేదా జ్ఞానమనవలెను. సమాధిలో ఇతర వృత్తులవలె నిద్రావృత్తిని కూడ నిరోధింపవలసియున్నది. సుషిప్తిలో చిత్తసత్త్వము అంధకారాన్ని వెల్లడిస్తూ, పరిణామ రహితమై యున్నందున నిరుద్ధప్రాయ మవుచున్నది. వృత్తి రాహిత్యంవల్ల పురుషుడు సత్వస్థుడై ఆత్మ సుఖము ననుభవించును. సమాధి మోక్షావస్థలందువలె, బ్రహ్మానందమును అనుభవించుచు శోకమును తరించి సుఖించును.

## స్మృతి :

పూర్వము తాను తెలిసికొన్న దానిని తారతమ్యము లేకుండ తెలిసికొనే వృత్తి స్మృతి అనబడుచున్నది. చిత్తము ఏ వస్తువుచేరి, దాని ఆకారమును పొందుచున్నదో ఆ విషయాకారమే చిత్తధనము. అట్టి దానిని

తిరిగి గ్రహించు వృత్తి స్మృతి అనబడుచున్నది. చిత్తము పూర్వ జ్ఞానమును గ్రహించు వాని విషయమును గూడ గ్రహించును. అంటే తదుభయమును గ్రహించును. ప్రమాణాది వృత్తులవల్ల ఏర్పడే ప్రత్యయము, 'విషయ జ్ఞానములు' అను రెండింటికి సంబంధించిన సంస్కారమును ఉదయింపజేయును. ఆ సంస్కారము ఉద్బోధకముద్వారా వ్యక్తమయి ఉభయాత్మక స్థితిని కలిగిస్తుంది. ఘటమును తెలిసికొనుచున్నాను- అన్నచో జ్ఞానము ప్రధానముగా ఉంటున్నది. ఘటము అన్నది స్మృతి. ఆ ఘటమే ఇది యన్నది ప్రత్యభిజ్ఞ. స్వప్నములో భావితస్మర్తవ్యము, జాగరణములో అభావితస్మర్తవ్యము ఉంటున్నందున స్మృతి రెండు విధములగునని గ్రహించవలెను. చిత్తవృత్తుల అనుభూతుల వలన సంస్కారము ఏర్పడుచున్నది. సంస్కారము వలన స్మృతి కలుగుచున్నది. వృతులన్ని సుఖదుఃఖ మోహ రూపములయినందున నిరోధింపతగినవి. అట్టి చిత్తవృత్తినిరోధమునకు యోగదర్శనకర్త ఉపాయములను తెల్పినాడు.

## చిత్తవృత్తి నిరోధోపాయములు:

చిత్తవృత్తుల నిరోధమునకు అభ్యస, వైరాగ్యములనే రెండు ఉపాయములు కలవు. వైరాగ్యమువలన చిత్తవృత్తి నిరోధం ఏర్పడుచున్నది అభ్యాసము చిత్తవృత్తి నిరోధమును ఏర్పరచుచున్నది. చిత్తము ఒక నది వంటిది. అది కైవల్యాభిముఖము అయినపుడు వివేక విషయమనే నిమ్నమార్గమున ప్రయాణిస్తున్నది. ఆ నది సంసారాభిముఖమైనచో అవివేకమార్గమున ప్రవహిస్తుందని, యోగసూత్రభాష్యకర్త పేర్కొన్నాడు. వైరాగ్యం విషయాభిరతిని శిథిల పరుస్తూ, వివేకఖ్యాతిని ఒనగూరుస్తుంది. అభ్యాసము ఆస్థితిని స్థిరపరుస్తుంది. వైరాగ్య మూలంగా చిత్తవృత్తులు నిరుద్ధమైనప్పుడు ఏకాగ్రత కోసం యమనియమాది సాధనలద్వారా చిత్తమును స్థిరముగా ఉంచుటకై కావించే ప్రబల ప్రయత్నము అభ్యాసమనబడుచున్నది. చిత్తమును బాహ్యా ప్రపంచమునందు ప్రసరింపకుండునట్లు చేసే ప్రయత్నం, మరణపు పర్యంతం నిరంతరము చేయవలెను. తపస్సు బ్రహ్మచర్యము శ్రద్ధ ఇందులో తోడ్పడును. అట్లు అభ్యాసము చేయకున్నచో చిత్త నిరోధము స్థిరపడదు.

## వైరాగ్యము :

## వైరాగ్యము :

ఐహిక విషయముల యందును పారలౌకిక విషయములందును ఆశలుడిగిన యట్టి యోగి యొక్క చిత్తస్థితి అనగా దివ్యాదివ్యముల నాకాంక్షింపనట్టి బుద్ధి వైరాగ్యము అనబడు చున్నది. స్త్రీలు, అన్నపానాది వైభవములు ఐహికములు. ఇవి దృష్టవిషయములు. వేదాదులు చెప్పగా నేర్చుకొన్నవి. అనుశ్రవికములు. ఇవి యన్నియు పరిణామములను చెందుచు ఒక్క క్షణములో సరసముగా ఉంటూ ఉత్తర క్షణములో విరసములై దోషమూలములయినందున యోగి కాదలచినవాడు వాటి యందు విరాగముచెందును. వాటిని తాపత్రయావహములుగా గ్రహించును. అప్పుడు అతనికి విషయములపట్ల అపేక్ష తొలగిపోతుంది. ఉపేక్షాబుద్ధి ఏర్పడుచున్నది. దీనిని ప్రసంఖ్యానమని యందురు. ఇట్టి వితృష్ణ వశీకార మనబడుచున్నది. దీనికే వైరాగ్యమని నామాంతరము. వైరాగ్యము నాల్గు విధముల ఉండును. యతమాన సంజ్ఞ, వ్యతిరేక సంజ్ఞ, ఏకేంద్రియ సంజ్ఞ, వశీకార సంజ్ఞ. చిత్తమందుండే అనురాగాది మలములు ఇంద్రియాలను తమతమ విషయములందు ప్రవర్తింపకుండునట్లు కావించే ప్రయత్నం, యతమానసంజ్ఞ వైరాగ్యం అనబడుచున్నది. ఇట్లు ప్రయత్నింపగా చిత్తమందుండే రాగాదిమలములు కొన్ని పక్వములై యుండగా, కొన్ని పక్వము కావలసియుండును. పక్వము కావలసిన వానికంటె పక్వములైన వానిని వ్యతిరేకముగా నిర్ణయించుట వ్యతిరేక సంజ్ఞ వైరాగ్యము. పక్వములైన మలములు ఇంద్రియాలను విషయాలవైపు ప్రవర్తింపజేసే సమర్థత లేనట్టి స్థితిలో చిత్తమందణగియుండుట ఏకేంద్రియ సంజ్ఞ వైరాగ్యము, దివ్యాదివ్య విషయములు సన్నిహితముగా ఉన్నను వాటిని ఉపేక్షించుట వశీకారసంజ్ఞ వైరాగ్యము. ఇదే అపర వైరాగ్యమనబడుచున్నది. దీనికి పూర్వమునమన్న వైరాగ్యములు సిద్ధింపకున్నచో వశీకారసంజ్ఞ వైరాగ్యమనే అపరవైరాగ్యము కలుగదు. అపరవైరాగ్యమువలన రాజస తామస చిత్తవృత్తులు నిరుద్ధము లయినందున సంప్రజ్ఞాత సమాధి ఏర్పడుచున్నది. కావున సంప్రజ్ఞాత సమాధికి అపరవైరాగ్యము ముఖ్యకారణమనబడుచున్నది.

ఐహికాముష్మిక విషయాలలో నుండే దోషములను గ్రహించి వాటినుండి చిత్తమును మరలించుకొని యోగసాధకుడు విరక్తుడగును. విరాగమువలన

సత్త్వవృత్తి యేర్పడుటచే ఆచార్యోపదేశాదుల ద్వారా ఆత్మ సాక్షాత్కారము సాధించుటకు అభ్యాసము కావించును. ఇట్టి సాత్త్వికవృత్తిచే ప్రకృతి పురుష అన్యతాఖ్యాతి అనగా ప్రకృతి పురుష వివేక జ్ఞానము ఉదయించుచున్నది. పురుషుడు శుద్ధుడు. గుణములు ప్రకృతి ధర్మములు, పురుష విరుద్ధములు, మలినములని తెలిసికొని గుణములనుండి విరక్తుడగును. ఇట్టి స్థితిని ధర్మ మేఘ సమాధియందురు. 'ధర్మం మేహతి' ఇతి ధర్మమేఘం అని వ్యుత్పత్తి. ధర్మమును వర్షించు యోగము, ధర్మేఘసమాధి యనబడుచున్నది. సంప్ర జ్ఞాత సమాధికి ఫలము వివేకఖ్యాతి. దాని పరమావధియే ధర్మమేఘసమాధి. ధర్మమేఘసమాధి వలన జ్ఞాన ప్రసాదమనే పరవైరాగ్య ముదయించు చున్నది. పరవైరాగ్యము వలన వివేకఖ్యాతి నిరుద్ధ మగుచున్నది. అటుపిమ్మట నిర్బీజసమాధి చేకూరుచున్నది. యోగికి ప్రకృతి పురుషులలోగల భేదమును పూర్ణముగా గ్రహించే జ్ఞానము శుద్ధసాత్త్విక వృత్తి అనబడుచున్నది. ఇది కూడ ప్రకృతి వికారమేయని దానినుండి విరక్తుడగును. ఇట్లు అపరవైరాగ్య మున రాజస తామస వృత్తులనుండి విరక్తుడై, పరవైరాగ్యము మూలమున సాత్త్విక వృత్తినుండియు విరక్తుడగును. పరవైరాగ్యముద్వారా వివేకజ్ఞానము కలవాడై పొందదగినది పొందితిని, క్షీణింపదగిన అవిద్యాదిక్లేశములు క్షీణిం చినవి, ధర్మాధర్మ సంస్కార సమూహాలంబనం వలన సంభవించే జన్మ పరంపర తెగిపోయినదని గ్రహించును. ఇట్లు ఏర్పడిన జ్ఞానము యొక్క పరాకాష్ఠయే పరవైరాగ్యము.

## సమాధి :

భాష్యకర్త యోగమును చిత్తనిరోధమువల్ల సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాత భేద మున రెండు విధములని తెల్పెను. ధర్మాధర్మ బంధములు శిథిలముకాగా క్లేశములన్నియు క్షీణించిపోగా వస్తుయథార్థరూపం ప్రకాశితమగుటకు కావించే సమాధి సంప్రజ్ఞాత సమాధి అనబడుచున్నది. దీనిని సబీజ సమాధి యనియు నుడువుదురు. చిత్తం సమాహితం కావటానికి ఏదో ఒకటి బీజం లేదా ఆలంబనం కావలసివచ్చుచున్నది. అప్పుడుగాని చిత్తవృత్తుల నిరోధము సాధ్యపడదు. అసంప్రజ్ఞాత సమాధిలో ఏదియు ఆలంబనముగా ఉండదు. ధ్యాతధ్యేయము రెండు ఉండవు. స్ఫటికము స్వచ్ఛంగా ఉన్నప్పుడు దాని

దగ్గరగా నున్న రంగుపూల కాంతి ఆ స్ఫటికంపై ప్రసరిస్తుంది. ఏ రంగు పడినపుడు ఆ రంగులో స్ఫటికం గోచరిస్తుంది. అట్లే చిత్త సత్త్వం స్ఫటికం వంటిది. రజస్తమోగుణ ప్రభావం పడినపుడు వాటి వృత్తులు ఆ చిత్తసత్త్వమునకు సంక్రమించును. అభ్యాసాదుల మూలమున చిత్త మందలి రాజస తామస వృత్తులు నశించిపోగా ఆచిత్తం సత్త్వ గుణంతో క్రమంగా రూపరసాది విషయములందును వానిని గ్రహించే ఇంద్రియములందును గ్రహీతయనబడే అస్మితయందును నిల్చబడి వాటి ఆకారముకలదిగా ప్రకాశించును. అపుడు చిత్తమందు రాజస తామస వృత్తులుండవు. సాత్త్విక వృత్తియే ఉండును. అభ్యాసి పూర్వము శబ్దాది స్థూలవిషయములందు అట్టి వృత్తిని సంపాదించును. అటు పిదప సూక్ష్మములైన ఇంద్రియాలయందు చిత్తము నిల్పివాటి ఆకృతిని సంపాదించును. అటుపిదప అంతకంటే సూక్ష్మమైన చిత్తవృత్తులు తనవే అనుకొనే స్థితయందే 'అస్మిత' యందు చిత్తమును నిల్పి ఆ చిత్తమునకు అస్మితాకారతను సంపాదించును. ఇట్లు 'శబ్దాది విషయములకు, తదింద్రియములకు, అస్మితకు సంబంధించిన చిత్తముయొక్క సాత్త్విక పరిణామము సంప్రజ్ఞాత సమాధియనబడుతుంది. శబ్దాదివిషయాలు గ్రహింపతగినవి కావున వీటికి గ్రాహ్యములని పేరు. గ్రాహ్యం స్థూలరూపముగాను సూక్ష్మరూపముగాను ఉంటుంది. స్థూలములైన గ్రాహ్య విషయాలయందు ఏర్పడే చిత్త సాత్త్విక పరిణామము, వితర్కానుగత సంప్రజ్ఞాత సమాధి అనబడుచున్నది. సూక్ష్మములైన గ్రాహ్యవిషయములయందు ఏర్పడిన చిత్తిసాత్త్విక పరిణామము విచారానుగత సంప్రజ్ఞాత సమాధి అనబడుచున్నది.

విషయాలను, ఇంద్రియాలు గ్రహించుచున్నవి. కాబట్టి ఇంద్రియాలకు గ్రహణములని పేరు. చక్షురాది గ్రహణముల యందు చిత్తము నిల్పినపుడు అందు ఏర్పడిన చిత్తసాత్త్విక పరిణామము ఆనందానుగత సంప్రజ్ఞాత సమాధి. విషయాదులను గ్రహించు దృక్ దర్శనశక్తుల ఏకాత్మతా రూపమయిన 'అస్మిత' గ్రహీతయనబడుచున్నది. గ్రహీతయనబడే ఆ అస్మిత యందు చిత్తము నిల్పగా ఏర్పడిన అస్మితాకార సాత్త్విక పరిణామము. 'అస్మితానుగత సంప్రజ్ఞాత సమాధి' అని అనబడుచున్నది. ఈ విధముగా సంప్రజ్ఞాత సమాధి, నాల్గు విధముల యున్నది.

అభ్యాస వైరాగ్యముల ద్వారా స్థిరపడిన చిత్తము యొక్క సమాధికి సమాపత్తి యని పేరు. విషయభేదమున సమాపత్తి గ్రహీతృ విషయ, గ్రహణ విషయ, గ్రాహ్య విషయ - అని మూడు విధములు. అందు గ్రాహ్య విషయ సమాపత్తి వితర్కానుగత విచారానుగత యని రెండు విధములు. చిత్తవృత్తి పాంచభౌతికములైన స్థూల విషయాలను ఆలంబనం చేసుకొనినపుడు వితర్కానుగత సంప్రజ్ఞాత సమాధి యని యందురు. ఇది సవితర్క నిర్వితర్కయని రెండు రకాలు. చిత్తము సూక్ష్మ విషయాలను ఆలంబనం చేసుకొనినపుడు దానిని విచారానుగత సంప్రజ్ఞాత సమాధి యని యందురు. ఇదియు సవిచార, నిర్విచార భేదమున రెండు విధములు. ఈ విధముగా గ్రాహ్య విషయకసమాపత్తి సవితర్క నిర్వితర్క సవిచార నిర్విచార యని 4 విధములు.

## సవితర్క :

'శబ్దార్థజ్ఞాన వికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తిః' శ్రోత్రేంద్రియ గ్రాహ్యమైన ధ్వని యొక్క పరిణామ భేదమైన శబ్దమునకు ఘటత్వ గోత్వాది సామాన్య జాతికి ఆశ్రమమైన వ్యక్తి అర్థము. తద్ వ్యక్తి విషయకమైన శబ్దం వలన కలిగిన బుద్ధి వృత్తి జ్ఞానమనబడుతుంది. చిత్తవృత్తికి బాహ్యంగా ఉండే గ్రాహ్యములైన స్థూలములైన గోవు ఘటము మున్నగు వస్తువులు, విషయములై నపుడు ఆ గోఘటాది విషయములు స్వవాచక శబ్దము, స్వవిషయక జ్ఞానము అనువాటితో గూడి నీరక్షీరములవలె అభిన్నములుగా భాసిస్తుంది. లోకములో వస్తువులన్నీ శబ్దములచే పేర్కొనబడును. అట్లే పేర్కొనిన వారికి ఆ వస్తువులకు, తద్వాచక శబ్దములకు గల సంబంధము పరిచితమైయుండును. నిత్యవ్యవహారములో వస్తువు తెలిసినపుడు దానిని తెలిపే పదము ఆ పదమునకు వస్తువుతోగల సంబంధము ఈ పదమునకు ఈ అర్థమను జ్ఞానము తెలిసియుండును. ఇవియన్నియు వేర్వేరుగా ఉండక అన్నీ కలిసి ఒకే క్షణమున భాసిల్లుచున్నట్లుండును. రాజస తామస వృత్తులు లేనట్టి కేవల సాత్త్విక వృత్తి చిత్తమున నున్నపుడు ఇట్టి శబ్దార్థ జ్ఞానములతో గూడిన బాహ్యస్థూల విషయక భావము సవితర్క సంప్రజ్ఞాత సమాధి అనబడుచున్నది.

సవితర్క సమాధి యందు ప్రతిభాసించు స్థూల వస్తువునందు వృద్ధ వ్యవహారాదుల వలన తెలియుచున్న శబ్ద శక్తికి సంబంధించిన స్మృతితోబాటు శబ్దము, జ్ఞానము కలిసియుండును. నిర్వికల్పసమాధి యందు అభిధావృత్తియనే సంకేత స్మృతి ఉండదు. అప్పుడు 'వస్తు బోధకమైన పదము ఆ వస్తువు ఇదనే జ్ఞానము' అను రెండు కూడా అస్ఫుటంగా భాసిల్లుచుండును. వస్తువు మాత్రం స్ఫుటముగా భాసిస్తున్నది. శబ్ద జ్ఞాన సంకేత స్మృతులు అస్ఫుటంగా ఉండును. ఇట్టి శుద్ధ సాత్త్విక చిత్తవృత్తియే నిర్వికల్పమై అర్థము మాత్రము భాసిస్తున్నది. కాబట్టి ఈ సమాపత్తి పరప్రత్యక్ష మనబడుచున్నది. సమాధి సిద్ధులయిన ఆచార్యులు సద్రూపమైన అర్థమును సాక్షాత్కరించుకొందురు. శబ్దజ్ఞానములతో ఉపదేశింతురు. స్థూలగ్రాహ్యవస్తువులకు కారణములు స్థూలములైన పంచభూతములు. ఆ స్థూలపంచభూతములకు సూక్ష్మకారణములు పంచతన్మాత్రలు. పంచతన్మాత్రలవలన ఆయా దేశ కాలములలో స్థూలములయిన ఘటపటాది వస్తువులు అభివ్యక్తములగును. కావున సూక్ష్మగ్రాహ్యములగు తన్మాత్రలయందు ఏర్పడిన శబ్దార్థజ్ఞానములతో కూడిన శుద్ధసాత్త్విక చిత్త వృత్తి సవిచార సంప్రజ్ఞాత సమాధి అనబడుచున్నది. దేశ కాల కారణముల అనుభవములతో అసంపృక్తమై అభివ్యక్తములగు ఘటపటాదులు ధర్మముగా గల సూక్ష్మగ్రాహ్య విషయములయందు శబ్దార్థజ్ఞాన మిశ్రముగాకుండా కేవల తన్మాత్ర రూపమయిన అర్థమును భాసింపచేసే సాత్త్వికవృత్తి, నిర్విచార సంప్రజ్ఞాత సమాధి యనబడుచున్నది. సవిచార నిర్విచార సంప్రజ్ఞాత సమాధుల యందు చిత్తము సూక్ష్మభూతములయిన పంచతన్మాత్రలయందు నిలుపబడుచున్నది. పంచతన్మాత్రల కంటె సూక్ష్మమయినది అహంకారము. దానికంటె సూక్ష్మము మహత్తత్త్వము. అంతకంటె సూక్ష్మము ప్రధానము లేదా మూల ప్రకృతి. ఇట్లు యోగి పంచతన్మాత్రలకంటె సూక్ష్మాతి సూక్ష్మములయిన అహంకారాదులుయందు క్రమంగా చిత్తమును నిలుపుచు అన్నిటికంటె సూక్ష్మమయిన ప్రధానమునందును చిత్తము నిలిపి సంప్రజ్ఞాత సమాధిని సంపాదించును. కావున ఈ నాలుగు సమాధులలో ఏదో ఒకటి ఆలంబనముగా ఉన్నందున దీనికి సబీజ సమాధి యని పేరు వచ్చినది. తన్మాత్రలు మొదలుకొని మూల ప్రకృతి పర్యంతము సూక్ష్మ విషయములయందు రాజస తామస మాలిన్య రహితమయిన చిత్తసత్త్వ ప్రవాహము

స్థిరమైనపుడు లేదా నిర్విచార వైశారద్యము ఏర్పడినపుడు యోగి వ్యవహితము విప్రకృష్టము స్థూలము, సూక్ష్మము, సామాన్యము విశేషము అను భేదము లేకుండా అన్ని వస్తువుల సాక్షాత్కారము చెందును. ఇది ఒక విశిష్టచిత్తవృత్తి. దీనిని స్ఫుట ప్రజ్ఞాలోకము ప్రజ్ఞాప్రసాదము నిర్విచార సమాధి అని నుడువుదురు. నిర్విచార సమాధి వలన ఏర్పడే వైశారద్యము సత్త్వపురుషాన్యతాఖ్యాతికి పరమోపాయముగా ఉంటున్నది. దీనికంటె ప్రకృతి పురుష వివేకమునకు వేరే ఉపాయము లేదు. నిర్విచార వైశారద్యమును పొంది అధ్యాత్మప్రసాదము కలవాడైన యోగి ప్రకృతిని దాని కార్యపరంపరను వివిక్తంగా తెలిసికొని వాటి అన్నిటి కంటె జీవాత్మభిన్నుడని తెలిసికొనును. అందువలన అధ్యాత్మప్రసాదము స్ఫుటప్రజ్ఞా లోకము ప్రజ్ఞాప్రసాదము సమాధి ప్రజ్ఞ ఋతంభరాప్రజ్ఞ సత్త్వ పురుషాన్యతాఖ్యాతి ఇత్యాది నామములతో నిర్విచార సంప్రజ్ఞాత సమాపత్తి పేర్కొనబడుచున్నది. ఇతర సమాపత్తులకంటె నిర్విచార సమాపత్తి ఉత్తమముగా కీర్తింపబడినది. చిరకాలమునుండి శబ్దాది విషయములను అనుభవించుటచే ఏర్పడిన సంస్కారములు ప్రత్యక్షాదివృత్తుల ద్వారా రేకెత్తుచుండును. కాని వస్తుతత్త్వము తెలియక ఏర్పడిన సంస్కారములగుటచే అవి బలహీనములై సమాధి ప్రజ్ఞాజన్య ప్రబలసంస్కారముచే అభిభూతములగును అందువలన అవి ఉద్దీప్తము కావు. వానివలన కలుగు జ్ఞానములు నిరుద్ధములగును. సమాధి ప్రజ్ఞ వలన కలిగిన సంస్కారము క్రమముగా స్థిరపడుటచే సంసారమునకు నిమిత్తములైన క్లేశకర్మాదివాసనలు బొత్తిగా నిరోధింపబడును. క్లేశకర్మాది వాసనలు నిరోధింపబడినను సమాధి ప్రజ్ఞా మూలమున ఏర్పడిన సంస్కారము ఉండును. సంస్కారవంతమగు చిత్తము రెండు పనులను నిర్వహించును. 1. శబ్దాది విషయ భోగములను కలిగించుట 2. వివేక ఖ్యాతిని కల్పించుట. క్లేశకర్మాది సంస్కారయుక్తమైన చిత్తము శబ్దాది విషయముల ననుభవింప జేయును. అట్టి వాసనలు నిరుద్ధములగుటచో శబ్దాదుల ననుభవింపజేయజాలక సంసారహేతువు కాజాలదు. సమాధిప్రజ్ఞాజన్య సంస్కారములతో కూడిన చిత్తము వివేకఖ్యాతిని ఒనగూర్చును. ఇవి రెండు చిత్తకార్యములు. ఈ రెండు చిత్త కార్యములు ముగియుటచే చిత్తము సాధికారము కాదు. సాధికార చిత్తమే సంసారహేతువని గ్రహింపవలయును. నిర్విచార వైశారద్యం వలన పరవైరాగ్యము

ఏర్పడును. అందువలన సంప్రజ్ఞాత సమాధి వలన కలిగిన ప్రజ్ఞ, ఆ ప్రజ్ఞచే చేకూరిన సంస్కారము నశించిపోవును. ఇట్లు సంస్కారములన్ని విలయము చెందగా నున్నట్టి చిత్తస్థితి అసంప్రజ్ఞాత సమాధి. దీనికే నిర్వికల్ప సమాధి అని పేరు. దీనిని నిర్బీజ సమాధి అందురు. వాసనలనే బీజములు లేకుండా నిరాలంబంగా ఉండుటవలన ఇట్టి సమాధికి నిర్బీజ సమాధి యనియు వ్యవహారము కలదు.

## పరిణామము

అవస్థాంతరమును గ్రహించుట పరిణామము. పరిణామములో పూర్వధర్మము తొలగి ఉత్తర ధర్మమేర్పడును. అసంప్రజ్ఞాత సమాధి ఉదయించునపుడు ప్రతిక్షణం వ్యుత్థానసంస్కారము క్షీణించును. నిరోధ సంస్కారము అనుక్షణం అభ్యుదయము నందుచున్నది. ఈ సమయములో నిరోధ చిత్తము నిరోధాఖ్య ధర్మపరిణామమున కాశ్రయమైనందున నిరోధ పరిణామ మనబడుచున్నది. ప్రతి నిరోధ క్షణములోను స్థిరమైన చిత్తమున ధర్మముగా నన్వితమయ్యే వ్యుత్థాన సంస్కారములయొక్క క్షయము నిరోధ సంస్కారముల ఉదయము అనునవి రెండు నిరోధపరిణామములుగా పిలువబడునని గ్రాహ్యము. ఆత్మ తప్ప మిగిలిన భావ పదార్థములన్నీ ప్రతిక్షణము మార్పునొందునట్టివి. అట్లుమారే ప్రతి భావ పదార్థము యొక్క పరిణామము ధర్మలక్షణ అవస్థాభేదమున త్రివిధము. ధర్మియందు పూర్వధర్మము క్షీణించి మరొక ధర్మముదయించుట ధర్మపరిణామము. ఇందు పూర్వధర్మ తిరోభావము ఉత్తరధర్మ ఆవిర్భావము ఉంటున్నది. మృత్తిక ఘటరూపమున పరిణమించునపుడు మృత్ పిండము యొక్క ధర్మము తిరోహితమై ఘట ధర్మమభివ్యక్తమౌతున్నది. ఇట్టి దానిని ధర్మపరిణామమందురు. కాలమును బట్టి యేర్పడే పరిణామమునకు లక్షణ పరిణామమని పేరు. లక్షణ పరిణామము మూడు విధములు. అతీతము, అనాగతము, వర్తమానము అని. ఉదయించిన ధర్మమునకు భవిష్యత్కాలిక మనెడి లక్షణము తొలగి వర్తమానమనెడి లక్షణము ఏర్పడుచున్నది. వర్తమాన కాలములో ఆ ధర్మము అభివ్యక్తమగుటకు పూర్వము భవిష్యత్కాల లక్షణము నిగూఢమై యున్నది. కావున దీనిని అనాగత లక్షణపరిణామ మందురు. అదే ధర్మము భవిష్య

త్కాలమును తొలగించుకొని వర్తమానకాలములో అభివ్యక్తమగుట వర్తమాన లక్షణ పరిణామము. వర్తమాన కాలాన్ని విడిచిపెట్టి భూతకాలమున పరిణమించుట అతీత లక్షణ పరిణామము. కుండ ఏర్పడుటకు పూర్వము మృత్తికలో ఇమిడి యుండుట అనాగత పరిణామము. ఆ మృత్పిండము ఘటరూపమున అభివ్యక్తమయినపుడు వర్తమాన లక్షణ పరిణామమగును. అది వర్తమాన కాలాంశమును విడిచి భూతకాలములో ఇమిడిపోయినపుడు అతీత లక్షణ పరిణామము. ఇట్లు వస్తు ధర్మము కాలత్రయానుసారము పరిణమించుట లక్షణ పరిణామమని తాత్పర్యము.

ఒక అవస్థను విడిచి మరొక అవస్థను పొందుట అవస్థాపరిణామము. ధర్మపరిణామమునందు లక్షణ పరిణామమందు గల క్రమము ప్రత్యక్షమగును. కాని అవస్థాపరిణామమందలి క్రమము స్ఫుటముగా గోచరింపదు. ఒక ధర్మియందు పూర్వ ధర్మము పోయి క్రొత్త ధర్మము కలుగుటయే అవస్థ. అట్లే ఒక ధర్మమున లక్షణాంతర మేర్పడుటయు అవస్థయే యగును. కాబట్టి పరిణామములన్నా అవస్థా మాత్రమైనను సూక్ష్మ భేదముమ గమనించి యోగులు పరిణామమును త్రివిధమన్నారు. పృథివ్యాది పంచభూతములు ధర్మి రూపమున నున్నప్పుడు వారి నుండి యేర్పడు గోమనుష్యాది శరీరములు ఘటపటాది వస్తురూపములు ఎన్నో ప్రాదుర్భావ తిరోభావము లొందుచున్నవి. ఇట్లు వాటి పూర్వరూపము తొలగి క్రొత్తరూపమేర్పడుట ధర్మ పరిణామము. ఆ ధర్మములకు అతీత వర్తమాన అనాగత లక్షణములు సిద్ధించుట లక్షణ పరిణామము. వర్తమానాది లక్షణములు గల ఘటపటాది ధర్మముల యందు ప్రాతక్రొత్తదనములు, గోమనుష్యాది ప్రాణి శరీరములయందు, బాల్యయౌవన మందేర్పడుట అవస్థాపరిణామ మగునని తాత్పర్యము. ధర్మ లక్షణాది పరిణామములలో ప్రతిది అనేక భేదములతో నుండును. దానికి కారణము వాటి పరిణామమందలి పౌర్వాపర్యక్రమభేదము. మృత్తిక వలన మృత్పిండము, దాని వలన కపాలములు, కపాలముల వలన ఘట మేర్పడును. మృత్తిక, పిండకపాలములు, కపాల. ఘటములు అనువాటిలో ఒకటి పూర్వమైతే మరొకటి పరమౌతున్నది. ఇట్టి పూర్వాపరక్రమము మృత్పిండాదులకంటే భిన్నము. ఇది పిండాదులైన ధర్మ పరిణామములలోని భేదమునకు కారణము అనాగతమనెడి లక్షణముగల ధర్మ

మునకు వర్తమానమనేడి లక్షణము లభించుట, వర్తమాన లక్షణమను ధర్మమునకు అతీతలక్షణము సిద్ధించుటయు సంభవము. ఇట్లు అనాగత వర్తమాన లక్షణ పరిణామములు పూర్వాపరములైనందున వాని క్రమము వానిలో గల భేదమునకు కారణమగును.

## చిత్తప్రసాదము :

యోగమార్గమున ప్రవేశింపదలచిన వానికి మొదట చిత్తప్రసాదము అవసరము. చిత్తప్రసన్నత లేకుండ క్రియాయోగమున ప్రవృత్తి చేకూరదు. శాస్త్రములలో చిత్తప్రసాదమునకు పలు ఉపాయములు తెల్పబడినవి. రాగద్వేషాదులు చిత్తమలములు. ఈ మలములు కడిగివేయబడినపుడుగాని చిత్తము నిర్మలముగా ఉండదు. చిత్తమల పరిష్కారార్థము మహర్షి పతంజలి ఎన్నో ఉపాయములను తెల్పినాడు. 'మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్యవిషయాణాం భావనాతః చిత్తప్రసాదనం'. సుఖులపట్ల సౌహార్దము అప్తులపట్ల కారుణ్యమును, పుణ్యాత్ములపట్ల సంతోషము, పాపుల పట్ల ఉపేక్షను, కలిగియున్నపుడు చిత్తము ప్రసన్నమగును. చిత్తమునందున్న కాలుష్యము తొలగుటయే చిత్తప్రసాదము. చిత్తమందు ఈర్ష్య, పరావకారబుద్ధి, అసూయ, అసహనము అను 4 కాలుష్యములుండును. వీటిలో సుఖించెడి వారిని జూచి వారితో మిత్రభావము నెరవుట వలన ఈర్ష్య అనే కాలుష్యము తొలగిపోవుచున్నది. సుఖియైన మిత్రుని జూచినపుడు నిజమైన మిత్రునకు ఈర్ష్య ఉండదు. అట్లే మిత్రామిత్రవివక్ష లేకుండా ఎల్లప్రాణులపట్ల మిత్రభావమును నెరపినచో ఈర్ష్య కలుగ జాలదు. దుఃఖించే ప్రాణులను చూచి వారిని ఏవగించుకొనక వీరి దుఃఖ మెట్లు తొలగిపోవును అని కారుణ్య బుద్ధితో నుండువానికి పరావరకార బుద్ధి యనే కాలుష్యము తొలగిపోవుచున్నది. తనకంటె విద్యావంతులను చూచినపుడు అసూయ కలుగుట సహజము. తాను వారివలె పుణ్యము చేయలేకపోయితినని; తనను తానే పరిశీలించుకొన్నపుడు ఇతరులపట్ల అసూయ కలుగదు. ఇక పాపులను అధములను జూచినపుడు అమర్ష లేదా అసహనము కలుగుచున్నది. వారిపట్ల ఉదాసీనముగా నుండు వానికి అమర్షయనే చిత్తకాలుష్యము పరిమ్రష్టమగుచున్నది. యోగము నభ్యసించెడివాడు ఈశ్వర ప్రణిధానార్థము తన

చిత్తమందలి ఈర్ష్యాది కాలుష్యములను తొలగింపదలచి మైత్ర్యాది చిత్తప్రసాదనోపాయముల ననుష్ఠించును. అపుడుగాని వాని చిత్తము ప్రసన్నమగును. ప్రసన్నమైన చిత్తమందు శుక్లధర్మమైన సత్త్వగుణము వెంపొందును. అప్పుడు ఈశ్వర ప్రణిధానము సులభసాధ్యమగును.

## కర్మవాసనలు :

ఆశయములనగా కర్మవాసనలు. ఇవి క్లేశముల వలన ఏర్పడుచున్నవి. దృష్టము అదృష్టము అని జన్మము ద్వివిధము. ఐహికము లేదా వర్తమానము దృష్టజన్మము. భవిష్యత్కాలికము అదృష్ట జన్మము. ఇట్టి ఐహికాముష్మిక జన్మలలో సుఖదుఃఖాల ననుభవింపజేసే కర్మాశయములు క్లేశములవలన ఏర్పడుచున్నవి. కర్మాశయము తొలగిపోవలయునన్న క్లేశములను బొత్తిగా విడనాడవలయును. కర్మాశయములకు క్లేశములు మూలము. మూలమున్నంత కాలము కర్మాశయము విపాకమును లేదా సుఖదుఃఖ ఫలమును కలిగించును. మూలము భిన్నమైనచో చెట్టు చిగురించనట్లు వివేకఖ్యాతి వలన క్లేశమను మూలము నశింపగా కర్మాశయము అనంతముగా నున్నను, అది నిష్ప్రయోజకమగును. జాత్యాయుర్భోగములు కర్మఫలములు. కర్మయనునది జన్మకు కారణమా? అనేక జన్మలకు కారణమా? అట్లే అనేక కర్మలు అనేక జన్మలను కల్గించునా? ఒక జన్మను కలిగించునా? అన్నవి చర్చింపవలసియున్నవి. ఒక కర్మ ఒక జన్మకు కారణము అనరాదు. అనాది కాలమునుండి సంచితకర్మ లెన్నో ఉన్నవి. ఈ జన్మ మందును చేయబడిన కర్మలనేకములు కలవు. ఇవియన్నియు క్రమముగా ఒక్కొక్కటి ఒక్కొక్క జన్మకు కారణములైన పక్షమున జన్మమునకు అంతమంటూ ఉండదు. అంతేకాదు ముక్తి కాంక్ష కూడ అసంభవము. ఇట్లే ఒక్క కర్మ అనేక జన్మములకు కారణమందుమేని ఒక్క కర్మ ఫలమే అనేక జన్మములయినచో మిగిలిన కర్మల యొక్క ఫలానుభవములకు కాలమే సరిపోదు. అనేక కర్మలు అనేక జన్మలను ఒక్కసారి కల్గించుననుటయు పొసగదు. ఒకే క్షణమున అనేక జన్మములు కలుగవుకదా! అందువలన క్రమముగా ఒకదాని తరువాత మరియొక జన్మ కలుగవలసియుండును. అప్పుడొక్క కర్మకు ఫలముగా నొక్క జన్మయే యగును. ఇందు పూర్వ దోషమే యేర్పడుచు

న్నది. అనేక కర్మలు కలిసి ఒక్క జన్మను కలిగించునని ఊహింపవలయును. ఒక్క జన్మలో మరణించుటకు పూర్వము చేయబడిన పుణ్యాపుణ్యకర్మ వాస నలు జీవాత్మ విశిష్టమైన చిత్తమునందేర్పడి చిత్రములై మరణ సమయమున కొన్ని ప్రాధాన్యమును మరికొన్ని అప్రాధాన్యమును పొంది అభివ్యక్తములగును. వాటిలో కొన్ని వెంటనే ఫలమిచ్చునవి కాగా మరికొన్ని కాలాంతరమున ఫలమొసంగునవిగా ఉండును. కర్మల స్వభావమే ఇట్టిది. కాలభేదముచే ఫలము ఇచ్చుట ననుసరించి వీనికి ప్రాధాన్య - అప్రాధాన్య భావము కల్పిం పబడుచున్నది. తమతమ ఫలములను అనుభవింపజేయుటలో సంపృక్తములైన ఈ సంస్కారములు అన్నియు కలిసి, జననమరణములను ఏర్పరచుచున్నవి. జన్మము లబ్ధాయుష్కమనుటకు 'ఆ విచిత్రవాసనా స్రోతస్సే' కారణము. భోగము ఆ కర్మ సముదాయము వలననే సంభవించునవి కాబట్టి కర్మా శయము జన్మాయుర్భోగ హేతువై త్రివిపాకమగునని యోగ సూత్రభాష్య కర్త తెలిపినాడు.

ధర్మమూలకములైన జన్మాదులు సుఖదాయకములైనట్లే అధర్మమూలక జన్మాదులు దుఃఖము నొనగూర్చును. వాస్తవముగా దుఃఖమువలె సుఖము కూడా హేయమగును. చేతన పదార్థముల వలనగాని, అచేతన పదార్థముల వలనగాని కలిగే సుఖము రాగముతో కూడియుండును. రక్తి లేనిచో సుఖానుభూతి కలదు. రాగము ప్రవృత్తికి కారణము. ప్రవృత్తి వలన పుణ్యాపాపములు ఏర్పడును. అందువలన రాగము వలన యేర్పడే కర్మా శయములు (వాసనలు) కాయిక వాచిక మానసిక భేదమున త్రివిధము. సుఖం కొరకు ఇది చేయవలసినది అని సంకల్పించుటచే మానసిక వాసన ఏర్పడుచున్నది. మనస్సులో సంకల్పించిన దానిని చెప్పటవలన వాచిక వాసన కలుగుచున్నది. ఆ చెప్పిన దానిని వదలించుటవలన కాయిక వాసన సంభవి స్తుంది. ఇట్లు సక్తుడైన మనుజుడు సుఖము ననుభవించును. సుఖ విచ్ఛేదం కలిగినపుడు దుఃఖసాధనములను ద్వేషించును. దుఃఖ హేతువులను పరిహ రింపలేనివాడు మోహమును జెందును. ఈ విధముగా ద్వేష మోహాలకు సంబంధించిన కర్మాశయములు కాయిక మానసిక వాచిక భేదములతో మూడు విధములగును. ఇట్టి కర్మాశయములయొక్క పరిణతియే దుఃఖము. ఇదే పరిణామ దుఃఖమనబడుచున్నది. మనుష్యుడు సుఖాన్ని అనుభవిస్తున్నప్పుడు

తనకెప్పటికిని సుఖభంగముండరాదని తలంచి సుఖ వ్యతిరేక సాధనములను ద్వేషించుచు సంతాపమును పొందును. పిదప ఆ సాధనములను పరిహరించు నిమిత్తము ప్రయత్నించును. అప్పుడు ద్వేషమునకు సంబంధించిన త్రివిధ కర్మాశయములు కల్గును. దుఃఖ సాధకములను పరిహరించు శక్తి లేక మోహముచెందును. అప్పుడు మోహజాత కర్మాశయమేర్పడును. ఇట్లే సుఖాను రక్తుడయిన వ్యక్తి సుఖములభిషించును. దుఃఖ సాధనములను అపహసించును. దీనివలన రాగజన్య కర్మాశయము కల్గును. వాటివల్ల దుఃఖమేర్పడును. ఇట్టి దుఃఖమునకు దుఃఖమని పేరు.

సుఖదుఃఖముల ననుభవించుట వలన ఆ విషయాలకు చెందిన సంస్కారములు కల్గును. ఆ సంస్కారముల వలన తిరిగి స్మృతి వీర్పడును. స్మృతి వలన రాగం కలుగును. రాగమువలన మనోవాక్కాయములందు ప్రవృత్తి సంభవించును. ప్రవృత్తి వలన కర్మాశయములు. వాటి వల్ల సుఖదుఃఖములు వాటి అనుభవము వలన సంస్కారములు, వాటివలన తిరిగి స్మృతి, తిరిగి ప్రవృత్తి, తిరిగి కర్మాశయము, తిరిగి సుఖము, తిరిగి దుఃఖము అని సంస్కార చక్రము వలన సంభవించే దుఃఖమునకు అంతు ఉండదు. ఇట్టి దానిని సంస్కార దుఃఖమని వ్యవహరింతురు. విషయ సుఖం కూడా పరిణామ తాపసంస్కార దుఃఖత్రయముతో నిండియుండుట వలన దుఃఖమే యగుచున్నది. కావున దుఃఖమువలె సుఖము కూడ హేయమేయని, 'పరిణామ తాపసంస్కార దుఃఖైః, గుణవృత్తి విరోధాచ్చ దుఃఖమేవ సర్వం వివేకినః' అని మహర్షి నిర్దేశించినాడు. ఇట్టి దుఃఖము కలుగకుండుటకు క్రియాయోగము అవసరము. సమాహిత చిత్తులైన యోగులకు యోగోపాయమున్నట్లే రాగద్వేషాది కాలుష్యమలపూర్ణమైన మధ్యమాధికారులకు యోగసాధన నిమిత్తం క్రియాయోగం నిర్దేశింపబడినది. క్రియాయోగం లేకుండ క్లేశములు తొలగవు. క్లేశములు తొలగకున్నచో సమాధి సిద్ధింపదు. అందువలన క్రియాయోగముద్వారా చిత్తశుద్ధి యేర్పడి యోగమార్గ ప్రవేశము సిద్ధించుచున్నది. పతంజలి మహర్షి, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము (తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః) అను మూడింటికి క్రియాయోగమని పేరు. శ్రీకృష్ణుడు భగవద్గీతలో యోగములో ప్రవేశించే వారి ప్రథమ కర్తవ్యము క్రియా యోగమన్నాడు. యాజ్ఞవల్క్యుడు

- 'విధినోక్తేన మార్గేణ కృచ్ఛ్రచాంద్రాయణాదిభిః శరీరశోషణం ప్రాహుః తపసాం తప ఉత్తమమ్'. శాస్త్ర నిర్దిష్టమార్గమున విధిగా నొనరించే కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతముల ద్వారా కలిగే శరీరశోష ఉత్తమ తపస్సుగా తెల్పినాడు. కాని ఇంద్రియనిగ్రహాన్ని మించిన తపస్సు వేరొకటిలేదు. శీతోష్ణాది ద్వంద్వములను ఓర్చుకొనుట, మితము హితమునైన ఆహారమును గ్రహించుట మున్నగు వాటిని తపస్సని యందురు. ఇట్టి తపస్సు చేయలేని వానికి యోగము సిద్ధింపదు. అనాది కాలమునుండి వస్తున్న కర్మాశయములచే చిత్రవిచిత్రంగా సన్నిహితమైయున్న విషయజాలమూలమున యేర్పడే చిత్తమాలిన్యము తపస్సుచేయకుండా తొలగదు. అందువలన క్రియాయోగమునకు తపస్సు ప్రధానంగా పేర్కొనబడినది. తపస్సు కూడా శరీరములో ధాతువులు విషమింపకుండా అనుష్ఠింపవలసియున్నది. పవిత్రమైన ఓంకారాది మంత్రముల జపము, మోక్షమార్గ బోధకములైన వేదశాస్త్ర ఉపనిషదాదుల అధ్యయనము స్వాధ్యాయ మనబడుచున్నది. సర్వనియామకుడు, సర్వేశ్వరుడునైన పరమాత్మునియందు కాయిక వాచిక, మానసిక కర్మల ఫలములనర్పించుట ఈశ్వర ప్రణిధానము. ఇట్టి తపస్స్వాధ్యాయ ప్రణిధానముల వలన చిత్తశుద్ధిగలిగి యోగము సాధింపబడుచున్నది. వ్యుత్థితులకు, అనగా చిత్తశుద్ధిలేనివారికి క్రియాయోగము ఎంతో అవసరము.

## అష్టాంగయోగములు :

మహర్షి పతంజలి చిత్తవృత్తినిరోధము యోగమనినాడు. వ్యాసుడు సమాధిని యోగమనినాడు. ఇంద్రియముల శుద్ధిద్వారా యోగమలవడుచున్నది. త్రికరణశుద్ధికి 8 మార్గములు తెల్పబడినది. వీటిని యోగమార్గము, అష్టాంగ యోగమని వ్యవహరింతురు. యోగము సిద్ధించిన వెంటనే అనేక సిద్ధులు వశముకాగలవు. యోగాభ్యాసము కొరకు శరీర మన ఇంద్రియముల సంయమము ముఖ్యము. యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధులనునవి అష్టాంగములు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనునవి 5 మనస్సుతో పాటు ఇంద్రియములను విషయమునుండి ఉపరమింపచేయుచున్నవి. వీటికి యమము అని పేరు. మనోవాక్కాయముల ద్వారా ఎప్పుడు ఏ ప్రాణికి బాధ కలిగింపకుండుట

అహింస.

**సత్యము :** చెప్పదలచినపుడు త్రికరణశుద్ధిగా చెప్పుట, ఆలోచించుట.

**అస్తేయము :** సర్వదా పరద్రవ్యమును అపేక్షింపకుండుట.

**బ్రహ్మచర్యము :** మనోవాక్కాయకర్మల ద్వారా జననేంద్రియమును నిగ్రహించుకొనుట.

**అపరిగ్రహము :** దేహయాత్రకు సరిపడినంత గ్రహించి, అధికముగా గ్రహింపక పోవుట అపరిగ్రహమనబడును. .

కొన్ని గ్రంథములలో 'అహింసా సత్య మస్తేయం బ్రహ్మచర్యం దయార్జవం, క్షమాధృతిర్మితాహారః శౌచంచేతి యమా దశ' అని 10 యమములు చెప్పబడినవి. జాతి దేశ సమయాలను అపేక్షించకుండా పూర్వోక్త యమములు అనుష్ఠించుట మహావ్రత మనబడుచున్నది. ఇదే మాటను 'జాతి దేశకాల సమయానవచ్ఛిన్నాః సార్వభౌమ మహావ్రతమ్' అను సూత్రము తెల్పుచున్నది. జాతి సంకుచితము దేశసంకుచితము కాలసంకుచితము సమయసంకుచితము అయిన యమములు మహావ్రత మనబడుచున్నవి.

**జాతి సంకుచితము :** కొందరు చేపలను తప్ప ఇతరముల వేటని హింసించరు. వాటిని తప్ప మిగిలిన వాటిని హింసించినచో అవి జాత్యావచ్ఛిన హింస అనబడుచున్నది.

**దేశ సంకుచితము :** 'కాశిలో ప్రాణి హింసచేయరు' అని కొన్ని ప్రదేశములో హింసను మానుట దేశసంకుచితము.

**కాల సంకుచితము :** ఏకాదశినాడు మాత్రము ప్రాణులను హింసించను అనుట కాల సంకుచితము.

**సమయ సంకుచితము :** సమయ మనగా ప్రతిజ్ఞ. నా కొరకు హింసించుటలేదు. ఇతరుల కొరకు హింసిస్తున్నానని, వారు హింసించమంటే హింసిస్తున్నానని ప్రతిజ్ఞ కావించి పరబోధవల్ల హింసను విరమించుట సమయసంకుచితము.

ఏ అపవాదము లేకుండా ఏ ప్రాణిని హింసింపకుండా ఉండుటయే

మహావ్రతము.

## నియమములు :

శౌచ సంతోష తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానములు నియమములు. శౌచ మనగా శుద్ధి. ఇది రెండు విధములు. బాహ్యం, అంతరం. పవిత్ర మృత్తికాజలాదులతో కావించే శరీర శుద్ధి, సాత్త్వికాహారాది సేవనలవ లన ఉదరశుద్ధి బాహ్యశుద్ధి యనబడును. మైత్రీకరుణాది మూలమున చిత్తమలములైన రాగద్వేషములను పోగొట్టుకొనుట అభ్యంతర శుద్ధి. జీవన యాత్రకు కావలసిన ఉపకరణములకుమించి సాధనసామగ్రిని సంపాదించకుం డుట, సమకూడిన సాధనలతో తృప్తి పడయుట సంతోషము. శీతోష్ణములు మానావమానములు క్షుత్పిపాసలు మున్నగు ద్వంద్వములను సహించుట, హితము మితమునైన ఆహారమును గైకొనుట తపస్సు. ప్రణవాది జపము వేదవేదాంతాది శాస్త్రవిచారము స్వాధ్యాయము. సర్వేశ్వరుని యందు సర్వకర్మ ఫలార్పణము కావించుట ఈశ్వర ప్రణిధానము.

## ఆసనము :

యోగసిద్ధికి అనుగుణముగా స్థిరముగా సుఖముగాను ఉపవేశించుట ఆస నము. పద్మాసన వీరాసన భద్రాసనాదులు యోగసిద్ధిని కలిగించును.

## ప్రాణయామము :

శ్వాసప్రశ్వాసల గతులను నిరోధించుట. బయటి వాయువును పీల్చుట శ్వాస, లోపలి వాయువును వెలుపలికి పంపించుట ప్రశ్వాసము. రేచక పూరక కుంభక భేదమున ప్రాణాయామము త్రివిధము. లోపలి వాయువును వెలుపలికి పంపించుట రేచకము. వెలుపలి వాయువును లోపలికి తీసికొ నుట పూరకము. శ్వాసను బిగవట్టుట కుంభకము. యమనియమాదుల ద్వారా సంస్కృతమైన చిత్తసత్త్వము విషయదోషములను పసిగట్టి విరక్త మగును. రాగద్వేషములను కలిగించు శబ్దాది విషయములతో సంబంధము పెట్టుకొనదు. నిరుద్ధమై తత్త్వాభిముఖ మగును. దీనివలన చిత్తమునకు లోబడియుండే ఇంద్రియములు శబ్దాది స్వస్వవిషయములతో సంబద్ధము కాకుండ తమకు తామే నిరుద్ధములగును. ఈ విధముగా చిత్తమువలె

ఇంద్రియములు స్వస్వవిషయములతో సంపృక్తములు కాకుండుటయే ప్రత్యాహారము. యమాదులను అనుష్ఠించుటచే నిర్మలమై చిత్తసత్త్వము తత్త్వాభిముఖమగును. ఇట్టి చిత్తము ఈశ్వరునకు జీవునకును స్థానమైన హృదయము పుండరీకమనబడుతుంది. సహస్రారజ్యోతిని లేదా చంద్రసూర్యాది దివ్యజ్యోతులనుగాని ఆధారపరచుకొని వాటియందు నిలపబడి వాటి యాకారములు పొందుటయే ధారణయనబడును. ఒకదాని యందు స్థిరముగా చిత్తమును నిలుపుట ధారణ అనబడును. ధ్యేయవస్తువునందు చిత్తసత్త్వము నిల్పబడినచో, బుద్ధియందు ఆ ధ్యేయవస్తువునకు సంబంధించిన ప్రత్యయము లేదా జ్ఞానము తప్ప ఇతర వృత్తి కలుగకుండుట ధ్యానము. ధ్యానము అభ్యసించిన కొలది ప్రత్యయాత్మకమైన స్వస్వరూపమును విడిచి కేవలము ధ్యేయాకారమున భాసించును. ధ్యేయవస్తుజ్ఞానము ఉండదు. ధ్యేయము మాత్రమే భాసించును. ఇట్టి స్థితికి సమాధి యని పేరు.

ధ్యేయవస్తువు మాత్రము ప్రకాశిస్తున్న సమాధి సంప్రజ్ఞాత సమాధియని, ధ్యేయవస్తువు యొక్క ప్రకాశము కూడ లేని సమాధి అసంప్రజ్ఞాత సమాధి యని యోగ శాస్త్రం తెలుపుతుంది. అష్టాంగ యోగముల సమ్యగనుష్ఠానం వల్ల చిత్తమందలి మలము పూర్తిగా క్షాళితమగును. అవిద్యాది క్లేశములు నశించిపోవును. తత్త్వజ్ఞానము సిద్ధిస్తుంది. వివేకఖ్యాతి సంపూర్ణంగా ప్రకాశిస్తుంది.

**భూత విజయము :** పంచభూతాలను జయింపకుండా అష్టసిద్ధులు ఒనగూడవు. స్థూలం స్వరూపం సూక్ష్మం అన్వయం అర్థవత్వం అనువాని సంయమనంవలన పంచభూతాలపై ఆధిపత్యం సంపాదించ వీలగును. పృథివీ జల తేజో వాయ్వాకాశములనునవి పంచభూతములు. ఇవి 5 రూపములతో నుంటున్నవి. వీటి యొక్క విశిష్ట రూపం స్థూలమనబడుతుంది. ఈ పంచభూతముల యొక్క ధర్మములకు స్వరూపమని పేరు. గంధాది తన్మాత్రలను సూక్ష్మములందురు. ప్రకాశ క్రియాస్థితులను అన్వయమంటారు. పురుషుని యొక్క భోగాపవర్గములకు అర్థవత్త్వమని పేరు. ప్రతి దృశ్యవస్తువునకు పూర్వోక్త పంచరూపములు ఉండును. పంచభూతముల యొక్క పంచవిధరూపములను సంయమనం కావించుట భూతవిజయము

అనబడుతుంది. అపుడు పంచభూతాలు తద్విజయం గావించిన యోగికి స్వాధీనములగును. ఆవు వెంట లేగ పరుగెత్తినట్లు సంకల్పమాత్రమున యోగి వెంట భూత ప్రకృతులు అనుగమిస్తాయి.

**సిద్ధులు :** పంచభూతములను జయించిన వానికి సిద్ధులు లేదా విభూతులు వశమగును. సిద్ధులు ఎనిమిది.

**అణిమ :** ఏదేని వస్తువుయొక్క సూక్ష్మతమమైన రూపమునకు అణువని పేరు. అణువువలె తాను సూక్ష్మముగా అదృశ్యమగుట అణిమ అనబడుతుంది.

**లఘిమ :** శరీరం చాలా తేలికగా నేర్పరుచుకొనుట.

**మహిమ :** పర్వతంవలె శరీరాన్ని పెంచుకొనుట.

**ప్రాప్తి :** మనస్సులో తలచిన వస్తువును అనుకొన్నచోట స్వాధీన పరచుకొనుట.

**ప్రాకామ్యము :** ఏ విధమైన బాధ లేదా ప్రయాస లేకుండ కోరిక ఈడేర్చుకొనుట.

**వశిత్వం :** పంచభూతములను, ఇతర భౌతిక పదార్థములను తన చెప్పుచేతలలో నుంచుకొనుట.

**ఈశిత్వం :** పాంచభౌతిక పదార్థాలను అనుకొన్నప్పుడు (ఉత్పత్తి గావించుట) పుట్టించుట గిట్టించుట.

**యథాకామావసాయిత్వం :**

సాధకుడైన యోగి సమస్త సంకల్పములను పూర్తిచేసికొనుట, ఈడేర్చుకొనుట యథాకామావసాయిత్వం. ఈ విధంగా పంచభూతాలను జయించి, సిద్ధులనుబడసిన యోగికి యోగమార్గమున ఎట్టి అవరోధము ఉండదు. ఈ స్థితి చేరుకొన్న యోగి శిలలోనైనా ప్రవేశిస్తారు. వానిని నీరుకూడా తడపలేదు, అగ్నిదహింపలేదు. కైవల్యము అతనికి చేరువ అవుతుంది.

## కైవల్యము :

యోగదర్శనములో కైవల్యపదం మోక్షార్థమున ఉపయోగింపబడినది. కైవల్యమనగా కేవలంగా ఉండటం. తాను ఏ ఇతరముతో కలువకుండ సంబంధించకుండ తన రూపంలోనే ఉండిపోవటం కైవల్య పదమునకర్థం. మహదాది ప్రకృతి కార్యాలు నశించిపోగా ప్రకృతితో పురుషునకు ఆత్యంతిక వియోగము ఏర్పడగా పురుషునకు కైవల్యస్థితి ఏర్పడుతుంది. ఆత్మ ఉపాధిరూపాల నన్నిటిని విసర్జించుకొని స్వస్వరూపమున భాసిల్లటం కైవల్యమనబడుతుంది. కైవల్యము సిద్ధించిన పిదప పురుషునకు మహదాది ప్రకృతి కార్యాలతో సంబంధం తిరిగి ఏర్పడదు. మహర్షి పతంజలి 'పురుషార్థ శూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూప ప్రతిష్ఠా వా చితిశక్తిరితి'. కార్యకారణాత్మకములైన గుణములు బుద్ధ్యాది కార్యములు పురుషుని నిమిత్తము భోగాపవర్గములను నెరవేర్చిన పిదప కృతకృత్యములై స్వస్వకారణములందు విలీనమగుచు, చిట్టచివర ప్రకృతి యందు విలయం చెందును. నిరోధ సంస్కారములు మనస్సునందు, మనస్సు అస్మితయందు, అస్మిత మహత్తత్త్వమునందు, మహత్తత్త్వము అలింగమయిన ప్రకృతియందు ప్రళయం చెందును. ఈ గుణప్రళయమునకు లింగ శరీరభంగమను పేరు కలదు. లింగ శరీరభంజన వలన వృత్తి సారూప్యము ఉండదు. కాబట్టి పురుషుడు స్వస్వరూపావస్థానముచెంది, నిరంతరము పరమ పురుషసాక్షాత్కారము కావించుకొని తత్స్వరూపమైన ఆనందమును అనుభవించును. ఇందు పురుషార్థ శూన్యములైన గుణముల ప్రతిప్రసవము అనగా ప్రళయము చేకూరిన వెంటనే పురుషుడు స్వస్వరూపస్థితుడగును. కావున గుణప్రళయములేదా చిచ్ఛక్తి స్వరూపస్థితి కైవల్య మనబడుతుంది.

## ఈశ్వరుడు :

యోగదర్శనంలో ఈశ్వరునకు విశిష్ట స్థానం ఉంది. ఈశ్వర ప్రణిధానంవల్ల సమాధి సిద్ధిస్తుంది. మహర్షి పతంజలి ఈశ్వర తత్త్వమును మరియు అతని స్వరూపమును రెండు, మూడు సూత్రముల ద్వారా తెలిపినాడు.

'క్లేశకర్మవిపాకాశైరపరామృష్టఃపురుషవిశేషః ఈశ్వరః'. అవిద్యాది క్లేశ

ములు ధర్మాధర్మములనెడి కర్మలు తత్కర్మఫలములైన జాత్యాయుర్భోగము లనే విపాకములు, వాటికి సంబంధించిన వాసనలు అనువాటిచే ఏమాత్రము సంబంధించకుండా ఉండే ఉత్తమ పురుషుడు లేదా పరమపురుషుడు ఈశ్వరు డనబడును. కైవల్యం అనుభవించు జీవులు క్లేశాదులతో సంబంధించకుండా ఎందరో ఉన్నారు. వారికంటే భిన్నంగా మరోవ్యక్తిని ఈశ్వరునిగా అంగీ కరింపనేలయని శంకింపరాదు. ఎందుకనగా కైవల్యము అనుభవించకముందు జీవులకు క్లేశాదులతో సంపర్కముండి విదేహులను, ప్రకృతి లీనులకు కాలాం తరమందు క్లేశాదులతో సంబంధం ఉండి తీరుతుంది. కాని ఈశ్వరుడు పూర్వమునగాని పరమునగాని ఎన్నడును క్లేశాదులతో సంపర్కంజెందకుండా సదా ముక్తుడయి ఉన్నాడు. మరియు మానవులలో భూతభవిష్యద్వర్తమాన వస్తువిషయక జ్ఞానం ఒకనిలో తక్కువగా, ఇంకొకనిలో కొంత ఎక్కువగా మరొక్కనిలో అంతకంటె ఎక్కువగా గోచరిస్తుంది. ప్రతి వ్యక్తిలో ఉండే జ్ఞానం, ఇతరుల జ్ఞానం కంటె కొంచెం ఎక్కువగానో తక్కువగానో ఉండటం గమనిస్తున్నాము. విషమమైన ఈ జ్ఞానమునకు సాతిశయ జ్ఞానమని పేరు. ఉసిరికాయ, వెలగకాయ, తాటికాయ, గుమ్మడికాయ మొదలైన వాటిలోని పరిమాణం తరతమంగా ఉంది. ఆకాశాది విభుపదార్థాలలో అదే పరిమాణం నిరతిశయంగా గోచరిస్తుంది. అట్లే నీవు నేను అతడు అనబడే వ్యక్తులలో గోచరించే జ్ఞానం సాతిశయంగా కలదు. అదే ఒకానొక గొప్పవ్యక్తిలో నిరతిశ యంగా పూర్ణంగా అనగా ఆ జ్ఞానమును మించిన జ్ఞానం ఇతరత్ర ఉండని విధంగా ఉండవచ్చును. అట్టి నిరతిశయ జ్ఞానాశయతత్త్వమే 'నిరతిశయ సర్వజ్ఞబీజం' ఈశ్వరు డనబడుతున్నాడు. అతడు పూర్వపూర్వకల్పాదులలో ఉత్పన్నులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులకు కూడా అంతర్యామిగా గురు వుగా నున్నాడు. కాలపరిమితిగల బ్రహ్మాదులు కాలపరిమితిలేని గురువులేకుండా సంభవింపరు.

వేదాదులు ఈశ్వరుణ్ణి బహుముఖంగా స్తుతించుటవల్ల శబ్దప్రమాణంవల్ల ఈశ్వరసత్త సిద్ధిస్తుంది. ఈశ్వరుడు జగత్తునకు నిమిత్త కారణం. అతడు ప్రకృతి పురుషులకు సంబంధం ఏర్పరుస్తున్నాడు. ప్రకృతి పురుష సంప ర్కంవల్ల సృష్టి కలుగుతుంది. ప్రకృతి పురుషులు విభిన్న తత్త్వాలు. ప్రకృతి అచేతనం పురుషుడు చేతనుడు. నిరీహుడు. విభిన్నతత్త్వాలైన ఇట్టి ప్రకృతి

పురుషుల సంయోగవియోగములు అన్యపురుష ప్రేరణ లేకుండా సంభవిం పదు. ఆ ఇరువురి సంయోగవియోగములకు ఈశ్వరుడు కారకుడగుట వలన కారణన్యాయమున ఈశ్వరుడు సిద్ధిస్తున్నాడని మహర్షి పతంజలి యోగదర్శనమున పేర్కొన్నాడు.

ఈ విధంగా యోగదర్శనము ఈశ్వర తత్త్వమును ప్రతిపాదిస్తూ సాంఖ్య మునకు పూరకంగా నిలిచినది. సాంఖ్యదర్శనము తత్త్వమీమాంస యయినచో యోగ దర్శనము అనుష్ఠాన మీమాంస అవుతుంది.

సర్వదర్శన సంగ్రహకర్త అథ శబ్దముపైన యోగపదముపైన విస్తృతంగా విచారణ కావించినాడు. పిదప చిత్తవృత్తినిరోధం చిత్తమునకు విషయాలతో ఉండే సంపర్కం త్రివిధ పరిణామం సమాధి నిరూపణ పంచప్రకార క్లేశములు అభినివేశం కర్మవిపాకాశయములు, వృత్తి నిరోధోపాయములు వివే చింపబడినవి. యోగదర్శనము పేర్కొనని మంత్ర విచారం మంత్రమునకు సంబంధించిన సంస్కారములు తెలుపబడినవి. అందు మననం చేయువానికి త్రాణం కల్పించునది. కావున మంత్రమనబడుతుంది. తపస్స్వాధ్యాయేశ్వ రప్రణిధానములు క్రియాయోగ మనబడును అనీ, ప్రణవ గాయత్రీ ప్రభృతి మంత్రాధ్యయనం స్వాధ్యాయం అనబడునని తెలుపబడింది. మంత్రములు వైదిక తాంత్రిక భేదమున రెండు విధములు. అందు వైదికము ప్రగీత అప్రగీత భేదమున 2 విధములు. గానము చేయబడెడి సామము ప్రగీత ములు, గానము చేయబడనట్టివి అప్రగీతములు. అప్రగీతములు 2 విధములు. ఛందోబద్ధములు ఛందోరహితములు అని. ఋక్కులు ఛందోబద్ధములు. యజుస్సులు ఛందోరహితములు. ఇక కామిక కారణ ప్రపంచాది ఆగమములు తంత్రము లనబడును. తంత్రోక్తములైన మంత్రములు తాంత్రికములు. స్త్రీ పుం నపుంసక భేదమున మంత్రములు 3 విధములు. స్వాహాన్త మంత్రములు స్త్రీలింగ మంత్రములు. నమోన్తములు నపుంసకములు. తదితరములు పురుషములు. ఇట్టి తాంత్రిక మంత్రములకు దశవిధ సంస్కారములు ఉండును. జననం జీవనం తాడనం బోధనం అభిషేకం విమలీకరణం ఆప్యా యనం తర్పణం దీపనం గోపనం అనునవి దశ విధమంత్ర సంస్కారములు. మాతృకాయంత్రం నుండి మంత్రముల నుద్ధరించుట జననం. వీటి వివ

రణ సర్వదర్శన సంగ్రహములో పాతంజల దర్శన భాగంలో ఇవ్వబడింది. అటుపిదప క్రియా యోగచర్చగావిస్తూ లక్షణావృత్తి నిరూపింపబడినది. కావ్య శాస్త్రమున పేర్కొనిన భేదములన్నీ పాతంజల దర్శనమునందు సర్వ దర్శన సంగ్రహ కర్త ఉల్లేఖించినారు. అష్టాంగయోగములను గురించి సంక్షేపంగా వివరణ గావింపబడింది. ప్రాణాయామ సామాన్య లక్షణం చెప్పుచూ విస్తృతంగా వాయుతత్త్వమును నిరూపించినారు. ప్రాథమకల్పిక, మధుభూమిక ప్రజ్ఞాజ్యోతి అతిక్రాంతభావనీయ భేదమున వుండే చతుర్విధ యోగుల ప్రస్తావన కావింపబడినది.

ఇట్లు సర్వదర్శనసంగ్రహమున దర్శనాంతరములవలె సాంఖ్యయోగములు గూడ అన్యూనానతిప్రసక్తముగా చక్కగా ప్రతిపాదింపబడినవి. ఒకే భూమికపై దర్శనముల న్నింటిని క్రమబద్ధము గావించి భావితరములకు దర్శనపరిజ్ఞాము నందించిన శ్రీవిద్యారణ్యుల వారికి విద్వజ్జగత్తు యెంతో ఋణపడి యున్నది.